# చతుర

సంపుటి : 4 జూన్ 1981 సంచిక : 5

## ఈ నెల సమగ్ర నవల

ఆమె చుట్టూ బాధ్యతల బరువులున్నాయి, కలలున్నాయి, కన్నీళ్ళున్నాయి, అసూయతో వెంటాడే లోకం ఉంది. అయినా ఆమె అంతరంగంలో చెలరేగే కోరికలు...కాంక్షలు...అనుభూతుల కలవరింతలు ముప్పేటలుగా ముడులు వేసుకున్నాయి. అదే సమయంలో ఆమె జీవన ప్రాంగణంలోకి తలవని తలంపుగా అతను ప్రవేశించాడు. చొరవగా కొత్త అనుభూతులకు వాకిళ్ళు తెరిచాడు. అతని ప్రేమలో...ఆరాధనలో...ఉక్కిరిబిక్కిరై కరిగిపోయిందామె. ఆ ప్రేమామృతపు వెల్లువలో తనివితీరా తడవాలనుకున్నారు. ఈ మనుషులకి దూరంగా...తమ కలలు—

## వెన్నెల నీడ

ల్లా కాలిపోకుండా వినూత్న ప్రపంచంలో వెలుగుల తోరణాలు కడదామనుకున్నారు. అంతా వారనుకున్నట్టే జరిగిందా ?

తనను చుట్టుముట్టి ఉన్న బాధ్యతల వలయం నుండి ఆమెకు విముక్తి లభించిందా ?

అతనామెను వెన్నెల వెలుగుల మరో లోకానికి తీసుకుపోగలిగాడా?...

అణువణువునా సంక్లిష్టత నిండిన నేటి ఆర్థిక, సామాజిక వ్యవస్థలో ఆధునిక రాలైన ఒక స్త్రీ అంతరంగ మథనాన్ని అద్భుతంగా చిత్రించిన ప్రముఖ రచయిత్రి

### ఉషాప్రియంవద

రచన 'పచ్ పస్ ఖంబే లాల్ దివారే'కి

*గులాం గౌస్*

సమర్థవంతమైన అనువాదం 'వెన్నెల నీడ' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం : టి. శ్రీనాథ్

రెండవ, మూడవ కవర్లు : సూరజ్ ఎన్. శర్మ

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతున్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.

# శుభ్రమైన తాజా శ్వాస... ఆరోగ్యవంతమైన గట్టి పళ్ళు



## కోల్గేట్ డెంటల్ క్రీమ్ ఫలితం

ప్రతిసారి భోజనం చేసిన తర్వాత కోల్గేట్‌తో మీ పళ్ళను తోమకుండి. కోల్గేట్ ప్రపంచమంతటా దంతవైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.

కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పని చేస్తుందంటే:



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను, బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

**కోల్గేట్‌లోని తాజా పిప్పరమెంట్ లాంటి రుచి మీ మనసుకు నచ్చుతుంది.**

**నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి!**




పరిపూర్ణమైన దంతరక్షణ కోసం
కోల్గేట్ ప్లైగార్డ్ టూత్ బ్రష్‌లనే వాడండి.
మూడింతలు మేలైనవి



1 పళ్ళ ఎనామెల్‌కి రక్షణ
2 పళ్ళ పొరబారినుండి
3 చిగుళ్ళకు రక్షణ

DC.G.74 TL

# చతుర

## ఉడ్ బి డాక్టర్

ప్రభుత్వ హాస్పిటల్‌లోని జనరల్ వార్డు రకరకాల రోగులతో నిండిపోయి ఉంది. పదో నెంబరు బెడ్‌మీద రామారావ్ నీరసంగా పడుకొని ఉన్నాడు. వారం క్రితం విపరీతంగా వచ్చిన కడుపు నొప్పి అతడిని హాస్పిటల్‌కు జేర్చింది. ఈ వారం రోజులూ మృత్యువుతో పోరాడి నెగ్గుకొచ్చాడతను. ఇంకొన్నేళ్లు బ్రతకడానికి సరిపడే శక్తిని సమకూర్చుకొనే స్థాయిలో ఉంది ఇపుడతని ఆరోగ్యం !

ప్రతిరోజూ ఉదయం 'పెద్ద' డాక్టరు రోగుల్ని చూడటానికి రౌండ్స్‌కు వస్తాడు. డాక్టర్ వెంట రోజుకు యిద్దరు వైద్య విద్యార్థులు గానీ, విద్యార్థినులు గానీ వస్తూ ఉంటారు.

రామారావ్ కేస్‌ను స్టడీ చెయ్యమని ఆరోజు తన వెంట వచ్చిన మెడికో మిస్ నీలకు చెప్పాడు డాక్టరు. నీల రామారావ్ 'కేస్ షీట్'ను పైనుంచి కిందకు చూసింది. తర్వాత స్టెతస్కోప్‌తో శత పరీక్షలు చేసి, అవి పూర్తయిన తర్వాత రామారావ్ చొక్కాను అతని పొట్టమీద నుండి పైకి లాగింది.

"మీకు నొప్పి ఇదివరకు ఎక్కడ నుండి వచ్చేదండీ ?" అంటూ అతని పొట్టను అక్కడక్కడా నెమ్మదిగా నొక్కుతూ పరీక్షించడం మొదలు పెట్టింది. మరుక్షణం "అయ్యో! అమ్మో! చచ్చానోర్రియ్" అంటూ రామారావ్ వేసిన కేకలో ఆ వార్డు దద్దరిల్లిపోయింది. డాక్టరూ, నర్సులూ... పరుగు పరుగున రామారావ్ బెడ్ దగ్గరకు చేరారు.

అందరి ముఖాల్లోనూ ఆందోళన !

'పెద్ద' డాక్టర్ గాభరాగా రామారావ్‌ను పరీక్షించసాగాడు. పూర్తిగా తగ్గిపోయిందనుకొన్న కడుపునొప్పి అకస్మాత్తుగా మళ్ళీ ఎందుకు వచ్చిందో అంతు పట్టలేదు డాక్టర్‌కు.

ఈలోగా మెడికో నీల కొస్త తేరుకొని, "డాక్టర్! ఈయన కడుపులో మళ్ళీ ఏదో పుండు లేచినట్లుగా ఉంది. ఇదిగో ఇక్కడ నొక్కితే చాలా బాధపడిపోతున్నాడు" అంటూ ఇంకోసారి రామారావ్ పొట్టను నొక్కడం మొదలు పెట్టింది.



# కితలు

మళ్ళీ హాస్పిటల్ అదిరిపోయేలా కేకలు వేయసాగాడు రామారావ్. డాక్టరుకు ఈసారి మతిపోయినంత పనయింది. పరిశీలనగా చూశాక నవ్వు ముంచుకు వచ్చింది.

వెంటనే ఆయన నీలను పక్కకు పిల్చి, "మిస్ నీలా! ముందు నువ్వు వెళ్ళి ఓ 'నెయిల్ కటర్' కొనుక్కొని నీ గోళ్ళను కట్ చేసుకునిరా! డాక్టర్‌గా స్థిరపడాలంటే–అలా గోళ్ళు పెంచుకుంటే లాభం లేదు. నువ్వు అనుకొంటున్నట్లు రామారావుకు కడుపులో ఏ పుండూ లేదు. నీ గోళ్ళ పుణ్యమా అని అతడి పొట్టమీద పుండ్లు పడ్డాయి. వెళ్ళి చూడు! అందుకనే అతడలా కేకలు పెడ్తున్నాడు" అన్నాడు నవ్వుతూ.

—శోభ

## ఏం చేస్తారు?!

**ఆ**కాశం నిండా ఇపుడో, ఇంకోక్షణంలోనో పెద్ద వాన పడేంత దట్టంగా మబ్బులు పట్టాయి. తెల్లవారితే ఆదివారం. ఆఫీసుకెళ్ళక్కర్లేదు. మా ఆవిడకున్న వెంకటేశ్వరస్వామి భక్తి పుణ్యమా అని హాయిగా ఇద్దరం ముందు గదిలో కూర్చుని పెసరట్లు ఆరగిస్తున్నాం. ఏ మాటికామాటే చెప్పుకోవాలి మా ఆవిడ పెసరట్లు వేయడంలో ఘనాపాటి.

ఇంతలో గేటు కిర్రుమన చప్పుడు చేసుకుంటూ సీతాపతి హడావుడిగా వచ్చాడు. "పెసరట్లారగిస్తున్నట్లున్నారే" అంటూ నా ప్లేట్లోంచి ఓ ముక్క విరిచి నోట్లో వేసుకుని "ఫస్టూ, బాగా చేశావమ్మా!" అని మా ఆవిడకేసి ఓ మెచ్చుకోలు విసిరాడు.

చల్లని సాయంకాలం చట్టు బండలు చేసింది చాలక ఈ మెప్పులోటా అన్నట్లు చూసి ఖాళీ ప్లేట్లతో వంటింట్లోకి వెళ్ళిపోయింది మా శ్రీమతి.

"నీకో విషయం చెప్పాలని వచ్చానోయ్. మిమ్మల్నేమీ డిస్టర్బ చేయలేదు కదా!" అన్నాడు వుపోద్ఘాతంగా.

"నో! నో! అలాంటిదేంలేదు చెప్పు. నీకింకా శ్రోతలు కావాలంటే మా ఆవిణ్ణీ, పక్కింటివాళ్ళనీ కూడా పిలుస్తాను" అన్నాను కాళ్ళు ఎదురుగుండా స్టూలు మీద పెట్టుకుంటూ.



సీతాపతి నా హైస్కూలు సహాధ్యాయి. ఒకే కాలేజీలో ఒకే సారి పట్టాలు పుచ్చుకున్నాం. కానీ ఉద్యోగాలే ఓ చోట రాలేదు. వాడు బ్యాంకి ఉద్యోగి, నాది ప్రభుత్వ రెవెన్యూ డిపార్టుమెంటు. సీతిగాడు మంచి సరదా అయిన మనిషి. స్నేహితుడన్నవాడు కనిపిస్తే చాలు వాళ్ళు మాట్లాడే అవసరం లేకుండా గలగలా మాట్లాడేసి 'వస్తానోయ్' అంటూ వెళ్ళిపోతాడు. ఎపుడో అర్జంటు పని వుంటేనే గాని ఎవరిళ్ళకీ రాడు. బ్రహ్మచారిగాడు. బాదరబందీ లేదు. తల్లిదండ్రులంటే ప్రాణం. పెళ్ళికి మేనరికం స్థిరంగా వుంది. పిల్ల పెద్ద చదువుకోలేదు గానీ బుద్ధిమంతురాలు.

"మా బ్యాంక్‌లో ఓ తమాషా జరిగిందిరా! నీకు తెలుసుగా మా మేనేజర్‌కీ, నాకూ పడదని. ఈ మధ్య ఆ ఘర్షణ మరీ ఎక్కువైంది. పబ్లిగ్గా సలుగురిలోనూ చిన్నతనంగా మాట్లాడ్డం మొదలెట్టాడు. సహించాను. ఓ రోజు పర్సనల్‌గా పిలిచి 'నీ వ్యవహారం నాకేం నచ్చడం లేదు...' అంటూ అదీఇదీ వాగాడు. నాకు ఒళ్ళు మండింది. 'ఎంత మేనేజరయినా మీ లిమిట్స్‌లో మీరుండడం మంచిది. ఆఫీసు వ్యవహారాల్ని పర్సనల్ విషయాలతో ముడిపెట్టడం మంచిదికాదు. మీరు నన్నేం చేయలేరు. మహా అయితే ఆ మారుమూల పల్లెటూరు తోటపల్లి బ్రాంచికి బదిలీ చేయగలరు. అంతేకదా!' అని చెప్పి జవాబు కోసం ఎదురు చూడకుండా వచ్చేశాను".

"మరీ అంత తొందరపాటైతే ఎలా గురూ? ఆగాగు" అన్నాన్నేను. "గుడిమీద బ్రహ్మాస్త్రం బాగా పన్జేసింది తెలుసా! ఇదిగో ఇవాళ్ళే తోటపల్లికి బదిలీ చేస్తున్నట్లు ఆర్డర్సు వచ్చాయి" అని ఆర్డరు కాయితం తీసి చూపించాడు వాడు.

తోటపల్లి అతని సొంతవూరు. అమ్మా, నాన్న, అతని కోసం ఎదురు చూసే మేన మరదలు. "తంతే బూరెల బుట్టలో పడ్డావురా పతీ, అదృష్టం అంటే నీదే" అన్నాను అసూయగా.

"సర్లేహ పాచిక పారుతుందా లేదాని ఎంత మధన పడ్డానో నీకేంతెల్సు. అఫ్ కోర్స్ నౌ ఐయాం హాపీ. వస్తానోయ్! మీ శ్రీమతికి చెప్పు- నా రాక ఆవిడకి కోపం తెప్పించినట్లుంది. వంటిల్లు వదలడం లేదు" అంటూ కన్ను గీటి వానొచ్చేలా వుందని గొణుక్కుంటూ గబగబా వెళ్ళిపోయాడు.

## సంతాన లక్ష్మి

మా పక్కింటావిడ అసలు పేరు జ్ఞానప్రసూనాంబ అయినా ఆ చుట్టు పక్కల ఎవ్వరూ ఆవిణ్ణి ఆ పేరుతో పిలవరు. ఆవిడలో ఉన్న ఒకే ఒక్క సుగుణం మాకందరికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. మా ఇంటావిడకి ఆవిణ్ణి ఏ పేరంటానికి పిలవాలన్నా భయమే. వాళ్ళ ఆయనకీ, ఆవిడకీ కూడా భగవద్భక్తి మెండు. వాళ్ళాడపడుచు ఇద్దరు పిల్లల తర్వాత ఆపరేషన్ చేయించుకుందని, అసలామాట వినడమే మహాపాపమన్నట్లు భార్యాభర్త లిద్దరూ తమ పదహారుమంది సంతానంతోను తిరపతి వెళ్ళి ఇంటిల్లిపాదీ స్వామివారికి తల నీలాలు సమర్పించుకున్నారు.

ఇంతకీ ఆవిణ్ణి మేమంతా సంతానలక్ష్మి అని పిలుస్తాం. ఏమాటకామాటే చెప్పి

కోవాలి. అలా అన్నా ఆవిడ ఏమీ అనుకోదు. ఒక్కనాడు కూడా కోపం తెచ్చుకోలేదు. శుక్రవారం నాడు లేడీస్ డే అని కాలనీవాళ్ళం ఎగ్జిబిషన్‌కి వెళ్దామని ఓ మధ్యాహ్నం పిచ్చాపాటిలో తీర్మానించింది మా ఇంటావిడ. సరేఅంటే సరే అనుకున్నాం. త్వరగా వెళ్ళి 7,8 గంటలకల్లా తిరిగి వచ్చేయాలి అనుకున్నాం. పిల్లలు స్కూళ్ళలో ఉంటారు కదా వాళ్ళు ఎగ్జిబిషన్‌కి వచ్చే అవకాశం లేదని ఇలా పెందరాళే బయల్దేరేందుకు నిర్ణయించుకున్నాం.

కానీ, మా అభిప్రాయాలన్నింటినీ తల్లక్రిందులు చేసి పిల్లలందరిచేత అన్న బోర్డు, ఎడ్వర్టయిజింగ్ అరుపులు మమ్మల్ని ఆకర్షించాయి.

చిన్నా, పెద్దా అందరికీ అర్ధరూపాయి టిక్కెట్టంటే మాటలామరి. అందుకని సంతానలక్ష్మి టిక్కెట్లమ్మే అతని దగ్గరి కెళ్ళి "చూడబ్బాయ్!పదిహేనుమంది పెద్ద వాళ్ళమేగాక నా 16 మంది పిల్లలు కూడా వున్నారు – పిల్లలకేమైనా కన్సెషన్ ఇస్తావా?" అని అడిగింది.

"ఏమన్నారు! మళ్ళీ చెప్పండి. వీళ్ళంతా మీ ఒక్కరి సొంత పిల్లలేనా?!" అని ఆశ్చర్యంగా మరోసారి అడిగాడు.

"అవునండీ వాళ్ళంతా నా పిల్లలే.." అందా మాతృమూర్తి. "అయితే ఓ



మధ్యాహ్నం బడి మానిపించేసి అందర్నీ వెంటబెట్టుకుని ఎగ్జిబిషన్‌కి బయల్దేరింది సంతాన లక్ష్మిగారు.

దాదాపు ఎగ్జిబిషన్ అంతా తిరిగాం. "ఎప్పుడు చూసినా ఈ ఎగ్జిబిషన్ ఒకేలా వుంటుంది. దానికంటే మన సుల్తాన్ బజార్ నయం బేరమైనా ఆడచ్చు"–అని సాగదీసింది మా వెనకింటావిడ. చివరికి జెయింట్ వీల్ దాటి "చిత్ర విచిత్ర ప్రదర్శనలు" ధగ్గరికి వచ్చాం.

"రండి చూడండి. ఒక కన్ను, రెండు తలలు, మూడు చేతులు, నాలుగు కాళ్ళు వున్న వింత మనిషిని చూడండి – టిక్కెట్టు వెల యాభై పైసలు మాత్రమే" పన్నేయండి. మీరిక్కడే వుండండి ఈ వింతను చూడ్డానికి మా వాళ్ళందర్నీ పిలుచుకువస్తాను" అంటూ టెంటు లోపలికి పరుగెత్తాడతను.

## నిశాని

బుజ్జిగాడి కోరికలకి అంతుపంతు లేదు. చదువుకోవడం తప్ప ఏ పని చేయమన్నా ఎక్కడలేని హుషారు వస్తుంది. ఇద్దరాడ పిల్లల తర్వాత పుట్టిన పుత్రరత్నమని వాడి మీద కనకదుర్గకీ, కుటుంబరావుకీ

# తెలుగు సినీ పత్రికారంగంలో అగ్రగామి

## జ్యోతిచిత్ర

కన్నుల కింపైన వర్ణ
చిత్రాలతో

కవ్వించి నవ్వించే
సెట్సుపై కబుర్లతో

ముచ్చట గొలిపే
తారల ముచ్చట్లతో

ఇంటింటా
తారాతోరణంగా
వెలువడుతున్న
రంగుల హరివిల్లు





తగని గారాబం. వాళ్ళేమీ అనేవాళ్ళుకాదు సరికదా ఇంకెవరైనా ఏమన్నా అన్నాగాని బుజ్జిగాణ్ణే వెనకేసుకొచ్చేవారు దాంతో వాడు నెత్తెక్కి కూర్చున్నాడు. కుటుంబరావుకి మాత్రం తన తోటి ఉద్యోగులు, స్నేహితుల పిల్లలు చదువుల్లోనూ, ఆటల్లోనూ చురుకుగా వుండడం, తల్లిదండ్రులు చెప్పిన మాట వినడం చూస్తే ముద్దేస్తుంది. అదిచూసి ఇంటికొచ్చి చదువుకోరా గాడిదా అని కసిరితే చాలు ఎక్కడున్నా సరే బులెట్ ట్రైన్‌లా దూసుకొచ్చి అమాంతం బుజ్జిగాణ్ణి దగ్గరికి తీసుకుని 'మీది మరీ విచిత్రం, ఏదో చిన్నతనం, పిచ్చివెధవ. జ్ఞానం తెలిశాక వాడే అన్నీ నేర్చుకుంటాడు. చిన్నవాణ్ణి చేసి మరీ గట్టిగా కస[illegible]రా ఏం' అని సాగదీస్తుంది. కనకదుర్గ. కుటుంబరావు ఏదైనా చెప్పబోయినాగాని చెప్పనీయదు. దాంతో బుజ్జిగాడి పని మరీ ఆడింది ఆట పాడింది పాటగా తయారయింది.

వేసంగి శెలవుల్లో కుటుంబరావు చెల్లెలు వచ్చింది. బుజ్జికంటే మూణ్ణెల్లు చిన్నది అయిన చెల్లెలి కూతురు ఇంగ్లీషు గడగడా మాట్లాడ్డం, శెలవుల్లో కూడా క్లాసు పుస్తకాలు వెంటతెచ్చుకొని చదువుకోవడం, తెలియనివి వాళ్లమ్మ చేత చెప్పించుకోవడం చూసి కనకదుర్గ, కుటుంబరావు ఇద్దరూ తెగముచ్చట పడిపోయారు. కనకదుర్గ ఉత్సాహం తాత్కాలికమే అయినా కుటుంబరావుకి మాత్రం బుజ్జి విషయంలో ఏదైనా పరిష్కార మార్గం చూడాలని మహా పట్టుదల వచ్చింది.

దాంతో ఇదివరకటిలా చీటికి మాటికి అడిగినవన్నీ కొనడం మానేశాడు. ఇంట్లో చాలా ముభావంగా వుంటున్నాడు. అందువల్ల అమ్మ చేత రికమండ్ చేయించడానిక్కూడా బుజ్జిగాడికి అవకాశం లేకుండాపోయింది. ఎలాగయితేనేం ఆయేడు ఆర్నెల్ల పరీక్షలన్నీ ఒక్కదానిక్కూడా గైరు హాజరవకుండా రాశాడు. కొన్ని రోజులయ్యాక టీచరిచ్చిన ప్రోగ్రెస్ కార్డు పట్టుకుని మెల్లిగా తండ్రిదగ్గరికి చేరి సంతకం పెట్టమన్నాడు. పరీక్షలయితే అన్నీ రాశాడు గాని ఒక్క దాంట్లో కూడా సరియైన మార్కులు రాలేదు. కార్డునీ, బుజ్జినీ మార్చిమార్చి చూసి జేబులోంచి పెన్నుతీసి ఎడంచేతి బొటన వేలికి ఇంకు రాసుకుని ప్రోగ్రెస్ రిపోర్టు మీద వేలిముద్ర వేశాడు.



"అదేంటి నాన్నా! సంతకం పెట్టకుండా అలా చేశావ్"

"నీ మార్కులు చూసి కడుపు నిండిపోయి. నీ లాంటి కొడుక్కి చదువుకున్న తండ్రినని చెప్పుకోడానికి ఇష్టం లేక వేలిముద్ర వేశాన్రా" అని పేపర్లో బుర్ర దూర్చేశాడు కుటుంబరావ్.

—లక్ష్మి

అంతరంగంలో ఏదో అలికిడి.

హృదయ ప్రాంగణంలో చిరపరిచిత మైన అడుగుల సవ్వడి.

అనుభూతికి, అనుభవానికి మధ్య గల సంబంధం మరికాస్త విస్తరించి మనసు నిండుగా ఒక రకమైన ఆందోళన ఆవరించుకుపోయింది.

సుషమ మంచమ్మీద పడుకుని వుంది. నిద్రపోతోందో, మేలుకుని వుందో, కల గంటోందో, వాస్తవంలో వుందో అర్థంకాని సుప్త చైతన్యావస్థలో వుందామె.

హటాత్తుగా కలలాంటి ఒక మెలకువ సుషమ కన్రెప్పలపై వాలింది.

ఎవరో లోపలకు అడుగు పెట్టారు.

అదే చిరపరిచితమైన పద ధ్వని. నీల్ వచ్చి ఆమె తల వైపు నిలుచున్నాడు. తన నుదుటి నిండుగా చెల్లాచెదురుగా పడి వున్న ముంగురులను మెల్లగా సవరించాడు. మీదకు ఒంగి సున్నితంగా ముద్దు పెట్టుకున్నాడు.

ఇది నిజం కాదు. నిజానికన్నా బలవత్తరమైన స్మృతి. 'సుషమ' ఉలికిపాటుతో లేచి కూర్చుంది. ఒక్కసారిగా చుట్టూ కలయజూసింది. ఎవరూ లేరు. చుట్టూ చిక్కటి చీకటి... ఘనీభవించిన నిశ్శబ్దం.

ఆమె పెదవులు కంపించాయి. గొంతు వణికింది.

"నీల్" చిన్న కేకలాంటి పిలుపు ఆమె గొంతులోంచి వణుకుతూనే వెలుపలికొచ్చింది.

బయట వరండాలో పడుకుని వున్న పనిమనిషి గట్టిగా దగ్గింది. ఆ శబ్దంతో సుషమ పూర్తిగా స్పృహలోకి వచ్చింది.

 

మరోసారి తన చుట్టూ కలయజూచుకుంది. తను ఒక్కతే మంచమ్మీద కూర్చుని వుంది. నీల్ ఎక్కడా లేడు. చుట్టూ శవప్రాయమైన స్తబ్దత, మౌనం, భయంకరమైన ఒంటరితనం, గుచ్చుకుంటున్న నిశ్శబ్దం.

సుషమ భయకంపితురాలౌతూ ఒక్క ఉదుటున లేచి నిల్చుని కిటికీ తలుపుబార్లా తెరిచింది. బయటి నుంచి చల్లటి గాలి విసురుగా వచ్చి ఆమెను చుట్టుకుంది. ఆ చల్లటి స్పర్శను అనుభవిస్తూ బయటికి చూస్తూ నిలబడింది. రాత్రి మౌనంగా ప్రశ్నల వర్షాన్ని కురిపిస్తోంది. గాలికి ఊగిసలాడుతున్న ఆకులు శబ్దం చేస్తున్నాయి. భయపడిన పక్షిపిల్ల ఒకటి రెక్కలు టపటపకొట్టుకుంటూ ఆక్రందిస్తోంది. దూరంగా గడియారం గంటల ధ్వని వినవస్తోంది.

తన మనసు ఎలా వుందో, ఈ రాత్రి వాతావరణం కూడా అలాగే వున్నట్టు అనిపించింది సుషమకు. హృదయం నిండా ధ్వనులు, ప్రతిధ్వనులు. మనసు అలసిపోయి ఓ పక్కకు ఒత్తిగిలుతోంది. ఏమీ మాట్లాడదు. ఆ దుర్భేధ్యమైన, కఠిన కర్కశమైన అంధకారంలో మనసు, శరీరం జీవితం నగ్నంగా అచేతనంగా నిలబడిపోతాయి.

ఏవో స్మృతులు, స్వప్నాలు, మూగ ప్రశ్నలు, అస్పష్టమైన శబ్దాలు బ్రతుకు నిండా అలాంటివే వున్నాయి. సుషమ నిర్విరామంగా వాటినే తిరగేస్తూ వుంటుంది. చూచినదే చూస్తుంది. చదివినవే చదువుతుంది. ఆ సంవేదనల తలవాకిట నిలబడి అతీతంలోకి తొంగి చూస్తుంటుంది. మనసుని చీకటి నిండిన ఇరుకు సందుల్లో తిప్పుతుంటుంది. ప్రతి అక్షరం దగ్గర, ప్రతి వాక్యం దగ్గర, ప్రతి పదం దగ్గర,

ప్రతి ఫుల్‌స్టాప్, ప్రతి కామా, ప్రతి ఆశ్చర్యార్థకం, ప్రతి ప్రశ్న గుర్తు దగ్గర ఆగి ఆగి పరిశీలిస్తుంది. ఆ సమయంలో ఈ ప్రపంచం, లోక వ్యవహారాలు ఏవీ ఆమెకు పట్టవు. దిక్కుతోచని ఒంటరి తనంలో సుషమ ఒక్కతే ఏకాకిగా మిగిలిపోతుంది.




టేబుల్ మీది తన బ్రాస్ నేమ్ ప్లేటుని చూపుడు వేలుతో నిమిరింది సుషమ. తళతళ మెరుస్తున్న ఆ బ్రాస్‌ప్లేటు మీద 'సుషమ' అనే అక్షరాలు పైకి ఉబికివచ్చి చాలా అందంగా కనిపించాయి. అనుకోకుండానే తన పేరు ఎంతో మధురంగా, సంగీత భరితంగా వున్నట్టు అనిపించింది. దానిని టేబుల్‌కు ఒక చివరగా జరిపి ట్రేలో వున్న ప్రశ్న పత్రాల బొత్తిని తీసి ముందు పడేసుకుని దిద్దుతూ కూర్చుంది. కానీ మనసు పనిలో లగ్నం కావటం లేదు. పేపర్లు అవతల పడేసి కిటికీలోంచి బయటకు చూస్తూ కూర్చుంది. గది బయట అందమైన, ఆకర్షణీయమైన రంగు రంగుల ప్రపంచం వుంది. రక రకాల రంగుల దుస్తులు ధరించిన ఆడ పిల్లలు, యవ్వనంతో నిండిన వాళ్ళ ముఖాలు ఎంతో ముచ్చటగా అనిపిస్తాయి. గుమ్మం వద్ద స్టూలు మీద చప్రాసీ కూర్చుని వున్నాడు. అతడి కాకీ బట్టలు బిరుసుగా మెరుస్తున్నాయి.

సుషమ ఈ అందమైన, ఆనంద మయమైన ప్రపంచంలో లీనమైపోయింది. ఇక్కడి ప్రతి బిందువులోనూ, ప్రతి మలుపులోనూ ఏదో కొత్త ఆశ దాగి వుంటుంది. తను గతాన్ని మర్చిపోయింది. ఎన్ని మజిలీలు, ఎన్ని సంఘర్షణలు దాటి వచ్చిందో ఇప్పుడామెకు గుర్తులేదు. ఈ వర్తమానం నుంచి వెనక్కు తిరిగి చూడాలనుకోవటం అవివేకం. ఒకవేళ చూసినా బాధతప్ప మరేమీ మిగలదు. వెనుకటి గాయాలు, నిరాశలు ఒక్కసారిగా మేల్కొని మళ్ళీ మళ్ళీ బాధిస్తాయి. మిగిలిన ఒకటి అరా కలలు కూడా వాడిపోతాయి.

'ఠంగు' మని గంట మోగింది. ఆ శబ్దం కాలేజీ ఆవరణలో, గదుల్లో విచిత్రంగా ప్రతిధ్వనించింది. ఆడపిల్లల నవ్వులు ఆగిపోయాయి. రంగు రంగుల దుస్తుల కాంతులు క్లాసు రూంలో బందీ అయిపోయాయి. 'సుషమ' కాలింగ్ బజర్ నొక్కింది. వృద్ధ హరిసింగ్ వచ్చి ఎదురుగా నిలబడ్డాడు. పేపర్ల కట్ట అతడికి అప్పగించి బీరువాలో భద్రం చేయమని చెప్పి రిజిస్టర్ అందుకుని క్లాస్‌రూం వైపు నడిచింది. వరండాలో కూర్చుని వున్న మరో ఇద్దరు చప్రాసీలు సుషమను చూచి గబుక్కున లేచి నిలబడి నమస్కరించారు. మొన్న మొన్నటిదాకా ఈ చప్రాసీలు ఏ పనీ చేసేవారు కాదు. కనీసం నమస్కారం కూడా చేసేవారు కాదు. తను అప్పుడప్పుడూ టిప్స్ ఇస్తున్నప్పటికీ వాళ్ళ ప్రవర్తన అలాగే వుండేది. కానీ ఈ మధ్య తను కనిపించగానే భయభక్తులతో లేచి నిలబడి వంగి వంగి సలాములు చేస్తున్నారు. తన

హోదా ఇప్పుడు పెరిగినట్టు అనిపించింది. అవును తను ఇప్పుడు అందరిచేత గౌరవింపబడుతోంది. ఈ ఆలోచనలతో సుషమ ఉక్కిరి బిక్కిరి అవుతూ చిరు నవ్వు నవ్వుకుంటూ చకచకా క్లాస్‌రూమ్ వైపు వెళ్ళిపోయింది.

మళ్ళీ ఠంగున గంట శబ్దం. క్లాస్ అయిపోయింది. సుషమ తన గదిలోకి అడుగుపెడుతూ బయట తగిలించి వున్న మరో బోర్డు చూచి ఆశ్చర్యపోయింది. "మిస్.యస్. శర్మ, వార్డెన్ గర్ల్సు హాస్టల్". లోపల ఇద్దరు సహాధ్యాపకు రాళ్ళు కూర్చుని వున్నారు.

"రండి వార్డెన్‌గారూ!" మిస్ శాస్త్రి కాస్త వ్యంగ్య స్వరంతో అంది. మిస్ శాస్త్రి సంస్కృతం చెబుతోంది. తన కటువైన ప్రవర్తనతో సదా ఎవరో ఒకర్ని బాధించాలనే చూస్తుంది ఆమె.

సుషమ రిజిస్టర్ టేబుల్ మీద పడేసి తన రివాల్వింగ్ చైర్‌లో ఆసీనురాలౌతూ అడిగింది "మీరు... చాలా ఫ్రీగా వున్నట్టున్నారే?"

"తీరికెక్కడ? కాస్త ఫోన్ చేద్దామని వచ్చాం. అక్కడ ఆఫీసులో ప్రైవసీ అసలు వుండదు. అందుకని ఇక్కడికి వచ్చాం"

ఫోను వాళ్ళ వైపుకు తోసి సుషమ ఏవో కాగితాలు చూస్తూండిపోయింది.

నంబర్ డైల్ చేసి సుషమవైపు చూస్తూ అంది మిస్ శాస్త్రి "నిన్న ఇద్దరమ్మా యిలు రాత్రి ఒంటిగంటకు వచ్చారు హాస్టల్‌కు. ఒక హద్దంటూ లేకుండా పోతుంది ఆడపిల్లలకు. ఒక నియమం కానీ, క్రమశిక్షణ కానీ ఏమీలేవు".

ఇంతలో అవతలనుంచి రెస్పాన్స్ వచ్చింది. ఫోనులో మాటలయ్యాక మిస్ శాస్త్రి లేచి నిలబడుతూ అంది—

"కాస్త హాస్టల్‌ని అదుపులో పెట్టే ప్రయత్నం చెయ్యి. కొత్తగా వచ్చావు కాబట్టి నీలో ఉత్సాహం కూడా ఎక్కువే వుంది. ఇక్కడి జరిగే పనులు..."

సుషమ ఆవిడ మాటల్ని మధ్యలోనే కట్ చేస్తూ అంది— "మీకిప్పుడు క్లాస్ వున్నట్టుంది. అవతల పిల్లలు తెగ అల్లరి చేస్తుంటారు..."

"సరే! నీతో తరువాత వివరంగా మాట్లాడతాను" అంటూ మిస్ శాస్త్రి అయి ష్టంగానే బయటకు వెళ్ళిపోయింది.

అప్పటివరకు అన్నీ వింటూ మౌనంగా కూర్చుండిపోయిన మరో సహాధ్యాపకు రాలు మీనాక్షి సుషమను చూస్తూ చిరు నవ్వుతో అంది "ఆవిడ తన కాలాన్ని ఎప్పుడూ ఇలా అవాకులు చెవాకుల మధ్యనే గడిపివేస్తూంటుంది. రాత్రిళ్ళు నిద్రపోతుందో లేక పహరా ఇస్తుంటుందో గాని ఎవరు ఎప్పుడు ఎన్ని గంటలకు హాస్టల్లోకి వస్తున్నారు, ఏ ఆడపిల్ల ఎప్పుడు ఎక్కడికి పోతుంది అని ఆరాలు మాత్రం తీసుకుంటుంది. మన స్టూడెంట్స్ ఎప్పుడు ఏ బాయ్ ఫ్రెండ్‌తో తిరుగు తుంటారో, ఏ అధ్యాపకురాలు ఎంతడబ్బు ఇంటికి పంపుతుందో, ఎవరికి సెక్స్ అంటే, ఎంత మోజుందో, ఎవరు రోజుకు ఎన్నిసార్లు... ఒకటేమిటి ఏది అడిగినా సరే సవివరంగా చెప్పేస్తుందామె. ఆవిడ చిఠాలో ఈ విషయాలన్నీ తారీఖులతో సహా వివరంగా వ్రాసివుంటాయి గామోసు..."

మీనాక్షి ఇంకా ఏదో చెప్పబోతుండగా సుషమ ఆపేస్తూ అంది "చాలు చాలు. నాకు తెలుసుగా. నువ్వు వివరించ వల సిన అవసరం లేదులే."

"అప్పుడే కోపం వచ్చేసిందా" మీనాక్షి కొద్దిపాటి ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ అంది "నీకు తెలియదు. ఈ ఆడపిల్లల వల్ల ఎన్ని సమస్యలు ఉత్పన్నమౌతాయో!"

"అబ్బ... వుండనీ మీనాక్షీ. నేను ఇక్కడ జాయిన్ అయిననాటి నుంచి ఒక్కొక్కరు ఒక్కో లిస్టూ తయారుచేసి ఇస్తున్నారు. నేను దేన్నని గమనించాలో అర్థం కావడం లేదు" సుషమ చిరబుర లాడుతూ అని కుర్చీలోంచి లేచి నిలబడింది. "పద ముందు ఒక కప్పు కాఫీ తాగుదాం. గంట కొట్టటానికి ఇంకా చాలా టైం వుంది".

ఇద్దరూ కాంటీన్‌వైపు నడిచారు.

కాంటీన్ కిటికీలోంచి కొత్తగా కట్టిన హాస్టల్ బిల్డింగ్, కిటికీల రంగురంగుల కర్టెన్లు కనిపిస్తున్నాయి. ప్రహరీ గోడ నిండుగా ఎగబాకివున్న మాధవీలత పువ్వుల పరిమళం కాంటీన్‌వరకూ వస్తోంది. తన ఇంటి వద్ద గులాబీ మొక్కలు నాటమని తోటమాలితో చెప్పనే లేదని ఇప్పుడు గుర్తుకొచ్చింది సుషమకు. వర్షాకాలం గడిచిపోయాక నాటితే బావుండదు. వెంటనే చెప్పేయాలి అనుకుంది.

"మరీ పని ఎక్కువైపోయింది" చెంచాని టేబిల్‌మీద తిప్పుతూ అంది సుషమ "ఇరవైనాలుగ్గంటలూ హాస్టల్ వ్యవహారాలు చూడటంలో గడిచిపోతున్నాయి. ఒక్క క్షణమైనా తీరిక దొరకటం లేదు. నా స్వంతపనులన్నీ అలాగే వుండిపోతున్నాయి!!"

"ఆ చెత్త నవలలు చదివే పనేగా? అది ఆగిపోయిందనేనా వాపోతున్నావ్?" పగలల్లా పనిచేసి బుర్ర వేడెక్కిపోతుంది.





సాయంత్రం కాస్త రిలీఫ్ కావాలంటే 'రొమాంటిక్' నవలలు, ప్రేమ కథలు చదవక తప్పదు. ఆ నవలలు గొప్ప మనశ్శాంతి నిస్తాయన్నమాట నిజం. మీనాక్షిలాంటి వారికి అవి నచ్చకపోతే తనేం చేస్తుంది.

అందుకే ఆ మాటలకు ఓ చిరునవ్వు నవ్వి కప్పుమీద వున్న డిజైన్‌ని పరిశీలించసాగింది సుషమ. అప్పటికి ఉదయం పదకొండు గంటలయింది. క్లాసులు బిజీగా జరుగుతుండే సమయం గనక కాంటీన్ ఖాళీగా వుంది. ఒక మూలన ఇద్దరు విద్యార్థినులు కూర్చుని మంద్ర స్వరంలో ఏదో కబుర్లు చెప్పుకుంటున్నారు. కౌంటర్ దగ్గర ఇద్దరు బేరర్లు ఖాళీగా నిలబడి దిక్కులు చూస్తున్నారు.

కాంటీన్ గుమ్మానికున్న కర్టెన్ పక్కకు తొలిగింది. ఒక విద్యార్థిని లోపలకు తొంగి చూసింది. సుషమ, మీనాక్షి ఇద్దరూ ఒక్కసారిగా ఆమె వైపు చూశారు. వీళ్ళిద్దర్నీ హటాత్తుగా చూసిన ఆ విద్యార్థిని కంగారుపడిపోతూ ఒకేసారి ఇద్దరికీ నమస్కారం పెట్టి వెంటనే వెళ్ళిపోయింది.

ఆ విద్యార్థిని కట్టుకుని వున్న కొత్త చీర చూడగానే కృష్ణమ్మ పిన్నికి తను చెప్పిన సంగతి గుర్తుకొచ్చింది సుషమకు. వెంటనే చీరలు కొనిపంపమని చెప్పి వచ్చింది తను. వెంట ఎక్కువ చీరలు తెచ్చుకోలేదు. 'ఈ పిన్నమ్మ భలే విచిత్రమైన మనిషి. మనిషి ఎదురుగా వుంటే ప్రేమ ఒలకబోస్తుంది. కాస్త కనుమరుగవగానే ఇట్టే మర్చిపోతుంది. ఛీ...ఛీ...ఏం మనిషి. తనకు చీరలు పంపకపోగా ఓ కార్డుముక్కైనా రాసింది కాదు' సుషమకు పిన్నమ్మ మీద కోపం ముంచుకొచ్చేసింది.

అదేరోజు సాయంత్రం ఇంటికిరాగానే అర్జంటు లెటర్ రాసింది. తర్వాత ఆమె పంచి వచ్చిన జవాబు చదువుకుని మండి పడింది "నీ చీరలుకొని చాలా కాలమైంది. కానీ పంపలేకపోయాను. మొన్న కౌసల్య బంధువొకాయన ఢిల్లీ వస్తుంటేనూ ఆయనకిచ్చి పంపాను. అతడే తెచ్చి నీకిస్తాడు. లేదా నువ్వే వెళ్ళి తెచ్చుకో" అని వుందా ఉత్తరంలో అందులో ఆ కౌసల్యగారి బంధువు పేరుగాని, అడ్రసు గానిలేదు. ఆ అమాయకత్వానికి విరగబడి నవ్వుకుంది తను. ఢిల్లీలాంటి పెద్ద నగరంలో తను ఆ కౌసల్యా తాలూకు బంధువుని ఎక్కడని వెదికి పట్టుకోగలదు. పోస్టులో పంపితే డబ్బులు ఖర్చు అవుతాయనుకుని మనిషిచేత పంపి వుంటుంది. ఐదు రూపాయల కోసం చూసుకుంటే ఇలాగే అవుతుంది. ఇప్పుడు ఆ చీరలూ లేవు, మనిషీ లేడు.

సుషమ అంటే ఎక్కడలేని ప్రేమ కృష్ణమ్మ పిన్నికి. "నువ్వెళ్ళు. చీరలు నేను తీసి పంపుతాను. నీ ఒంటికి ఎలాంటి చీరలు నప్పుతాయో నీకన్నా నాకే ఎక్కువ తెలుసు. నేను పంపిన చీరలు చూసి నీ మిత్రురాండ్రు ఖాయంగా గుడ్లు తేలవేస్తారు పో" అంది.

అప్పుడే తన తల్లి "నూరీ కోసం కూడా ఒక చీర తీయించరాదూ సుషమా! ఎలానూ ఈ సంవత్సరం దాని పెళ్ళి అయిపోతుంది. అప్పుడైనా అక్కరకు వస్తుంది చీర" అంది.

తన తల్లి మాటలు విని ఆశ్చర్య పోతూ అంది కృష్ణమ్మ పిన్ని "అదేంటి అక్కా అలా అంటున్నావు? పెద్దది సుషమ పెళ్ళి అవకుండానే చిన్నదాని పెళ్ళి చేసేస్తావా?"

తన తల్లి నవ్వుతూనే జవాబు చెప్పింది- "నీకు తెలియనిదేముంది. సుషమ పెళ్ళి జరిపించగల స్థాయి మా కెక్కడుంది. అది పెద్ద పెద్ద చదువులు చదివేసి పెద్ద ఉద్యోగం కూడా సంపాదించుకుంది. హాస్టల్ వార్డెన్ కాబోతోంది. దానికి పెళ్ళి చెయ్యటం మా వల్ల అయ్యేదేనా? పెద్ద బంగ్లాలో వుండబోతోంది. నౌకర్లు, చప్రాసీలు వుంటారు. ఇలాంటి సుషమకు తగిన వరుడ్ని వెదకటం ఎంత కష్టమో ఆలోచించు. సుషమ నాన్నగారు 'పిల్ల బాగా చదువుకుంది. తన వ్యవహారాలు తనే స్వయంగా చూచుకోగల స్థాయికి వచ్చింది. ఇంక మనమెందుకు జోక్యంచేసుకోవటం. తనకు నచ్చినవాడ్ని, తనకు తగినవాడ్ని తనే వెదుక్కుంటుంది, అంటున్నారు"

"ఇక చాల్లే! అమ్మాయి పెళ్ళి వయసులో వున్నప్పుడే నువ్వు ఇలాంటి మాటలు చెప్పివుంటే బావుండేది. వయసు మీరిపోయాక సుషమ వరుడ్ని ఎక్కడని వెదుక్కుంటుంది. ఆడపిల్లలు అందరికీ వుంటారు. అందరూ తమ పిల్లల పెళ్ళిళ్లు చేస్తారు. నీలాగా నిమ్మకు నీరెత్తినట్టు ఎవరూ కూర్చోరు"

చిన్న చెల్లెలి ఈసడింపు మాటలకు నిశ్చేష్టురాలై చూస్తుండిపోయింది తల్లి. తెల్లగా పాలిపోయిన ఆమె మొహం చూసి జాలివేసింది సుషమకు. వెంటనే ఆ సంభాషణను మరో వైపుకు మరలించే ప్రయత్నం చేస్తూ "పిన్నీ! సాయంత్రం మనం మూడు వాయిల్ చీరలు కొనుక్కొద్దాం. రెండు నాకు, ఒకటి నూరీకి" అంది.

కాని పిన్ని ఆగలేదు. "బావగారికి

ఇంటి బాధ్యతలు పట్టవు. సుషమకు చదువుకుంటున్నప్పుడే పెళ్ళి చేసేస్తే బావుండేది. ఆడపిల్ల తనంతట తనుగా నోరు తెరచి 'నాకు పెళ్ళి చెయ్యండి' అని అడగదు. కుంటోళ్ళు, గుడ్డోళ్ళు కూడా పెళ్ళిళ్ళు చేసుకుని చక్కగా కాపురాలు చేసుకుంటున్నారు. సలక్షణమైన నీ కూతురు మాత్రం అవివాహితగానే వుండిపోయింది" అంటూనే హటాతుగా ఏదో గుర్తుకు రావటంతో అడిగింది "ఆ ప్లీడర్‌గారి అబ్బాయి సంగతేమైంది?"

"ఏమౌతుంది హాయిగా వున్నాడు. జోరుగా ప్రాక్టీస్ సాగించుకుంటున్నాడు. బంగ్లా కూడా కట్టుకున్నాడు"

తమ్ముళ్ళ, చెల్లెళ్ళ ముందు తన పెళ్ళి గురించిన చర్చ సాగటంతో సుషమ సిగ్గుపడిపోసాగింది. కాస్త చిరాకు కూడా వేసింది- "పిన్నీ! జీవితంలో ముఖ్యమైనది పెళ్ళి ఒక్కటే కాదు. చేయవలసిన గొప్ప పనులు ఇంకా చాలా వున్నాయి. కేవలం వివాహం ఒక్కటే గొప్పదని ఎందుకనుకుంటున్నావు నువ్వు? పెళ్ళిళ్ళు చేసుకోకుండా దర్జాగా బ్రతుకుతున్న ఆడవాళ్ళు ఎందరో వున్నారు."

"వాళ్ళు ఎంత దర్జాగా బ్రతుకుతుంటారో నాకు తెలుసు. ఒక మగ ఫ్రెండుని సంపాదించి చూడు. ఇప్పుడు ఇన్ని కబుర్లు చెబుతున్న మీ అమ్మ



అందరికన్నా ముందు తనే గుండెలు బాదుకుంటుంది. మన సమాజం ఏ ఆడ పిల్లనూ హాయిగా, ఆనందంగా బ్రతక నివ్వదు" అంది పిన్ని.

సుషమ తల్లి ఏదో పని మిషమీద అక్కడ నుంచి తప్పుకుని లోపలకు జారుకుంది. కృష్ణమ్మ పిన్ని కోపం మాత్రం అలాగే వుండిపోయింది.

ఆ సాయంత్రం అడిగింది కృష్ణమ్మ పిన్ని "ఏం సుషమా! ఢిల్లీ వెళ్ళిపోతు న్నావు. అప్పుడప్పుడూ ఎవరితోనైనా కలిసి తిరిగే వ్యవహారం ఏమైనా వుందా? లేక..."

పిన్ని మాటల్లోని తాత్పర్యాన్ని అర్థం చేసుకుంటూ అంది సుషమ "లేదులే పిన్నీ... అక్కడ చాలామంది ఫ్రండ్స్ వున్నారు. అందరి దగ్గరకు వెళ్తూనే వుంటాను. ఎలాగో కాలం గడిచి పోతుందిలే".

పిన్ని సుషమ చెవిదగ్గర నోరు పెట్టి అతిమెల్లిగా రహస్యం చెబుతున్నట్టు అంది "కొంచెం నీ గురించి కూడా ఆలో చించుకో. ఈ తమ్ముళ్ళు, చెల్లెళ్ళు నీ కోసం ఏమీ చేయరు. ఈ ప్రపంచంలో ఎవరికివారే అన్నీ చూసుకోవాలి. ఎవరికి వారే తమ తమ వ్యవహారాలు మాత్రమే చక్కబెట్టుకుంటూ వుండిపోతారు. నీ సంగతి నువ్వూ చక్కబెట్టుకుంటే మంచిది".

"కానీ! పిన్నీ వీళ్ళందరికి ప్రస్తుతం నా సహాయం ఎంతైనా అవసరం. నాన్న గారికి పెన్షన్ చాలా కొద్దిగా వస్తుంది. ఆ డబ్బుతో ఒక్కపూట తిండి ఖర్చులు కూడా గడవవు. నేను సహాయపడకుంటే వీళ్ళందరూ ఏమైపోతారు, ఎవరి ముందు చెయ్యి చాపుతారు? తమ్ముళ్ళు చదువు కోకుండా ఆవారాల్లా రోడ్ల వెంట తిరిగితే ఆ అప్రదిష్ట ఎవరిది? వాళ్ళు నా రక్తం పంచుకు పుట్టిన వాళ్ళేకదా?" అంటున్న ప్పుడు ఒక అమాయకమైన చిరునవ్వుతో, హుందాతనంతో, బాధ్యతాయుతమైన పెద్దరికంతో సుషమ ముఖం వెలిగి పోయింది. "నేను ఏది చేసినా అది నా కర్తవ్యం అనుకుని చేయను. కేవలం ప్రేమతోనే చేస్తాను. నా దగ్గర ఇంకా డబ్బుంటే, నాకు ఇంకా శక్తి వుంటే అదంతా వీళ్ళకే ఇచ్చేద్దామని వుంటుంది పిన్నీ".

కృష్ణమ్మ రెప్ప వాల్చకుండాసుషమనే గమనిస్తూ కూర్చుంది.

"నేనే పెద్ద కొడుకుననుకో. అప్పుడు నేను ఏంచేస్తాను? ఏం చేయాలి? అదే ఇప్పుడు చేస్తాననుకో. వీళ్ళ కోసం నేను చేసే ప్రతి పనిలోనూ నాకెంతో ఆనందం లభిస్తుంది. తమ కోసం తాము అందరూ అన్నీ చేసుకుంటారు. నేనూ అలాగే చేస్తే నా ప్రత్యేకత ఏముంటుంది. నాకన్నా చిన్నవారి కోసం నేను ఏదో ఒకటి చేయాలికదా. అలా చేయగల స్థితికి నన్ను తెచ్చింది నాన్నగారే కదా? అవన్నీ ఎలా మర్చిపోగలను ?"

"బావుంది అమ్మా చెయ్యి. కానీ నీ కోసం కూడా నువ్వు కనీసం రోజుకో క్షణం ఆలోచించుకో".

సుషమ మౌనంగా వుండిపోయింది. తన కోరికలను, వాంఛలను చంపుకుని తను తన కుటుంబం కోసం పాటు పడా లనుకుంటోంది. కానీ అదేమంత గొప్ప విషయం కానట్టు తేల్చిపారేసింది పిన్ని. పైగా అప్రయోజకత్వంగా కూడా తేల్చే స్తోంది. ఈ చర్చ గనుక తల్లి వింటే నానా హంగామా చేసి తప్పు అంతా




సుషమమీదే మోపి ఊరుకుంటుంది..

"నేను మాత్రం ఎంతకని చెప్ప గలను. చిన్నదా, చితకదా నాలుగు బాధి ఒప్పించటానికి. పెళ్ళి మాట ఎత్తితేనే మండిపడుతుంది. తనకు ఇష్టం లేనప్పుడు నేను ఏం చేయగలను, ఎంతకని చెప్ప గలను?" అంటుంది.

ఇరుగు పొరుగువాళ్ళు ఆమె మాటలు నిజమేనని నమ్ముతారు. కానీ అసలు సంగతి సుషమకు తెలుసు.తల్లికీ తెలుసు. అందుకనే ఇలాటి చర్చ వచ్చిన సందర్భాల్లో తల్లి పక్కకు జారుకుంటుంది. ఆ కుటుంబానికి ఏకైక ఆధారం సుషమ. తల్లి మొదట్లో తన కూతురు బయటకు వెళ్ళి ఉద్యోగంచేసి కుటుంబం గడుపు కొస్తుందని, అలాంటి అవసరం కలుతుందని అనుకోలేదు. సుషమ ఆదినుంచీ తన తమ్ముళ్ళు, చెల్లెళ్ళ కోసం ఏదో ఒకటి చేస్తూనే వుండేది. ఇప్పుడూ అదే అలవాటు చొప్పున చేసుకొస్తోంది. తల్లికి కూతురు ఉద్యోగం చేయటమే ఉత్తమ మనిపిస్తోంది. ఆ సంపాదనతోనే కుటుంబం హాయిగా వుంది.

తల్లిలో వున్న ఈ ద్వంద్వ వైఖరిని చూసి సుషమ మాత్రం అప్పుడప్పుడూ ఆవేదనకు లోనౌతుంది. ఇంట్లోతల్లిదే పెత్తనం. తండ్రి పక్షవాతం వచ్చిమంచాన పడివున్నాడు. సుషమకు తల్లి దగ్గరకన్నా తండ్రి దగ్గర చనువెక్కువ. తండ్రి మీదే ఎక్కువ ప్రేమ. తల్లి సుషమ సంపాదన తీసుకొంటూ సుషమ గురించి ఆలోచించటమే మర్చిపోయింది. ఇప్పుడామె దృష్టి అంతా చిన్న కూతుళ్ళ పెళ్ళిళ్ల మీద, మగపిల్లల చదువుల మీద కేంద్రీకరించింది. సుషమను సాధ్యమైనంత దూరంలో నిలబెట్టి ఆమె సంపాదనను మాత్రం దగ్గరకు తీసుకునేది. తల్లి ఆలోచనా విధానం తననెంతగా బాధిస్తుందో చెబుదామని ఎన్నోసార్లు అనుకునేది సుషమ. కానీ గొంతు పెగిలేది కాదు.




వారాలు గడిచిపోయాయి. కృష్ణమ్మ పిన్ని పంపిన చీరలూ రాలేదు. ఆమె దగ్గరనుంచి మళ్ళా ఉత్తరమూ రాలేదు. చీరలూ లేవు. చీరలు తెచ్చిన మనిషి ఏమై పోయాడో తెలియదు. తరువాత సుషమ పని ఒత్తిడి వల్ల పిన్నికి ఉత్తరం రాయలేకపోయింది. దాదాపు ఆ సంగతి మర్చిపోయింది. హాస్టల్ విద్యార్థినుల్లో క్రమశిక్షణ లేదు. అన్ని పనులు అస్తవ్యస్థంగా పడి వున్నాయి. వాటన్నింటినీ సరిదిద్ది, క్రమశిక్షణ చర్యలని కఠినంగా అమలు చేస్తేగాని కుదరదు. సుషమ కాలమంతా ఈ పనుల్లోనే గడిచిపోతోంది. అటు కాలేజీలో కొత్త అడ్మిషన్ల గొడవ కూడా సుషమే చూడాలి.

మిస్ కృపలానీకి తన వాడీతో కూర్చుని భోంచేస్తేగాని తోచదు. మిసెస్ అగర్వాల్దాదాపురోజూ పర్మిషన్ లెటర్ పెట్టేసి ఇంటికి చెక్కేస్తుంది. "నేను మూడవ గంట దాటాక ఉండాలంటే కుదరదు. ఇంటిదగ్గరపాపఏడుస్తుంటుంది" అని ముందే చెప్పేసింది.

అది విని మీనాక్షి మండిపడుతూ

అంది "ఇది ఉద్యోగమా లేక స్వంత పొలంలో వ్యవసాయమా? పాప గురించిన చింత ఎక్కువున్నప్పుడు ఉద్యోగం ఎందుకూ చెయ్యటం ఇంట్లో కూర్చుంటే సరిపోతుంది."

సుషమ మీనాక్షిని శాంతపర్చి ఎలాగో క్లాసులు అందరికీ వీలైనట్లు సర్దింది. కానీ ఒంటి గంట తరువాత క్లాసులన్నీ సుషమ ఒక్కతే చూడవలసివస్తోంది. తరువాత మీనాక్షి అంది "అందరూ నీ మంచితనాన్ని బలహీనతగా భావించి చాకిరీ అంతా నీమీద మోపేసి ఎంచక్కా చెక్కేస్తున్నారు. ఇంత ఉదారత్వం పనికిరాదు సుషమా! మనకు పిల్లలు లేనంత మాత్రాన అన్ని పనులూ మనమే చెయ్యాలా? ఇలా ఎంత కాలమని చేస్తాం?"

"నువ్వు చెప్పేది నిజమే మీనూ! కాని అలా అని నిర్మొగమాటంగా చెప్పలేం కదా! నాకైతే అప్పుడప్పుడు జీవితం మీదే విరక్తిపుట్టుకొచ్చేస్తోంది" అంటూనే ఆమె కనురెప్పలు నిర్జీవంగా వాలిపోయాయి.

"సుషమా! నువ్వు పెళ్ళి చేసుకుంటే బావుంటుంది. నువ్వు ఇలాంటి జీవితం గడపటానికి పుట్టిన దానివికావు"

సుషమ పెదవులు ఒకసారి కదలి



మళ్ళీ ఆగిపోయాయి. చేత్తో నుదురు తడుముకుంటూ లేచి కూర్చుంటూ అంది "పద కాఫీ తాగుదాం. ఎవరు ఏమిటి చేయాలన్నది చాలా వివాదాస్పదమైన విషయం. కాఫీతోపాటు ఏం తినాలని వుందో చెప్పు? కాంటీన్ నుంచి ఏదైనా తెప్పించుకుందాం."

మీనాక్షి పక్కనే స్టూల్ మీద పడి వున్న ఆంగ్ల పత్రికను అందుకుని పేజీలు తిరగేయసాగింది. సుషమ తన గదిని అద్భుతంగా అలంకరించుకుంది. కిటికీలకు వేలాడుతున్న అందమైన సిల్క్ పర్దాలు వుండి వుండి వయ్యారంగా ఊగిసలాడుతున్నాయి. మంచమ్మీద అంతకు మించిన అందమైన దుప్పటి పర్చివుంది. అది కళాత్మకంగా కాంతితో మెరిసిపడుతోంది. మీనాక్షి నిట్టురుస్తూ అనుకుంది 'సుషమలో వున్న ఈ కళా కౌశల్యం అంతా వ్యర్థమైపోతోంది. వయసు అడివి గాచిన వెన్నెల చందాన నిరర్థకంగా గడిచిపోతుంది. భర్త సంసారం—అందమైన పిల్లల మధ్య వుండాలి సుషమ. సుషమకు తప్పకుండా అందమైన పిల్లలే పుడతారు."

పనిమనిషి కాఫీ ట్రే పట్టుకొచ్చి ఎదురుగా పెట్టి వెళ్ళింది. ఇద్దరూ కాఫీ తాగారు.

మీనాక్షి వెళ్ళిపోయాక సుషమ స్నానం చేసి దుస్తులు మార్చుకుంది. ఉదయం నుంచి కొప్పుముడి వేసివున్న జుత్తుని ఊడదీసింది. జడ వేసుకునే ప్రయత్నం చేయకుండానే మంచమ్మీద వాలిపోయింది. ఆమె దృష్టి కిటికీ కర్టెన్ల మీద ఆగిపోయింది. అందరూ ఆ కర్టెన్లు చూచి తెగమెచ్చుకున్నారు. బయట నుంచి వర్షపు తుంపర్లు నిండిన చల్లటి గాలి వీస్తోంది. ఆ గాలికి, చల్లటి స్పర్శకు పులకించిపోతున్నట్లు ఊగులాడుతున్నాయి కర్టెన్లు. వాటిని గమనిస్తూ సుషమ ఒక చిన్న నిట్టూర్పు విడిచింది. తన చెల్లి నిరుపమ గుర్తుకొచ్చింది. అది అందరికన్నా చిన్నదీ, అందరికన్నా అందమైనదీనూ. తెలివైనదికాదు గనుక ఒక సంవత్సరం ఇంటర్ తప్పింది. చదువుకన్నా ఇంట్లో పనులు చేయటంలోనే ఎక్కువ శ్రద్ధ. దాని పెళ్ళి త్వరగా చేసేద్దామని తన తల్లి తొందర. సుషమతో ఒకసారి "నువ్వు చాలా అనవసర ఖర్చులు చేస్తున్నట్టున్నావు. కాస్త ఆలోచించి ఖర్చుపెట్టు. సాధ్యమైనంత త్వరలో మన 'నీరు' పెళ్ళి చేసెయ్యాలి" అంది కూడా.

తన పెళ్ళి గురించి ఆలోచించని తల్లి మాటలు విని "ముందు సంబంధం ఖాయం చెయ్యి. పెళ్ళికి డబ్బులు అవే వస్తాయి" అంది తను కాస్త బాధ పడుతూనే.

"ఒక్కసారిగా కావాలంటే ఎక్కడ్నుంచి ఊడిపడతాయి. బొట్టు బొట్టు ఒక చోట చేర్చితేనే కదా కుండ నిండుతుంది"

సుషమ విసిగిపోయి "అప్పు చేస్తాను" అనేసింది. తరువాత కాస్త ఆగి "జీవితాంతం అది తీరుస్తుంటాను" అంది.

"అంత బాధపడవలసిన అవసరం నీకు వుండదులే. నీరు పెళ్ళి బాధ్యత నీ ఒక్కదాని మీదే మోపంలే. నాన్న వున్నారుగా ఆయనే చేస్తారు అన్నీ" అంది తల్లి నిర్లక్ష్యంగా.

"నా పెళ్ళి చేశారు ఇక నీరూ పెళ్ళి చేస్తారు" అనలేకపోయింది సుషమ. కానీ అంతరాంతరాల్లో ఆ మాటలు అనేసు




కుని మౌనం వహించింది. అయినా ఈ దోషం తల్లిది కాదు. ఆవిడ మాటలు విని బాధపడటంవల్ల లాభమూలేదు. తప్పంతా తనదే! తన కోరికలు ఏవీ తీర్చుకోలేక పోగా కనీసం తనకూ కోరికలు వున్నా యన్నైనా చెప్పలేని తనదే తప్పు. తన బ్రతుకు కోసం తను ఏర్పరుచుకున్న ఒకే ఒక్క స్వప్నం ఏమిటో కూడా చెప్పలేకపోయింది తను. ఆ స్వప్నం తనలోనే వుండిపోయింది. క్రమంగా వాడి వడిలిపోయింది.

సుషమ ఈ ఆలోచనల బారినుంచి తప్పించుకునేందుకు పక్కనే వున్న పత్రిక అందుకుని సీరియల్ నవల చదవ టంలో నిమగ్నమైంది. అన్నీ మర్చి పోయి ఆ అక్షరాలే సర్వస్వమన్నట్టుగా సీరియల్ చుట్టూ ఆలోచనలను బిగించి వేసింది.

* * *

రాత్రంతా వర్షం కురిసి తెల్ల వారింది. వర్షం తగ్గి వాతావరణం ఆహ్లాద కరంగా మారిపోయింది. చల్లటిగాలి తాజా వాసనలతో వీస్తోంది. చెట్ల ఆకుల మీద నీటి బిందువులు ముత్యాల్లా మెరుస్తూ నెమ్మదిగా నేలకు జారుతున్నాయి. సుషమ ఆఫీసుకు వచ్చేసింది. మొదటి గంట కొట్టడానికి ఇంకా చాలా టైం వుంది. నిర్మానుష్యంగా వున్న వరండా లోంచి తనలాగే ముందుగా కాలేజీకి వచ్చిన విద్యార్థినుల నవ్వులు వినవస్తు న్నాయి. సుషమ మనసు ఆ రోజు చాలా ప్రశాంతంగా వుంది. గతవారంలో అనుకున్నదానికన్నా ఎక్కువ పనిచేసి నందువల్లనేమో మనసు సహజమైన సంతో షంతో నిండివుంది.

టపా చూస్తూ కూర్చుంది సుషమ. తల్లి రాసిన ఉత్తరం ఒకటి వుంది. కానీ ఆశ్చర్యకరంగా ఆ ఉత్తరంలో అవస రాల ప్రస్తావన గాని డబ్బు గురించిన ఆలాపనగాని లేవు. కేవలం తన క్షేమ సమాచారాల కోసం ప్రతీక్షిస్తున్నట్టు రాసింది. సుషమ ఉత్తరాన్ని మరోసారి తిరగ చదువుకుంది.

ఇంతలో చప్రాసి గదిలోకి వచ్చి నమస్కరించి అన్నాడు "మేడమ్! మీ కోసం ఎవరో వచ్చారు. వారిని విజిటర్స్ రూమ్‌లో కూర్చోబెట్టి వచ్చాను"

"ఎందుకు? పనేమిటో కనుక్కు న్నావా?"

చప్రాసీ బయటకు వెళ్ళి గోధుమ రంగు కాగితంతో చుట్టివున్న ఏదో పాకెట్ తెచ్చి సుషమ ముందుంచాడు. సుషమ కుతూహలంగా ఆ ప్యాకెట్టువిప్పి చూచింది. పిన్ని పంపిన తన చీరలు ముచ్చటైన రంగుల్లో దర్శనమిచ్చాయి. కృష్ణమ్మపిన్ని నిజమే చెప్పింది. చాలా అందమైన చీరలు పంపింది. చాలా బావు న్నాయి.

"చూడు ఆయన్ని లోపలకు రమ్మని చెప్పు. తర్వాత కాంటీన్‌కు వెళ్ళి రెండు కూల్ డ్రింకులు పట్రా. కోకాకోలా అయితే మంచిది"

సుషమ మళ్ళీ చీరల్ని చూడటంలో నిమగ్నమైంది.

చప్రాసీ డోర్ కర్టెన్ నెమ్మదిగా తొలగిస్తూ అతన్ని ఆదర పూర్వకంగా లోపలకు ఆహ్వానించాడు. ఇలాంటి సంద ర్భాల్లో పనికివచ్చే కృతజ్ఞతా పూర్వక మైన నవ్వొకటి సుషమ పెదవుల మీద వెలసింది. వచ్చిన అతిథిని తనకు ఎదు రుగా వున్న కుర్చీమీద కూర్చోవలసిందిగా

తన కోమలమైన చేత్తో అభ్యర్థించింది.

"మీ పిన్నిగారు ఈ చీరలు మీకివ్వమని ఇచ్చారు. చాలాకాలం అయింది. నేను రావటం వీలుపడలేదు. అదీగాక మీ కాలేజీ చాలా దూరంలో వుంది"

"పర్వాలేదులెండి. మీరు యూనివర్శిటీలో చదువుతున్నారా?"

సుషమ ప్రశ్నకు అతడు చిరునవ్వు నవ్వాడు.

"లేదండీ నేను ఫిలింస్ కంపెనీలో పని చేస్తున్నాను నన్ను నీల్ అంటారు" నెమ్మదిగా చెప్పాడతడు. ఇంతలో డోర్ కర్టెన్ పక్కకు తొలిగింది. ట్రేలో రెండు కోకకోలా బాటిల్స్ పెట్టుకుని బేరర్ లోపలకొచ్చాడు.

"మీ కెందుకీ శ్రమ?" నీల్ అన్నాడు. సుషమ నవ్వి అంది. "మీరు బహుశా బి. ఎ. ఫస్ట్ ఇయర్ చదువుకుంటున్న విద్యార్థి అయి వుంటారు. కోక్ అంటే



ఇష్టం వుండి వుంటుందని తెప్పించాను"

"నేనూ సరిగ్గా ఇలాగే పొరబడ్డాను. హాస్టల్ వార్డన్ అనగానే మీ వయసు కనీసం ఓ యాభై వుంటుందనుకున్నాను"

సుషమ నవ్వింది – "మీరు కోకాకోలా తాగుతారా లేక కాఫీ గానీ, టీ కానీ తెప్పించనా?"

"మీరు అనవసరంగా కష్టపడుతున్నారు"

"కష్టం ఏముంది. సరే బేరర్ నువ్వెళ్లి



రెండు కాఫీ ప్లీజ్"

బేరర్‌తో చెప్పి నీల్ వైపు చూచింది సుషమ. అతడు తనవైపే చూస్తున్నాడు. తను ఒక్కసారిగా నీల్ చూపుల్లో బందీ అయిపోయినట్టు అనిపించింది. నీల్ దృష్టితో తన రూపాన్ని తనే ఒక్కసారి చూసుకుంది. అప్పుడే వికసిస్తున్న తెల్లటి గులాబీ లాంటి దేహచ్ఛాయ, దాదాపు ఆ రంగులో కలిసిపోయే వైట్ కలర్ చీర, నల్ల తుమ్మెదలు బారులు తీర్చినట్టున్న కనుబొమ్మలు, అరచెయ్యి వెడల్పున వున్న కళ్ళు ఇంకా, ఇంకా పెద్దవై పోదామని చూస్తున్నాయి. బారాటి ముక్కు చెవులను సగానికి కప్పివేస్తూ చెంపల మీద జీరాడుతున్న ముంగురులు, పల్చటి ఎర్రటి పెదాలు, చెవులకు మెరుస్తున్న ముత్యాల దుద్దులు, చీర రంగుతో మేచ్ అయిపోయే స్లీవ్‌లెస్ బ్లౌజ్... సుషమ నీల్ దృష్టి నుంచి తనను తాను తప్పించుకుని పెన్సిల్‌తో ఏవో గీతలు గీస్తూ కూర్చుంది.

చప్రాసీ వచ్చి రిజిస్టర్ టేబుల్ మీద పెట్టి వెళ్ళాడు. ఒక విద్యార్థిని మర్నాడు ఆలస్యంగా వచ్చేందుకు అనుమతి తీసుకుని వెళ్ళిపోయింది.

ప్రతిరోజూ చేస్తున్నవే అయినా ఈ పనులు ఈ రోజు ఎందుకనో విసుగ్గా, బరువుగా అనిపించాయి.

కాఫీ వచ్చింది. బయట మొదటి గంట కొట్టారు. క్లాసులు ప్రారంభమైనాయి.

"మీరు క్లాస్ తీసుకోవలసి వుంటుందనుకుంటా?" నీల్ అడిగాడు.

"అవును. వెళ్ళాలి"

"నా కారణంగా ఆలస్యం చేస్తున్నట్టున్నారు" అతడు కాఫీ తాగకుండానే లేచి నిలబడ్డాడు.

"అంత అర్జంటుగా వెళ్ళనవసరంలేదు లెండి. మీరు కాఫీ తీసుకోండి" సుషమ అంది. అప్పుడే ఒక విద్యార్థిని కర్టెన్ తొలగిస్తూ లోపలకు తొంగి చూస్తూ అంది "గుడ్ మార్నింగ్ మేడమ్! మీరు మా క్లాస్ తీసుకుంటున్నారా?" అని ఇంగ్లీషులో అడిగింది.

"ఎస్. శాలినీ! నేను ఇప్పుడే వస్తున్నాను" సుషమ జవాబిచ్చింది.

శాలిని నీల్ వైపు చూచి ఓ నవ్వు నవ్వి అక్కడ నుంచి పరుగెత్తింది.

నీల్ లేచి నిలబడుతూ అన్నాడు "ఇంక నాకు శలవు ఇప్పిస్తారా?" సుషమకూడా రిజిస్టర్ అందుకుని నీల్‌తో పాటే గదిలోంచి బయటకొచ్చింది.

"చీరలు మోసుకొచ్చినందుకు చాలా చాలా థాంక్స్" సుషమ అంది వీడ్కోలిస్తూ.

* * *

కౌసల్యాగారి నుంచి ఫోన్ రిసీవ్ చేసుకుని ఆశ్చర్యంలో మునిగిపోయింది సుషమ. అయితే ఆవిడ వచ్చిందన్న మాట. వెంటనే హాస్టల్‌కు రావలసిందిగా ఆహ్వానించింది సుషమ. కాలేజీ నుంచి రాగానే బజారు నుంచి తేవలసిన సామానులు ఏవో చెప్పి తన గది సర్దుకోసాగింది. కౌసల్యాగారు వచ్చి తను ఎంత దర్జాగా వుంటుందో చూచి ఆనందించాలని సుషమ అభిప్రాయం. తనకు ఎలాంటి లోటు లేకపోగా పెద్ద హోదా, గౌరవం వుంది. గదిలో వున్న ఫర్నిచర్‌ని కొత్త భంగిమల్లో సర్దింది. కార్పెట్ దులిపించి గదిని శుభ్రంగా ఊడ్పించింది. ప్రత్యేక సందర్భాల్లో మాత్రమే ఉపయోగించే టేబుల్ కవర్లు, కుషన్ కవర్లు

బయటకు తీసి అలంకరింపజేసింది.

తన బెడ్‌రూంతో పాటు మిగతా ఇల్లు వంటగదితో సహా శుభ్రపరిచి ఎదురు చూస్తూ కూర్చుంది. రోజ్‌కలర్ చీర, అదే రంగు స్లీవ్‌లెస్ బ్లౌజ్ వేసుకుంది. మెడలో ఒంటిపేట ముత్యాల హారం. నీలి రంగులో ఆ హారపు కొసలు వీపు మీదకు జారి అదోరకమైన అందాన్నిస్తు న్నాయి.

కౌసల్యగారితోపాటు నీల్ కూడా వుండటం చూచి ఆశ్చర్యపోయింది సుషమ. మళ్ళీ తనను తనే సమాధాన పర్చుకుంది. ఆవిడ నీల్ తోడు లేకుండా ఎలా రాగలుగుతుందీ ఊళ్ళో.

''వీడు తెలుసుకదా సుషమా" కౌసల్య కూర్చుంటూ అడిగింది. సుషమ ఆమె పక్కనే సోఫాలో కూర్చుంటూ నీల్ వైపు చూచి చిరునవ్వుతో అంది "తెలుసు. నిన్ననే చీరలు పట్టుకొచ్చి ఇచ్చారు."

ఎందుకనోగానీ సుషమ మాటలు విని సంతోషించలేదు కౌసల్య ''మా పెద్ద తాతయ్యగారి కొడుకు.ఇక్కడ ఫిలిప్స్‌లో పని చేస్తున్నాడు. ఇదే రోడ్డులో చిన్నతాత దగ్గర వుంటున్నాడు. చాలా మంచి ఉద్యోగం చేస్తున్నాడు"

పరిచయ వాక్యాలను మౌనంగా వినేసింది సుషమ.

"నీకు చీరలు నచ్చాయా?''

"చాలా బాగా నచ్చాయి''

"నేను నిన్ననే ఊరు నుంచి వచ్చాను. రాగానే ముందుగా నీ చీరలు నీ కంద జేసే పని పూర్తి చేయించాను. ఎంత చెప్పినా నీల్ ఇంట్లోంచి కదలండే ! గర్ల్స్ కాలేజీకి నేను వెడితే ఏం బావుంటుంది అన్నాడు" అంది కౌసల్య నవ్వుతూ.

ఏం మాట్లాడాలో తోచలేదు సుషమకు. ఒక్క క్షణం ఆలోచించి "ఇవ్వాళ మీరు రావటం నాకెంతో ఆనందంగా వుంది. ఈ పరాయిచోట మీలాంటి ఆప్తులు కనిపిస్తే స్వంత ఊళ్ళో వున్నట్లే అనిపిస్తుంది."

"నీ గది చాలా అందంగా వుంది. ఈ టేబుల్‌క్లాత్ డిజైన్ నువ్వే కుట్టావా?"

"లేదు ఆంటీ! నాకు అంత తీరిక ఎక్కడ? మా చిన్నచెల్లి కుట్టింది. దానికలాంటి పనులంటే మహాసర్దా"

"నిరుపమ చాలా అందంగా కూడా వుంటుందటకదా ! ఇంకా పెళ్ళి నిశ్చయం చేయలేదా?"

"ఇప్పటివరకూ లేదు"

నీల్ మౌనంగా కూర్చుని, ప్రశంసా పూర్వకమైన దృష్టితో ఆ గది అంద చందాల్ని పరిశీలిస్తున్నాడు. లేత పసుపు రంగు గోడలు, వాటిలో కలసిపోతూ పసుపురంగు కర్టెన్లు, గ్లాస్ టేబులు మీద రజనీగంధ పుష్పాలు, వాటి పరిమళంతో గుండె నిండిపోతోంది.

నీల్ గదిని చూస్తూనే మధ్య మధ్య సుషమ వైపు చూస్తున్నాడు. అపరిచితులతో మాట్లాడుతున్నప్పుడు సైతం సుషమ స్వరం తియ్యగా పలుకుతుంది. ఇహ ఆప్తులతో మాట్లాడితే ఇంకెంత మధురంగా వుంటుందో అనుకున్నాడు నీల్. అలాగే సుషమనే చూస్తూ కూర్చున్నాడు. కౌసల్యగారితో మాట్లాడుతూ అప్పుడప్పుడు సుషమ ఇతనివైపు కూడా చూస్తోంది. నీల్‌లో వున్న భోళాతనం సుషమను ఆకట్టుకున్నది. అతడి రూపం మనసు మూలల్లో తిష్టవేసింది.

నీల్ ఏమి ఆలోచిస్తున్నాడో తెలుసుకుంటే బావుంటుందనుకుంది సుషమ.

ఏదో జిజ్ఞాస ఆమెలో మేల్కొంది. నీల్ తనపట్ల ఆకర్షితుడవుతున్నాడని అంతకు మునుపే గమనించిందామె. కళ్ళని, ముఖ్యంగా మగవాళ్ళ కళ్ళలో కనిపించే ప్రశంసని చదువుకోవటం సుషమకు అలవాటైన విద్య. కానీ నీల్ కళ్ళల్లో ప్రశంస స్థానంలో మరేదో వుంది. అదేమిటో ఖచ్చితంగా తెలుసుకోలేకపోతోంది. అలా ఆలోచిస్తూనే కౌసల్యాగారితో అంది "టీ తెప్పించమంటారా?"

సుషమ లోపలికి వంటగది తలుపుల వరకూ నడిచింది. వెనుక నుంచి నీల్ గొంతు వినిపించింది. "నా కోసం కోకాకోలా తెప్పించండి"

ఒక చేత్తో వంటింటి గుమ్మం కర్టెన్ పట్టుకుని వెనక్కి తిరిగి చూసింది సుషమ. నీల్ కళ్ళలో అప్పుడు కనిపించిన అల్లరి, నవ్వు మిళితమైన భావం గమనించి ముగ్ధురాలవుతూ లోపలకు



వెళ్ళిపోయింది.

వంట మనిషి ట్రేలో టీ సామానుతో వచ్చి అది టేబుల్‌మీద పెట్టి వెళ్ళిపోయింది. కౌసల్య అడిగింది — "ఈమె మీ పని మనిషా? పని బాగా చేస్తుందా?"

"కాస్త మందబుద్ధి. కానీ చాలా నిజాయితీ వున్న మనిషి"

టీ కప్పు చేతిలోకి తీసుకుంటూ నీల్ కౌసల్యతో అన్నాడు—"అక్కా! ఈవిడగారు నన్ను చూడకముందు కోకాకోలా తాగే కుర్రాడిని అనుకున్నారట! తీరా నన్ను చూసి కంగారుపడిపోయారు"

"మీరు మాత్రం నేను వయసు వాలిపోయిన ముసలిదాన్నయి ఉంటాననుకోలేదా?"

"మీరు మీ స్టూడెంట్లను ఎలా భయపెట్టగలుగుతున్నారో నాకు అర్థం కావటం లేదు. మిమ్మల్ని చూస్తుంటే కొంచెం కూడా భయం వేయటం లేదు" నీల్ కళ్ళలో గంభీరతకు బదులు అల్లరి, చిలిపితనం కనిపించింది.

"మిమ్మల్ని హాస్టల్‌లో వుంచి భయపెట్టవలసిన అవసరం కూడా నాకు లేదు" సుషమ వెంటనే అంది.

కౌసల్య నవ్వుతూ అంది—"ఇవ్వాళ్ళ నీల్‌కు సరిపడా జోడీ దొరికింది. ఇంట్లో అందర్నీ భయపెట్టేస్తాడు. ఎవ్వరూ నీల్ ఎదుట నోరెత్తి మాట్లాడరు. ఒక్కగా నొక్క కొడుకు అని మురిపెంగా పెంచారు. వీడేమో వాళ్ళ నెత్తికెక్కి కూర్చున్నాడు"

"అందరూ నన్నే ప్రేమించేస్తుంటే మరేం చేయమంటారు చెప్పండి" నీల్ సుషమవైపు చూస్తూ అన్నాడు.

"నేను కూడా నా తమ్ముళ్ళని ముద్దు చేసి చెడగొట్టాను" అంటూనే చిన్న తమ్ముడు చేసే అల్లరి పనులు గుర్తుకురాగా సుషమ ముఖం ఆనందంతో వికసించింది. కౌసల్యగారి వైపు చూస్తూ "వాడు చాలా చెడ్డపిల్లాడు. తానెంత అల్లరి చేసినా కాపాడటానికి అక్క వుండనేవుంది అనుకుని మరీ చేస్తాడు అల్లరి. అమ్మని చూసి కొంచెం కూడా భయపడడు. ఆవిడ ఏమన్నా అంటే 'ఇదుగో అక్కతో చెప్తాను' అని బెదర గొట్టేస్తాడు"

"కృష్ణమ్మ అంటుండేది. సుషమ తన జీవితాన్ని తమ్ముళ్ళకూ, చెల్లెళ్ళకూ అంకితం చేసేసింది అని"

కౌసల్యగారి మాట విని సుషమ ఒక్కసారిగా షాక్ తిన్నట్టు మౌనంగా కూర్చుండిపోవటం నీల్ గమనించాడు. నీల్‌కు కూడా అక్క అన్న మాటలు నచ్చలేదు. సంభాషణ మళ్ళించాలని అన్నాడు "ఈ పెయింటింగ్ - మీరే వేశారా?"

"లేదండీ. నేను కాదు. ఓ ఫ్రెండు ప్రజెంట్ చేసింది".

కొంచెం ఆగి కౌసల్యతో "మీరు మరో కప్పు టీ తీసుకోండి" అంది.

"వద్దు సుషమా! ఇంటి నుంచి బయలుదేరేముందు కూడా టీ తాగి వచ్చాం".

"మీరు ?"

"వద్దు. థాంక్స్" నీల్ జవాబిచ్చాడు. సుషమలో అంతకు క్రితం వున్న సహజత్వం ఇప్పుడు లోపించినట్టు అనిపించింది నీల్‌కు. మాటలు, చేతలు ప్రయత్న పూర్వకంగా చేస్తున్నట్టు అనిపించింది. అక్క మాటలతో సుషమ గాయపడలేదు కదా! ఎన్నో విషయాలు సుషమని అడిగి తెలుసుకుందామనుకున్నాడు. కానీ

ఆమె మౌనం ముందుకు కదలనివ్వటం లేదు.

కౌసల్య లేచి నిలబడింది. సుషమ వీపుమీద చెయ్యివేసి ప్రేమతో నిము రుతూ అంది – "నిన్ను చూడటంతో ఈరోజు నాకు చాలా సంతోషంగా వుంది సుషమా !
రెండు రోజుల్లో నీల్‌ని పంపిస్తాను. ఒక సారి మా యింటికి రా. అదీ నీ యిల్లే అనుకో. ఎప్పుడైనా ఏదైనా అవసరం వస్తే నేనున్నానని మర్చిపోకు, నిస్సంకో చంగా కబురు చెయ్యి"

అక్క వెనక నిలబడి సుషమ వైపు చూస్తూ అలాగే చెయ్యమన్నట్టు నవ్వు తున్నాడు నీల్.




ఆరోజు ఏదో పని మీద బజారుకు వెళ్ళే నీల్ కనుపించాడు సుషమకు. తను కని పించాగానే అతడి కళ్లు గొప్ప నిధి దొరికి నట్టు వెలిగిపోయాయి. సుషమను టీ తాగటానికి ఆహ్వానించి పక్కనే వున్న రెస్టారెంట్‌లోకి తీసుకెళ్ళాడు. టీ ఆర్డర్ చేశాక అన్నాడు "మీకు అదృష్టం మీద నమ్మకం ఉందా?"

"ఎందుకు?"

"ఏమీ లేదు. ఈ సాయంత్రం మీ దగ్గరకి వద్దామనుకున్నాను.కానీ మొన్న నే కదా వెళ్ళింది మళ్ళీ ఈ రోజు కూడా వెళ్తే ఏం బావుంటుందని విరమించుకు న్నాను. అదృష్టవశాత్తు మీరే కనిపిం చారు. ఇది అదృష్టమే అనుకుంటున్నాను నేను"

నీల్ హద్దుమీరి మాట్లాడుతున్నాడు. కాస్త బుద్ధి చెప్పటమో, మందలించటమో చేయకపోతే లాభం లేదు అనుకుంది సుషమ.

సుషమ మనసులో మాటను పసికట్టి నట్టు అన్నాడు నీల్ – "నా మాటలు కోపం తెప్పించ లేదు కదా మీకు? ఏదీ మనసులో దాచుకునే అలవాటు లేదు నాకు. మనసులో ఏముంటే అదే అనే స్తాను బయటికి?"

టీ కెటిల్ మూత తీసి లోపలకు తొంగి చూస్తూ అంది సుషమ – "ఇంకెప్పుడూ అలా అనకండి"

భయంలేని మొండి పిల్లాడిలా అన్నాడు నీల్–"అనను. కానీ నేను అలా ఆలోచిస్తే ఏం చేస్తారు. ఆలోచనలకు సంకెళ్లు వేయలేరు కదా మీరు"

అలా అంటున్న నీల్ చాలా ప్రియ మైన వ్యక్తిత్వం వున్న మనిషి అను కుంది సుషమ.

"టీ తాగండి" టీని కప్పులోకి వడ పోస్తూ అంది సుషమ.

"మీలాంటివారిలో అంటే టీ చర్స్‌లో వుండే అవలక్షణం ఇదే. కనిపించిన ప్రతి వాడినీ ఆజ్ఞాపించేద్దామని చూస్తారు. ఉదా హరణకు మిమ్మల్నే తీసుకుందాం. చిన్న బొమ్మలా వున్నా అధికార దర్పం మాత్రం భయపెట్టేటంత వుంది. ఎన్నెన్ని బాధ్యతలు, బరువు తీసుకున్నారో కదా. హాస్టల్ వార్డెన్...లెక్చరర్..."

ఇది విని సుషమ అనుకోకుండానే నవ్వుకుంది. తను తనకున్న వయసు

కన్నా బాగా చిన్నదానిలా కనిపిస్తుందని తనకు తెలుసు. అయినా ఇవ్వాళ అదే మాట నీల్ నోట విని ఆనందించింది.

"మీరు చదువు చెప్పే అమ్మాయిలు వయసులో మీకన్నా పెద్దవారే అయి వుంటారు బహుశా" స్పూన్‌తో పంచదార కలియబెడుతూ అన్నాడు నీల్.

ఈసారి నీల్ మాటలు విని కోపం తెచ్చుకోలేకపోయింది సుషమ.

నీల్ సుషమని దిగబెట్టటానికి కాలేజీ వరకు వచ్చాడు. వద్దన్నా వినలేదు. చీకటిపడగానే కాలేజి గేటు మూసేస్తారు. టేక్సీని గేటు బయటే ఆపించి సుషమ దిగిపోయింది. నీల్ అడిగాడు "నన్ను మీ వెంట మీ యింటికి రమ్మని ఆహ్వానించాలని అనిపించటంలేదా మీకు?"

"చాలా పొద్దుపోయింది మీకు ఆలస్యమైపోయింది కదా?" సుషమ ఎలాగో తప్పించుకోజూచింది.

"నేను ఆడపిల్లను కాదుకదా చీకటిలో

తిరిగి వెళ్ళలేకపోవటానికి" అంటూ నీల్ కూడా కారు దిగాడు.

సుషమని చూచి ఒక చప్రాసీ పరుగెత్తుకొచ్చి ఆమె చేతిలోని ప్యాకెట్టు అందుకున్నాడు. మరో చప్రాసీ గేటు తెరవటానికి పరుగెత్తుకొచ్చాడు.

నీల్ సుషమ వెంట ఆమె ఇంటి వరకు వచ్చాడు. అడుగుల చప్పుడు విని పనిమనిషి తలుపు తెరిచింది. నీల్‌ని జూచినమస్కరించి లోపలికెళ్ళిపోయింది.

"కాఫీ తెప్పించనా?" సుషమ అడిగింది.

"వద్దు థాంక్స్" అనేసి కాళ్ళకు చుట్టుకుంటున్న పిల్లిపిల్లను చేతుల్లోకి తీసుకుని దాని వీపు నిమురుతూ నిలుచున్నాడు నీల్.

"ఇది మీదేనా?" అడిగాడు నీల్.

"నాదికాదు. నా కొలీగ్ మిస్ శాస్త్రి అని ఉంది. ఆవిడ జన్మదినం సందర్భంగా స్టూడెంట్స్ ఈ పిల్లిని బహూకరించారు.

నీల్ పసుపు పచ్చగా మెరుస్తున్న దాని కళ్ళని చూస్తున్నాడు. ఇంతలో అది అతడి చేతుల్లోంచి సోఫా మీదకు దుమికింది.

రెండు చేతులూ ఒళ్ళో పెట్టుకుని మౌనంగా కూర్చుండిపోయింది సుషమ. గది గోడలకున్న కర్టెన్లు పచ్చటి కాంతిలో మెరుస్తున్నాయి. సుషమ చీర అంచు గాలి వీచినప్పుడల్లా ఊగిసలాడుతూ మిణుగురుల గుంపులా తళుక్కుమంటోంది. నీల్ ముందుకు వంగి సోఫాలో కూర్చుని వున్నాడు. పిల్లి పిల్ల వీపుని నెమ్మదిగా నిమురుతున్నాడు. ఒక్క నిమిషం తరువాత సుషమ వైపు తిరిగి అన్నాడు "మీరు నా మాటలవల్ల, రాక వల్ల ఇబ్బంది పడుతున్నారుకదూ?" నీల్ స్వరంలో బాధ నిండిన పశ్చాత్తాపం ధ్వనించింది.

సుషమ మాట్లాడలేదు. నీల్ వైపే చూస్తుండిపోయింది. నీల్ లేచి నిలబడాడు - "మీ మౌనాన్ని చూస్తుంటే నేనేదో తప్పు చేశాననిపిస్తోంది. నేను రావటం మీకేమంత ఇష్టంగా లేనట్టుంది"

సుషమ అప్పటికీ ఏమీ మాట్లాడలేదు. తనలో చెలరేగుతున్న ఆలోచనలకు ఒక రూపం ఇవ్వలేక ఇచ్చే ప్రయత్నంలో ఏదీ మాట్లాడలేని స్థితిగా వుంది. నీల్ పిల్లిపిల్ల వీపు నిమురుతున్న ఆ దృశ్యం సుషమని విపరీతంగా ఆకట్టుకుంది. మళ్ళీ అంతలోనే నీల్ అలా రాత్రివేళ తన వెనకే రావటం ఉచితమైన పని కాదనుకుంది. తను అందరిలాంటి యువతి కాదు. తన ప్రతి చర్య, ప్రతి చేష్ట సూక్ష్మ పరిశీలనకు గురవుతాయి. అనవసరంగా లేనిపోని అపవాదులకు గురికావటం మంచిదికాదు. కానీ ఆ మాట ఎలా చెప్పటం? నీల్ ఏమనుకుంటాడు. తను అతి చిన్న విషయానికి అనవసర ప్రాధాన్యతని ఆపాదించి బాధపడుతున్నట్టు భావించడా! రాత్రి తొమ్మిదిన్నరకు టాక్సీలో తన వెంట తనను ఇంటిదగ్గర దిగబెట్టడానికి వచ్చినంత మాత్రానికే ఏమై పోతుందని"

నీల్ సుషమ ముఖంలో నిండిపోయి వున్న అనిశ్చితత్వాన్ని గమనించాడు. అనుకోకుండా సుషమ కలవటంతో ఈ సాయంత్రం ఇంద్ర ధనస్సులా మారి అందంగా గడిచిపోయింది. అందుకే రెస్టారెంట్‌లోంచి 'ఇక వెళ్తాను' అని సుషమ లేచినప్పుడే నీల్ నిరాశపడిపోయాడు.




సుషమ వెళ్ళిపోతే తను ఒంటరివాడినై పోతానని బెంగపడిపోయాడు. మరికాస్త కాలాన్ని ఆమె సమక్షంలో గడిపేద్దామన్న ఆశతో వద్దంటున్నా వెంట వచ్చాడు.

"సరే ఇంక నేను వెళ్తాను. గుడ్ నైట్" నీల్ చటుక్కున అనేశాడు. ఆ మరుక్షణమే గదిలోంచి బయటకు వెళ్ళి పోయాడు.

"ఏమండి మాట" అంటూ సుషమ పిలుస్తున్నా నీల్ ఆగలేదు. బారాటి అంగలు వేసుకుంటూ వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయాడు. 'టక టక'మంటున్న అతడి బూట్ల శబ్దంలో అలక ధ్వనించింది. ఏమీ చేయలేని స్థితిలో వరండాలో నిలబడి వెళ్ళిపోతున్న నీల్ వైపే చూస్తుండిపోయింది సుషమ. తను అనవసరంగా నీల్ మనసు కష్టపెట్టింది. తను ఎన్ని అదృశ్య మర్యాదల మధ్య, పరువు ప్రతిష్ఠల మధ్య బందీ అయిపోయి వుందో అతనికి ఎలా వివరించటం?

ప్రహరీగోడ అవతల స్టాపులో బస్సు వచ్చి ఆగింది. అందులో ఎక్కి నీల్ వెళ్ళిపోయాడు. ఇద్దరు చప్రాసీలు బయట గేటుదగ్గర మౌనంగా కూర్చునివున్నారు. పిల్లిపిల్ల సుషమ కాళ్ళ చుట్టూ బొంగరంలా గిరగిరా తిరుగుతోంది. దాని పేరు "డియరెస్ట్".

* * *

శనివారం సాయంత్రం కుషన్ కవర్లు కుడుతూ కూర్చుంది సుషమ. రోజల్లా కుడుతూనే ఉండేమో చేతులో వున్న పట్టుదారపు వుండని కుర్చీలో పడేసి బయట వరండాలోకి వచ్చి నిలబడింది.

గాలి చల్లగా, మృదువుగా ఆమెను తాకింది. సుషమ ముందుకు ఒంగి నిల్చుని చుట్టూ పరికించి చూచింది. నాలుగు వైపుల నుంచి ప్రసరిస్తున్న వెలుగులో తన బంగ్లా నిద్రపోతున్న చిన్న శిశువులా కనిపించింది. లోపల ఒక్క గదిలో మాత్రమే లైటు వెలుగుతోంది. నైలాన్ పర్దాల మీద కాంతి పరావర్తనం చెంది బయటవున్న పూలతీగపై పడుతోంది. ఒకవైపు కాలేజీ బిల్డింగ్, మరో వైపు హాస్టల్ బిల్డింగ్ నిలబడి చూస్తున్నాయి. అలసటను తీర్చుకుంటానికి రెండు ఆరచేతులతోనూ కనుపాపలను మెల్లగా నిమురుకుంది. వాలిపోతున్న సూర్యుడి వెలుగు నెమ్మదిగా పరుచుకుంటున్న చీకటి రేకలు సుషమ మనసులోని ముడులను విడదీయసాగాయి. ఏదో అకారణమైన శాంతి నీడలా పరుచుకుంది. ఆ నాలుగు గోడల మధ్య బంధింపబడి వున్న అతి చిన్న ప్రపంచాన్ని దాటుకుంటూ హృదయం ఎక్కడికో ఎగురుకుంటూ వెళ్ళిపోయింది. తన అస్తిత్వాన్ని తనే మరచిపోయింది.

"సుషమా" మీనాక్షి పిలుపు విని ఈ లోకం లోకి వచ్చి నిటారుగా నిలబడి చూచింది.

"చీకట్లో నిలబడ్డావేమిటి?"

"ఊరికే"

"బ్రోకేడ్ హేండ్‌బాగ్ ఇస్తావా!"

మీనాక్షి సందేహిస్తూ అడిగింది. సుషమ మారు మాటాడకుండా లోపలకు వెళ్ళి హేండ్‌బాగ్ తీసి అందులోని సామాన్లు టేబుల్ మీద గుమ్మరించేసింది. మీనాక్షి అద్దం ముందు నిలబడి జుత్తు సవరించుకుంటూ అంది "నాకు ఇవ్వాళ డిన్నర్ పార్టీ వుంది. వెళ్తున్నాను."

"అలాగా!"



"మా నాన్నగారి మిత్రుడు ఆయన" మీనాక్షి చిరునవ్వు నవ్వింది.

లేచి నిలబడి "నా డ్రస్‌కు ఇది మ్యాచ్ అవుతుందా?" అని అడిగింది.

"ఓ" సుషమ సమాధానమిచ్చింది.

"ఎందుకలా వున్నావు ఏదో పోగొట్టు కున్నదానిలా?"

"అబ్బే ఏం లేదు"



నమ్మలేదు మీనాక్షి. "మా నాన్నగారి మిత్రుడని చెప్పాను కదా. మొన్నీ మధ్యనే ఆయన సుపుత్రుడొకడు ఫారెన్ నుంచి తిరిగొచ్చాడు. ఏదో పనివుండి ఢిల్లీ వచ్చాడు. అతడే నన్ను డిన్నర్ కోసం ఆహ్వానించాడు. సరే ఇక వెళ్తా. ఇప్పటికే ఆలస్యమైనట్టుంది"

తన వేష భాషల విషయంలో మీనాక్షి ఎప్పుడూ ఉదాసీనంగానే వుండేది. ఆమెకు పుస్తకాలు చదివే అలవాటు వుంది. కొన్ని పెద్దపెద్ద పుస్తకాల పేర్లు గుర్తుం

చుకుని చదివేసానన్నట్టు దబాయించే అలవాటు కూడా వుంది. కానీ ప్రస్తుతం మీనాక్షి ముఖాన్ని చూస్తుంటే– పెళ్ళి మాట విన్నప్పుడు తన చెల్లెలు నిరుపమ ముఖం ఎలా వుంటుందో సరిగ్గా అలాగే కాంతిమయంగా వుంది. అలంకరణ కూడా అలాగే వుంది.

తన బ్యాగులోంచి టేబుల్ మీద గుమ్మరించిన వస్తువులు సర్దసాగింది సుషమ. లిప్‌స్టిక్ మరకలు పడి వున్న రెండు జేబురుమాళ్ళు, ఒక తాళంచెవి, నలిగిపోయిన ఓ కాగితంముక్క మీద టెలిఫోను నెంబరు, ఒన్నపౌడర్ డబ్బా ఉన్నాయి.

కాగితాన్ని చిత్తుకాగితాల బుట్టలో పడేసి మిగతా వస్తువుల్ని డ్రస్సింగ్ టేబుల్‌మీద సర్దింది.

తర్వాత లోపలవైపు వరండాలోకి నడిచింది. వంటగది చిక్కటి నిశ్శబ్దంతో నిండి పోయివుంది. భైరా ఒక్కతేకూర్చుని కూరగాయలు తరుగుతోంది. ఇంత పెద్ద ఇల్లు తనకు అనవసరం అని సుషమ రోజుకోసారైనా అనుకునేది. ప్రతి నెలా ఏదో ఒక కొత్త వస్తువు తెచ్చి అలంకరిస్తున్నప్పటికీ ఇంకా రెండు గదులు ఖాళీగానే పడివున్నాయి. సుషమను ఒంటరితనం ఆవరించుకోసాగింది. ఎవరి దగ్గరికైనా వెళ్ళి కాసేపు కూర్చొని కాసిన్ని కబుర్లు చెప్పి, వినీ వస్తే బావుంటుందనిపించింది. కానీ బట్టలు మార్చుకోవటం, తల దువ్వుకోవటం లాంటివి చాలా పెద్ద పనుల్లా అనిపించి ఊరుకుంది. నైట్‌క్వీన్ పూల గుత్తిని ఒకదాన్ని తెంచుకుని పడక కుర్చీలో వాలిపోయింది. ఆ సమయంలో హటాత్తుగా మీనక్షి, ఇందాక పాలపుంతలా వెలిగిపోయిన ఆమె ముఖం గుర్తుకొచ్చాయి. తనకంత అదృష్టం ఎక్కడ వుంది.

ఇలాంటి సందర్భాల్లోనే సుషమ మనసు వికలమై బాధతో తల్లడిల్లిపోతుంది. తప్పంతా తన తల్లిదండ్రులదే అనిపిస్తుంది. లేకుంటే తను ఇంతకాలం పెళ్ళి కాకుండా ఎందుకుంటుంది. తన పెళ్ళి జరిగి వుంటే ఇవ్వాళ తనకు సమస్త హంగులూ వుండేవి. ఏకాంత సాయం త్రాల్లో తోడుగా వుండి తనను ప్రేమించే భర్త, కారు, పిల్లలు, సర్వ సుఖాలు– సుషమ తన ఆలోచనలన్నింటినీ అటు వైపుకు మళ్ళించింది.

అనుకోకుండానే ఆమె హృదయంలో నీల్ రూపం ప్రత్యక్షమైంది. అది నెమ్మది నెమ్మదిగా పెద్దదవుతున్నట్టు, సుషమ నీల్ గురించి ఆలోచించిసాగింది.

* * *

చాలా రోజులు గడిచిపోయాయి. నీల్ కబురేది తెలియలేదు. అతను మళ్ళీ రాక పోవటం వల్ల ఏదో శాంతి లభించినట్లు అనిపించింది సుషమకు. నీల్ రాకతో నిర్మల తటాకంలా వున్న తన హృదయం కల్లోలభరితంగా మారి పోయింది. తను ఇదివరకటిలా ప్రశాంతంగా వుండలేకపోతోంది. కానీ అంతలోనే మళ్ళీ అనుకుంటూంది– 'ఇప్పుడు గనుక పూలగుచ్ఛం పట్టుకుని నీల్ తన కోసం వస్తే ఎంత బాగుండును' అని. ఒంటరితనంలో ప్రతిఒక్కరి హృదయం లోనూ ఎవరిదో ఒక రూపం ప్రత్యక్షమౌతుంది. అది వాస్తవమైనదీ కావచ్చు. కల్పించుకున్నదైనా కావచ్చు. ఈ రకమైన ఆలోచనలు ఒంటరితనంలో ఎంతో మనశ్శాంతిని అందజేస్తాయి. మీనాక్షి ఏకాంతం దొరికినప్పుడల్లా తన భావి

పతిని గురించే ఆలోచిస్తుంటానని చెప్పేది. ఆమె ఊహా పురుషుడు విదేశాల్లో చదువు ముగించుకొని వచ్చినవాడూ, సంస్కార వంతుడూ అయివుంటాడు.

సుషమ ఎప్పుడూ అలాంటి ఆలోచనలకు తావిచ్చేది కాదు. తన జీవితాన్ని గురించి నిర్ణీతమైన ప్లాన్ ఒకటి ఎప్పుడో సిద్ధం చేసుకుంది. వయసుతోబాటు బాధ్యతలు కూడా పెరిగిపోవటంతో గంభీరంగా మారిపోయింది. ఆమె సమవయస్కులు అందరూ మరో రకంగా వుండేవారు. వాళ్ళ జీవిత విధానాలే భిన్నమైనవి. వాళ్ళకూ, తనకూ ఎలాంటి సామీప్యం మిగలలేదు. వాళ్ళతో మాట్లాడే సమయాల్లో సుషమ తనూ ఒక అందమైన స్త్రీననీ, ఆకర్షణీయమైన యువతిననీ మర్చిపోయి ఫ్రీగా మాట్లాడుతుంది. చర్చల్లో పాల్గొంటుంది. ఆమె మస్తిష్కం ప్రతి నిముషం మేల్కొనే వుంటుంది. కానీ నీల్? అతని దృష్టిలో తను కేవలం ఒక ఆకర్షణీయమైన యువతి మాత్రమే అయివుంటుంది. బహుశా నీల్‌కు తన వయసు ఎంతో తెలిసివుండదు. తను అతని కళ్ళకు అందంగా కనిపిస్తుంది. అంతే!

ఈ ఆలోచనలతో సుషమ ఆనంద పారవశ్యానికి లోనయ్యేది. నీల్ యువకుడు. అతడి కళ్ళల్లోని స్వచ్ఛత, నవ్వులోని నిర్భీతి, అల్లరి బావుంటాయి. ఆ వెంటనే సుషమ తను పోగొట్టుకున్న వయసు, గడిచిపోయిన సంవత్సరాలు గుర్తుకొచ్చి విచలితురాలయ్యేది. జీవితపు అవసరాల కోసం, కుటుంబం కోసం ఉరుకుల పరుగుల మీద వెళ్ళిపోయిన ఆ సంవత్సరాలు...ఇప్పుడు తన చుట్టూ గోడలు నిలబడివున్నాయి. ఇంటి బాధ్యతలు, ఉద్యోగ హోదా. కుటుంబ సభ్యుల గురించి ఆలోచన తప్ప తన గురించిన ఆశలు ఏవీ మిగలలేదు.

తనకు ప్రియుడు అవసరం లేదు. భర్త కావాలన్న ఆకాంక్ష కూడా లేదు. కానీ ఎందుకనో అప్పుడప్పుడు గుర్తు తెలియని ఆవేదన చుట్టుముట్టేస్తుంది. కుటుంబ బరువు బాధ్యతలన్నీ తలపై కెత్తుకుని నిలబడిపోయింది. ఒంటరితనంలో వణికిపోతూ ప్రేమగా పలకరించేవారు లేక తల్లడిల్లిపోతుంది. అలాంటి సమయాల్లో అనిపిస్తుంది– "తనకూ ఓ తోడు కావాలి. తనను చుట్టేసుకుని లాలించే రెండు చేతులు, నీరవనిశ్శబ్దంలో తనని పిలిచే పెదవు:: కావాలి. ఆ సంబోధన తను వినాలి'




వెళ్ళుతున్న అంబులెన్స్ వైపే చూస్తుండి నిల్చుండిపోయింది సుషమ. అందరూ ఆమతమ్మ పనుల్లోకి వెళ్ళిపోయారు. కానీ సుషమ కళ్ళ ముందు పాలిపోయిన స్వాతి ముఖమే కదులాడుతోంది.

ఆ సంఘటన ఊహించని విధంగా జరిగిపోయింది. ఆ షాక్‌లోంచి సుషమ ఇంకా తేరుకోలేదు.

స్వాతి గత సంవత్సరమే కాలేజీలో బెంగాలీ లెక్చరర్‌గా జాయినయింది.

ఆమె రహస్య ప్రణయకలాపాల గురించి సుషమకు కొంత తెలుసు. అయితే రాత్రి ఏం జరిగిందో గానీ స్వాతి నిద్రమాత్రలు మింగి ఆత్మహత్యా ప్రయత్నం చేసి విఫలమైంది. ఈ సంగతి అందరికీ తెలిసి పోయింది. అంతటా స్వాతి గురించిన చర్చే. స్వాతితో గాఢమైత్రి లేకపోయి నప్పటికీ ఈ సంఘటనతో సుషమ విప రీతంగా బాధపడింది. ఏ పరిణామం స్వాతి చేత ఈ పని చేయించిందో?. డాక్టర్ స్వాతికి ప్రాణగండం ఉండదని గట్టిగా చెప్పాడు కానీ సుషమ మనసు ఆందోళనభరితంగానే వుంది. ఖిన్న వద నంతో ఉదాసీనంగా నడుచుకుంటూ స్టాఫ్‌రూంలోకి అడుగు పెట్టింది. అక్కడ దీనిని గురించిన చర్చ చురుకుగా సాగు తోంది. పరధ్యానంగానే సుషమ అవన్నీ విన్నది. తన సహోధ్యాయుల మీద అసహ్యం పుట్టుకొచ్చింది. సాటి స్త్రీ ప్రమాదావస్థలో వుంటే చదువుకున్న, సుశిక్షితలైన ఈమహిళలు కనీసం జాలైనా లేకుండా ఆవిడగురించిఅసహ్యంగా మాట్లా డేసుకుంటున్నారు. నవ్వుకుంటున్నారు. వీళ్ళమధ్య కూర్చునేకన్నా చదువుసంధ్యా లేని పని మనుషుల మధ్య కూర్చుంటే బావుంటుందనిపించింది.

వారు ఇంకా చర్చిస్తూనే ఆనందంలో మునిగితేలుతున్నారు.

సుషమ ఉండబట్టలేకపోయింది. "ఇలాంటి మాటలు చెప్పుకోవటానికి మీకు సిగ్గు వేయటం లేదూ? స్వాతి ఎలాంటి దైనా మన మనిషి. మన మధ్య బ్రతుకు తున్న సాటి స్త్రీ. ఇవ్వాళ ఆవిడ్నీ అడి పోసుకున్నట్టే రేపు మరొకటి జరిగితే మీరు ఇలాగే చేస్తారా?" అంది ఆవేశంతో.

మిసెస్ పూరి ముఖం కోపంతో ఎర్ర బారింది. ఆ మరుక్షణమే తెల్లగా ఎండి పోయింది. తన మాటలను సమర్థించుకో జూస్తూ "సామాజిక నియమనిబంధలను ఉల్లంఘిస్తే ఇలాంటి శిక్షే పడుతుంది. అలాంటివాళ్ళని శిక్షించటమే న్యాయం. స్వాతి మీద నాకెలాంటి సానుభూతి లేదు" అంది.

"మరో వ్యక్తి తాలూకు వ్యక్తిగత విషయాలు అందరి ముందూ ఇలా చర్చించి నవ్వులపాలు చేయమనికూడా వుందా మీసామాజికనియమ నిబంధనల్లో? మరో వ్యక్తి తాలూకు వ్యక్తిగత విష యాల్లో జోక్యం చేసుకునే అధికారం, అనుమతి లేకుండా వాళ్ళ గురించి ఈ రకంగా చర్చించే అధికారం ఎవరికీలేవు?" సుషమ ఉగ్గురాలౌతూ అంది – "స్వాతి ఎంతో దూరం నుండి ఉద్యోగం కోసం మన మధ్యకు వచ్చింది. ఆమె ఆపదలో వుంటే సహాయపడటం చదువుకున్నవారి కనీస కర్తవ్యం అని కూడా మీకు తోచ లేదా? ఏ సహాయమూ చేయకపోగా మీరు..."

"అంత కరుణగలదానివైతే ఆవిడకు నిబంగారు మనో ప్రాంగణంలో ఆశ్రయం కల్పించి పిల్లాడు పుట్టగానే మిఠాయిలు పంచు. ప్రతి అడ్డమైనదానికీ సహాయపడే ఓపిక నాకు లేదు" సాధ్య మైనంత వ్యంగ్యంగా అంది మిసెస్ పూరి. మాటలు మంటల్లా పైకిలేస్తున్నాయి.

మరి కాసేపు వుంటే తగువైపోతుందని మీనాక్షి సుషమ రెక్క పట్టుకుని అవతలకు లాక్కెళ్ళింది. "సుషమా! ఇలా అనవసర చర్చల్లో తలదూర్చి విరోధం ఎందుకు కొనితెచ్చుకోవటం? భలేదానివిలే. పద. మరొకరి విషయాలు మన

కెందుకు?" అంది.

బయటికొచ్చాక మీనాక్షి అంది "నీకు చాలా కోపం వచ్చేసినట్టుంది. ఇంకా వణుకుతూనే వున్నావు"

సుషమ బలవంతంగా నవ్వుతూ అంది "వాళ్ళ మాటలు విని భరించలేకపోయాను మీనాక్షీ! స్వాతికి ఎంత పెద్ద వయసుంది గనుక! పొరపాటున ఆపదలో చిక్కుకుంది. సహాయపడకపోగా వెకిలికబుర్లు చెప్పుకుని అపవాదులు మోపేయటం సంస్కారుల లక్షణమేనా?"

మీనాక్షి తన గది తాళం తీస్తూ అంది "ఈలోకం అలాగే ప్రవర్తిస్తుంది. ఎదుటి వారి తప్పుని మరింత విశాలంచేసి ఆనందిస్తారు వీళ్లు. నిజమే! కానీ చదువు సంస్కారం వుందనీ, అభ్యుదయ పథాన నడుస్తున్నామని గొప్పలు చెప్పుకునే మన లాంటివాళ్ళు కూడా అలాగే చేయటం అన్యాయమే"

సుషమ అలసటతో నిట్టూరుస్తూ కుర్చీలో కూలబడింది. మీనాక్షి గదినిండా సామానులు చిందర వందరగా పడి వున్నాయి. గదినంతటిని ఒకసారి పరిశీలించి చూసింది సుషమ. మీనాక్షి స్టౌ వెలిగించి టీ పెట్టి సుషమ పక్కన కూర్చుంటూ అంది "పాపం! స్వాతి ఇక ముందు ఏం చేస్తుందో ఎలావుంటుందో?" స్వగతంలో అనుకుంటున్నట్టుగా కొద్ది క్షణాలు గడిచాయి. మిస్ శాస్త్రి వచ్చి స్వాతి నెల రోజుల శెలవుకు దరఖాస్తు పంపిందని చెప్పింది.

"అలా జరగవలసే వుంది" మిస్ శాస్త్రి అంది "ఆవిడ జల్సాలు చూచినప్పుడే అనుకున్నాను ఇలాంటిదేదో జరిగి తీరుతుందని. ఒక పార్ట్‌టైం జాబ్ చేస్తున్న లెక్చరర్ రోజుకో కొత్తచీర కట్టుకోవటం సాధ్యపడే విషయమేనా?" మిస్ శాస్త్రి సుషమవైపు చూచి ఓ క్షణం ఆగి మళ్ళీ అందుకుంది 'సుషమా! నేనిలా ఏదో ఒకటి వాగుతూ వుంటాను. వినాలని వుంటే విను. లేకపోతే దూరంగా వెళ్ళు. నేను మాత్రం ఈ అవినీతి చూస్తూ మౌనంగా ఉండలేను"

సుషమ చిరునవ్వు నవ్వి ఊరుకుంది.

"మన స్టూడెంట్ల సంగతే తీసుకో - ఆడపిల్లలైనా వీరికి ఒక పద్ధతీ పాడూలేదు. సిగ్గూ లజ్జా అసలేలేవు. నిన్నరాత్రి నేను బట్టలు మార్చుకుంటూ అనుకోకుండా పైకి చూద్దును గదా! ఏముంది! ఇద్దరు అమ్మాయిలు కిటికీ కంతల్లోంచి తొంగి తొంగి చూస్తున్నారు."

సుషమ పక్కనే కూర్చుని వున్న మీనాక్షికి నవ్వు ఆగలేదు. మిస్ శాస్త్రి ఏడ్చిపోతుందని ముఖాన్ని అవతలవైపుకి తిప్పుకుని బలవంతంగా నవ్వుని అణిచేసింది.

"ఆ పిల్లల్ని చివాట్లుపెట్టి ఉండవలసింది. వాళ్ళ పేర్లు చెప్పండి. వెంటనే ఫైన్ వేస్తాను" అంది సుషమ.

మీనాక్షి నెమ్మదిగా అంది "వారెవా! వార్డెన్ అధికారాన్ని మాబాగా జమాయిం చేస్తున్నావే. ఆ రాత్రి నువ్వు ఎవరివెంట వచ్చావో గుర్తుందా?"

"నేనా?" సుషమ ఆశ్చర్యంగా అడిగింది "ఎప్పుడు?" హటాత్తుగా ఏదో గుర్తు కొచ్చింది సుషమకు. "ఏయ్ మీనాక్షీ కొట్టేస్తాను జాగ్రత్త" అని నవ్వుతూ చెయ్యి పైకెత్తింది.

"నావి ఎక్స్‌రే కళ్ళు. ఎవడు వాడు? చక్కని చురుకైన కళ్ళున్నవాడు? చూడ చక్కని మొనగాడు ఎవడువాడు?"




ఉడికిస్తూ అంది మీనాక్షి.

"అలాంటిదేం కాదు. సువ్వేం కంగారు పడకు. కేవలం పరిచయస్తుడు. బజారు కెళితే కనిపించాడు. వద్దంటున్నా దిగబెడ తానని వెంటవచ్చాడు అంతే" సుషమ అతి సహజంగా చెప్పేసింది. 'నిజానికి ఇంతకు మించిన బంధం తనకు నీల్‌కు నడుమ ఏముంది?' అనుకుంది తనలోతను.




సెప్టెంబర్ 15. దసరా శలవలు ఇస్తూ కాలేజీ మూసివేసారు. ఒక్కరోజులో మొత్తం హాస్టల్ ఖాళీ అయిపోయింది. తనూ ఇంటికెళ్ళిపోదామనుకుంది సుషమ. కానీ మూడు నాలుగురోజులు ఆగిపోవలసి వచ్చింది. శలవలకు నౌకర్లు కూడా వెళ్ళి పోయారు. సుషమ ఒక్కతే లాన్‌లో కూర్చునివుండగా నస్యం రంగులో వున్న కారొకటి లోపలికి వస్తూ కనిపించింది. బహుశా ఎవరో స్టూడెంట్ల తాలూకు అయి వుంటుందనుకుంది. కారు పార్కింగ్ స్థలంలోకి వెళ్ళి ఆగింది. సుషమ అదేమీ పట్టించుకోలేదు. కాని వెనుక నుంచి చిరపరిచితమైన స్వరం "సుషమగారూ" అని పిలవటంతో హటాత్తుగా తల ఎత్తి చూసింది.

''అరె-మీరా! రండి" ఆనందంగా ఆహ్వానించింది. అనుకోకుండానే ఆమె స్వరంలో ఆహ్లాదం నిండిపోయింది. కళ్ళు ఒక్కసారిగా మెరిసాయి. నీల్ వచ్చి సుషమను కాస్త దూరంలో గడ్డి మీద కూర్చుంటూ అన్నాడు "మీరు ఇంకా ఇక్కడే వున్నారు. ఊరుకెళ్ళ లేదా?"

"రేపు ఉదయం బండికి వెళ్తున్నాను"

"అయితే నేను సరిగ్గా సమయానికి వచ్చావన్నమాట.

ఈ రోజు గనుక రాకుంటే మీరు కలిసే వారేకాదు. నేనూ ఇంటికెళ్ళి నిన్నరాత్రే వచ్చాను" నీల్ వివరించాడు.

"అందరూ కులాసాగా వున్నారా?" సుషమ అడిగింది.

"బావున్నారు" నీల్ నవ్వాడు "అందరూ మీకు పరిచయమున్నంత ఆత్మీయంగా అడిగారు మీరు. కనీసం మా యింట్లో ఎవరెవరున్నారో కూడా మీకు తెలిసి వుండదు"

"ఎవరెవరున్నారు?" సుషమ అడిగింది.

"ఎంతోమంది లేరులెండి. ఒక మంచి అమ్మ, ఓ బొమ్మలాంటి చెల్లి. దాని పేరు నళిని, బి.ఎ. చదువుతోంది. ఈసారి నేను మా కారు తెచ్చుకున్నాను".

అతడు రెపరెపలాడుతున్న సుషమ కనురెప్పల వైపు చూస్తూ మాట్లాడుతు న్నాడు. వదులుగా వేసుకున్న జడలోంచి కొన్ని పాయలు చీలి బయటకు వచ్చే సాయి. ఆమె తన మోకాళ్ళ మీద గెడ్డం ఆన్చి చేతులు కాళ్ళ చుట్టూ బిగించి కూర్చుని వుంది. ఎంత ఆలోచించినా నీల్‌తో ఏం మాట్లాడాలో తోచటంలేదు. నీల్ ఆమె వైపు చెయ్యి చాపాడు. సుషమ ఉలికిపాటుతో అతడివైపు చూచింది.

"మీ బ్లౌజ్ మీద ఏదో పురుగు

పాకుతోంది" అన్నాడు నీల్. తలతిప్పి చూచి పుస్తకాన్ని మూసేసుకుంది. ముందు ముందు ఏం జరగబోతుందో ఇప్పుడామెకు తెలిసిపోతోంది. నీల్ ఎంత దగ్గరగా వచ్చినా ఆశ్చర్యం వేయటం లేదు. ఆమె తన వీపు మీద నీల్ హృదయపు స్పందనలు వింటోంది. నీల్ వేళ్ళ కొసలు అనాచ్ఛాదితమైన ఆమె భుజాలపై సున్నితంగా పాకుతున్నాయి. అలాగే కదలకుండా కూర్చుని కాలేజీ బిల్డింగ్ వైపు చూస్తోంది, ఆ చుట్టు పక్కల ఎవ్వరూ వుండరని ఆమెకు తెలుసు. రాత్రివేళ కాపలావుండే చప్రాసీ కూడా సెలవలకని వెళ్ళాడు. ఆ రాత్రి తెల్లారేవరకు వాళ్ళిద్దరూ అక్కడే అలాగే కూర్చుండిపోయినా ఎవరికీ తెలియదు. 'రాత్రంతా.... ఇక్కడ' ఆమె శరీరం అణువణువూ విచిత్రంగా కంపించింది. నీల్ మౌనంగా ఆమెకు దగ్గరగా కూర్చుని వున్నాడు. ఆమె కేశాల్లోంచి వస్తున్న పరిమళంలో తేలిపోతూ, వేళ్ళ కొసలతో ఆమె భుజాలను స్పృశిస్తున్నాడతను. రోడ్డు మీద ఎవడో గార్దభ స్వరంతో ఏదో పాటపాడుకుంటూ పోతున్నాడు. ఒక బస్సు కాలేజీ స్టాపు దగ్గర ఆగకుండానే వెళ్ళిపోయింది.

"ఏమిటి ఆలోచిస్తున్నారు" నీల్ నెమ్మదిగా అడిగాడు.

"ఏమీలేదు స్తంభాలు చూస్తున్నాను"

"ఎన్ని స్తంభాలున్నాయి?"

"ఏమో? మీరే లెక్కపెట్టుకోండి"

అలా కూర్చునే చూపై అయిదు వరకు లెక్కించాడు నీల్. విసుగుపుట్టి అన్నాడు "ఇంక లెక్కపెట్టలేను చీకటిగా వుంది. మరోసారి లెక్కేస్తాను"

మళ్ళీ వెంటనే మౌనం అలుముకుంది. విశాలమైన కాలేజీ బిల్డింగ్ పంజరంలా కనిపిస్తోంది. దాని స్తంభాలు పంజరపు చువ్వల్లా కనిపించాయి. ప్రతి స్తంభానికి లైటు అమర్చివుంది. చుట్టూ ఎర్రటి గోడలు నిర్మానుష్యంగా భయం గొల్పుతున్నాయి.

"ఈ వాతావరణం నచ్చుతుందా మీకు?" నీల్ అడిగాడు.

"ఊఁ"

మళ్ళీ నిశ్శబ్దం.

నీల్ అన్నాడు "మీరు మరీ మాట్లాడకుండా కూర్చుండిపోతున్నారు."

"ఏం చేయను? ఏం మాట్లాడను? ఆధునిక కవిత్వాన్ని గురించి చెప్పనా? లేక పికాసో గురించి మాట్లాడనా?"

"కాదు. మీ గురించే చెప్పండి. ఏదో ఒకటి. నాకు మీ గురించి బొత్తిగా తెలియదు. మీరు చాలా ఆకర్షణీయంగా వున్నారు. మీరంటే నాకెంతో ఇష్టం... ఇవి తప్ప మరేమీ తెలియవు నాకు"

సుషమ అనాలోచితంగా అనేసింది- "వయసు ముప్పై మూడు సంవత్సరాలు. ఇంటి నిండా దారిద్ర్యం, హిందీ టీచర్ ఉద్యోగం... ఇంకా ఏమైనా వివరాలు కావాలా?" ఆమె స్వరంలోని తీక్షణత కఠినంగా గుచ్చుకుంది నీల్ హృదయమ్మీద.

సుషమ కళ్ళనిండా నీళ్ళుబికివచ్చాయి. రెండు పెద్ద బొట్లు నేలకు రాలుతుండగా సుషమ తల వంచేసుకుంది. నీల్ ఆమెకు దూరంగా జరుగుతూ అన్నాడు "ఏడుస్తున్నారా? ఎందుకు?"

ఆతడివైపు తలతిప్పి చూస్తూ అంది సుషమ "ప్లీజ్ లీవ్ మి ఎలోన్"

నీల్ మంద్రస్వరంతో అన్నాడు





"సరే! ఇంక వెళ్ళిపోతాను. ఇంకెప్పుడూ మిమ్మల్ని ఇబ్బంది పెట్టను"

సుషమ అతడి వైపు నుంచి తల మరల్చుకుంది. నీల్ కార్ స్టార్ట్ చేసిన శబ్దం వినిపించింది. మళ్ళీ దగ్గర ఆగిన చప్పుడు, బహుశా నీల్ గేటు తెరవడానికి ఆపినట్టున్నాడు. గేట్ మూసుకుంది. నీల్ వెళ్ళిపోయాడు.

సుషమను ఒక అపరిచితమైన ఉదాసీనత, నైరాశ్యం ఆవరించుకున్నాయి. చెల్లా చెదురై వున్న జుత్తుని బిగించి కొప్పు ముడి వేసుకుంది. ఒక ఖాళీ సూట్ కేస్ తెరచి బట్టలు సర్దుకోసాగింది. ఏ పనీ చెయ్యాలనిపించటం లేదు. ఊరికే పడుకుండిపోతే బావుంటుందనిపించింది. ఇంటికెళ్ళామనే ఉత్సాహం పోయిందో తెలిసిరాలేదు. లోపల వంటిల్లు సర్దుతున్న చప్పుడు వినిపిస్తోంది. దాని హడావుడి చూచి మరింత విసుగు ఆవరించుకుంది. సూట్ కేసునిండా బట్టలు కుక్కి గది మధ్యలో అలాగే వదిలేసింది. తెల్లారేవరకు టైం ఎలా గడుస్తుంది. నీల్ వుండివుంటే కాలం ఆనందంగా సహజంగా గడిచిపోయేది. ఆ ఆలోచనని అక్కడే పీక పిసికి చంపివేసింది సుషమ. నీల్ ఎవరు? తనకేమౌతాడు? అతనితో తనకేమిటి సంబంధం? కాని ఆమె అనాచ్ఛాదితమైన భుజాల మీద ఏదో స్పర్శ. ఆ స్పర్శ శరీరం నిండా వ్యాపించింది. సుషమ మంచమ్మీద బోర్లా పడుకుండిపోయింది. మెత్తటి దిండులో ముఖాన్ని పాతేసి పైపంటితో పెదిమని గట్టిగా నొక్కిపట్టుకుని నిశ్చలంగా వుండిపోయింది.

* * *

సుషమ ఇద్దరు తమ్ముళ్ళు ఆమెని రిసీవ్ చేసుకోవటానికి స్టేషన్ కొచ్చారు. సామానులు దించుకుని నడుస్తుండగా సంజయ్ అడిగాడు "అక్కా నాకోసం స్వెటర్ తెచ్చావా?"

"తెచ్చానురా పిచ్చి సన్నాసీ. కంగారు పడతావెందుకు" సుషమ వాడి క్రాపు చెరిపేస్తూ అంది.

ఇంటికి చేరుకున్నాక — అందరూ సుషమ సూట్ కేస్ ఎప్పుడు తెరచుకుంటుందా అని పరీక్షిస్తూ అసహనంగా అక్కడక్కడే తిరుగాడుతున్నారు.

"దాన్ని కాస్త విశ్రాంతి తీసుకోనివ్వరా లేదా?" తల్లి పిల్లల్ని చీవాట్లు పెట్టింది.

సుషమ నవ్వుకుంటూ సూట్ కేస్ తెరిచింది. అన్నిటికన్నా ముందు సంజయ్ స్వెటర్, వినయ్‌షర్టు, నిరుపమ చీర, ప్రతిమ పంజాబీ డ్రస్, దుపట్టాలు, బైటకు తీసింది. ఆఖరున తండ్రికి ఖరీదైన కంబళి, తల్లి కోసం చీరల జత.

చీరల్ని తిప్పి చూసుకుంటూ "నా కోసం ఇవెందుకు తెచ్చావు? నేనెక్కడికి పోతాను గనుక? మీరందరూ సుఖంగా వుంటే నాకంతే చాలు" అంది తల్లి ఆనంద పడిపోతూనే. చీరల్ని పక్కన వుంచుతూ అంది "ప్లీడర్‌గారి మనవడి నామకరణం రోజు కట్టుకుంటాలే ఇది"

"అహాఁ. నారాయణకు కొడుకు పుట్టాడా!" సుషమ సూట్ కేస్ తాళం వేస్తూ అడిగింది.

"అవును" అందేగానీ తల్లి స్వరంలో ఉత్సాహం లేదు. ఒక పెద్ద నిట్టూర్పు విడుస్తూ లోపలికి వెళ్ళిపోయింది.

వెళుతూ వెళుతూ "స్నానంచేసి బట్టలు

మార్చుకో. నేనీలోగా భోజనం ఏర్పాట్లు చూస్తాను" అని చెప్పి వెళ్ళింది. భోజనాలయ్యాక తండ్రి దగ్గరకు వచ్చింది. అప్పటికే తను తెచ్చిన కొత్త కంబళి కప్పుకుని కూర్చుని వున్నారాయన. హుక్కా నింపి ఆయనచేతికిచ్చి పక్కనే కూర్చుంది సుషమ.

"ఎంతకు కొన్నావమ్మా ఇది?"

"అరవైఆరు రూపాయలు"

"అంత డబ్బు ఎందుకు ఖర్చు పెడతావు తల్లీ. ఇంత ఖరీదైన కంబళి నాకెందుకు? ఆరునెల్ల క్రితమే నా రజాయికి కొత్త దూది వేసి కుట్టించాం" మళ్ళీ ఒక్క నిముషం ఆగి అన్నాడు "నేను నీ కోసం ఏదీ చేయలేకపోయాను" ఆయన గొంతు ఆర్ద్రమైంది.

కంబళిని ఆయన కాళ్ళ మీద నిండుగా



కప్పుతూ సుషమ అంది "ఇదంతా చేసింది మీరేగా - పెంచి పెద్దచేసారు. చదివించారు"

సుషమ గొంతుకూడా తడిగా మారిపోయింది. తన చీరమీద ముద్రించిన చిన్నచిన్న ఏనుగుల గుంపును చూస్తూ కూర్చుండిపోయింది. కానీ ఆ క్షణంలో ఆమె మనసులో తన తండ్రి ఆక్షేపణలు కూడా మేల్కొన్నాయి. కృష్ణమ్మ పిన్ని మాటలు నిజమే అనిపించాయి. ఆయన తల్చుకుంటే తన పెళ్ళి చేసి వుండేవాడు కాదా? సహజంగా ఎవరైనా ఏదో ఒక ప్రయత్నం చేసి, కిందమీద పడి అయినా సరే ఆడపిల్లల పెళ్ళిళ్లు జరిపించేస్తారు. అలాంటిది తన తండ్రికి ఎందుకుండాలి ఈ మినహాయింపు? అసలు సంగతి ఆయన సుషమకు పెళ్ళి చేద్దామనే ఆలోచించలేదసలు. తనకు ఉద్యోగం వస్తుందనీ, తన సంపాదన కుటుంబ పోషణకు పనికివస్తుందని ఆయనకు తెలుసు. చదువులో ఫస్ట్ వచ్చేది. క్రమశిక్షణలో వుండేది. తను ఎం. ఎ. ఫైనల్లో వున్నప్పుడు ఒక సంబంధం ఖాయమైంది. పెళ్లి అయిపోయేదే! మామయ్యే మధ్యలో అడ్డు పడ్డాడు. తండ్రి కూడా అంత గట్టిగా పట్టించుకోలేదు. తల్లి బాధ పడిపోతుంటేను ఆయన అన్నాడు "నిర్మలను చూడు. ఉద్యోగం చేసుకుంటూ దర్జాగా ఉంది. మన సుషమ కూడా అలాగే వుంటుంది. ఎలాంటి ఇబ్బందులూ ఉండవు'' అని. ఆయన రిటైరవటాని కింకా మూడేళ్లు వుంది అప్పటికి. పిల్లలందరూ పసికందులే. అలాంటి సమయంలో సుషమ పెళ్ళి చేసేస్తే తమ ఆర్థిక పరిస్థితి ఛిన్నాభిన్నం అయిపోతుంది. ఇల్లు అల్లకల్లోలంగా మారిపోతుంది.

ఈ రకమైన ఆలోచనలతో సుషమ గొంతుక, గుండె చేదుగా మారిపోయాయి. తనకు పెళ్ళి జరగదని ఊహించలేదు. కానీ అప్పుడు ఎందుకో మనసుని దృఢపర్చుకుంది. ఉద్యోగం కోసం నానా అగచాట్లు పడింది. ఉద్యోగం దొరికాక పెద్ద తుఫాను నుంచి బయటపడి తన జీవితనౌక ఒక ప్రశాంత తీరానికి చేరుకున్నట్టు భావించింది.

సుషమ కళ్ళు విశాలం చేసుకుని తండ్రి వైపు చూచింది. వయోభారంతో, అస్వస్థతతో ఎండిపోయి ముడతలు పడి ఉన్న ఆయన ముఖాన్ని చూసి చలించిపోయింది. ఛ - తను అలా ఆలోచించటం అన్యాయం. ఆయన తన కూతురు అవివాహితగానే మిగిలిపోవాలని ఎందుకు కోరుకుంటాడు. కాకపోతే పరిస్థితులకు తల వంచేసి ఆయన అలా చేసివుంటాడు. అందుకుగాను అంతరాంతరాల్లో ఎంతటి సంఘర్షణ, బాధ అనుభవించాడో? అనుభవిస్తున్నాడు పాపం! తను ఆయనను అర్థం చేసుకోవటంలో పొరపాటు పడింది.

తెరచివున్న తలుపుల్లోంచి వీచిన చల్లటి గాలి విసురుకు సుషమ శరీరం రోమాంచితమైంది. ఎవరివో వేళ్ళు తన భుజాల మీద సున్నితంగా పాకుతున్న అనుభూతికి లోనైంది.

సుషమకు బయటకు వెళ్ళాలని లేదు. కానీ తల్లి పట్టుపట్టటంతో తప్పనిసరై తయారైంది. నీరూ పెద్దదైనప్పటి నుంచీ చక్కగా అలంకరింపజేసి వెంటపెట్టుకెళ్తోంది తల్లి. అలా నలుగురి కళ్ళలోనూ పడితే అందరూ నీరూ అందచందాలకు ముగ్ధులై 'ఆహా చూశారా! శర్మగారి చిన్నమ్మాయి ఎంత అందంగా వుందో' అను

కుంటారని ఆమె ఆశ.

అందరూ ప్లీడర్ నారాయణ ఇంటికి బయలుదేరారు. సుషమ వాళ్ళపిల్లాడికోసం చిన్న వెండి గిలక కొంది. ఇద్దరు ఆడ పిల్లల తరువాత మగపిల్లాడు కలగటంతో వకీలుగారింట్లో హడావుడి జాస్తిగానే కనిపించింది. నారాయణ గుమ్మంలోనే ఎదురయ్యాడు.

"నువ్వా? ఎప్పుడొచ్చావు?" అడిగాడు నారాయణ సుషమను చూడగానే.

"చాలా రోజులైంది" సుషమ జవాబిచ్చింది.

"ఇవ్వాళ రావటానికి తీరిందన్నమాట" నారాయణ నిష్ఠూరంగా అన్నాడు.

"ఇవ్వాళ కూడా వచ్చేదాన్ని కాదు. నిరుపమ బలవంతపెడితేనూ..."

"నువ్వెందుకు వస్తావు? పెద్ద ధనవంతురాలివీ, హోదా వున్నదానివీ అయిపోయావు కదా?"

నారాయణ ఉడికిస్తూ అన్నాడు. అతడి చూపులు సుషమ చూపులతో కలుసుకుని నిశ్చలంగా వుండిపోయాయి. నారాయణ నవ్వుతుంటే తొంటి పన్ను బయటకు కనిపిస్తుంది. చీరకొంగుని భుజాల చుట్టూ కప్పుకుంటూ అంది సుషమ – "నువ్వు మాత్రం తక్కువా? చాలా గొప్పవాడివై పోయావు? సరేగానీ, నువ్వెందుకు రాలేదు?"

నారాయణ చిరునవ్వు నవ్వి మౌనంగా వుండిపోయాడు.

సుషమ లోపలకువెళ్ళిపోయింది. లోపల హాల్లో ఆడవాళ్ళందరూ గుంపుగా కూర్చుని వున్నారు. పిల్లలు కేరింతలు కొడుతూ ఆడుకుంటున్నారు. తల్లి ఆడవాళ్ళ గుంపులో కలిసి కూర్చుని వుంది. సుషమ ఒక మూలన నిలబడి అందరి వైపుకు దృష్టి సారించింది. నారాయణ చెల్లెలు ప్రభ గుంపులోంచి లేచి ఇవతలకు వచ్చి సుషమను పలకరించింది.

నారాయణ భార్య స్నేహపూర్వకంగా ఆమెను ఆహ్వానించింది. సుషమ పిల్లాగున్న మంచంమీద బహుమతి పాకెట్టునువుంచి పక్కనే కూర్చుంది.

ప్రభ పిల్లాడ్ని ఎత్తి సుషమ ఒడిలో పడుకోబెట్టింది. సుషమ వాడి మెత్తటి బుగ్గలు పుణుకుతూ "వీడి పేరు ఏమిటి?" అడిగింది.

"తాతగారు అమిత్ అని పెడదామనుకున్నారు. కానీ మా అమ్మ 'ఆనంద్' అని పెట్టేసింది" ప్రభ చెప్పింది. పసుపు పచ్చటి పట్టు చొక్కాలో పిల్లాడు ముద్దుగా కనిపించాడు. సుషమ ముగ్ధురాలైపోతూ వాడివైపే చూస్తూ నెమ్మదిగా బుగ్గలను తాకేసరికి వాడు ఏడ్పు లంకించుకున్నాడు. వాడ్ని తల్లికి అప్పజెప్పేసి వెనుతిరిగి చూచింది. అప్పుడే గదిలోకి వస్తూ నారాయణ కనిపించాడు.

పిల్లాడ్ని ఆడిస్తూ నారాయణ భార్య "ఏడవకురా బాబూ! నీ ఆంటి నువ్వొట్టి ఏడ్పుగొట్టు వెధవ్వి అనుకుంటుంది సుమా" అంది.

సుషమ కృత్రిమమైన ఓ నవ్వుని అతికించుకుని ఆలోచిస్తూ నిలబడింది. తన చిన్న సంసారంలో నారాయణ ఎంత ఆనందంగా వున్నాడు. ఈ క్షణంలో అతడికి తను ఒకప్పుడు సుషమ కావాలని కోరుకున్న సంగతి గుర్తుకు రావటం లేదా?

సుషమ చాటుగా నారాయణ వైపు దృష్టి పోనిచ్చింది.

నారాయణ కూడా సుషమనే చూస్తు

న్నాడు. ఆ చూపులో ఏ భావమూ లేదు. సందేశం కాని, సందేహం కాని లేకుండా మామూలుగానే వుంది. పైగా స్వచ్ఛంగా ఏదో తృప్తితో నిండిపోయి నిర్విచారంగా వున్నట్టు కనిపించింది.

ఆ కళ్ళల్లో తనని పొంపలేకపోయా నన్న చింత ఏ కోశానా కనుపించక పోవటంతో సుషమ అహం దెబ్బతిని లోలోపల నిరాశతో కుంచించుకు పోయింది.

నారాయణ పెద్ద కూతురిని దగ్గరకు తీసుకుంటూ అడిగింది– "నీ పేరు రశ్మి కదూ? ఏం చదువుతున్నావు?"

నారాయణ భార్య ముఖం కూడా పసుపు పచ్చగా మెరిసిపోతోంది. కళ్ళల్లో ఆనందం నిశ్చింతతో తొణికిసలాడు తోంది. చుట్టాలు, ఇరుగు పొరుగు వారం దరూ వచ్చి శుభాకాంక్షల, ఆశీస్సుల వర్షం కురిపించిపోతున్నారు. సుషమ ఒక అపరిచిత వ్యక్తిలా దూరంగా నిలబడి అంతా గమనిస్తోంది. ఆమె మనసులో ఏనాటిదో ఒక గాయం మళ్ళీ చిగిర్చింది. చిన్నప్పుడు తను ఒక అందమైన కలల గూడు కట్టింది. నారాయణ దానికి కేంద్ర బిందువు.

ఇంతలో ఓ పంథొమ్మి దేళ్ళ అమ్మాయి సుషమకు ఎదురుగా నిలబ డింది. ఆ పిల్ల ముఖం నిముషానికి పది సార్లు ఎర్రబారుతోంది. సిగ్గు బరువుతో కనురెప్పలు పైకి లేవనంటున్నాయి.

హఠాత్తుగా సుషమకు తొమ్మిదేళ్ళ క్రితం నాటి తన పంతొమ్మిదేళ్ళ ప్రాయం గుర్తుకొచ్చింది. ఆనాటి తన రూపం కళ్ళముందు స్పష్టంగా కనిపించ సాగింది. ఆరోజుల్లో తనూ సరిగ్గా ఇలాగే సిగ్గుపడుతూమూలమూలల్లో ఒదిగిపోతూ నిలబడేది. పదిమంది ఎదుట నిలబడిన ప్పుడు సిగ్గు భారాన్ని మోయలేక పమిట కొంగుని వేలికి చుట్టుకుంటూ నానా హైరానా పడిపోయేది. ఆరోజుల్లో ఎర్రటి అంచులున్న తెల్లటి చీరలు కట్టుకునేది. మధుర స్వప్నాల మధ్య ఉక్కిరిబిక్కిరి అవుతుండేది. కాలేజీలో కాలాన్నంతటినీ క్లాస్‌రూం కిటికీలోంచి బయటికి చూస్తూ గడిపేసేది. అప్పుడప్పుడు ఒక పిచ్చు కల జంట వచ్చి కిటికీ మీద వాలి ముద్దు లాడుకునేవి. వాటిని చూస్తే తన రక్త ప్రసారపు వేగం విపరీతంగా పెరిగేది. హృదయ స్పందనల తీవ్రత ఊపిరాడ నిచ్చేది కాదు.

అప్పట్లో పెద్ద ప్లీడర్‌గారికి ప్రతి ష్ఠతో పాటు డబ్బూ బాగానే వుండేది. ఆయన నారాయణ పెళ్ళి ఘనంగా జర పాలని అనుకుంటుండేవాడు. ఆయన భార్య సుషమని కోడలిగా తెచ్చుకుందా మని పట్టుపట్టింది. కానీ ప్లీడర్‌గారు నారాయణకు మరో సంబంధం ఖాయ పర్చేశాడు. నారాయణకు కూడా ఆ అమ్మాయి నచ్చింది. ఆ అమ్మాయి ఓ సివిల్ సర్జన్‌గారి కూతురు. డబ్బు, దస్కం, సామానులు భారీ ఎత్తున పట్టు కొచ్చింది. సుషమ తల్లి పెళ్ళికూతుర్ని చూచి ఇంటికొచ్చి అంది. "నల్లగా దెయ్యంలావుందది. నాసుషమకు ఇంతకు మించిన సంబంధం వస్తుంది చూస్తుం డండి"

ఈ సంఘటనతో సుషమ మనసుకు శాంతి కరువయింది. దాదాపు ప్రతీ రాత్రి పమిట కొంగు నోట్లో కుక్కుకుని ఏడుస్తూ పడుకునేది. ఈ ప్రపంచంలో తనంతగా ఏడ్చేవారు ఎవరైనా వుంటారా? తనంతటి దుఃఖితులు మరెవరేనా

వుంటారా అనుకునేది. కన్నీటి కెరటాలకు ఎంతటి పదునుంటుందో ఆ రోజుల్లో స్పష్టంగా చూచింది సుషమ. ఆ పదును తన స్వప్నాలని, ఆశల్ని ముక్కలు ముక్కలుగా నరికి పోగులు పెట్టింది.

నారాయణ ఇంటినించి తిరిగొచ్చాక బట్టలు మార్చుకోకుండా అలాగే మంచ మీద వాలిపోయింది సుషమ. కాస్సేపటికి ప్రతిమ వచ్చి భుజాలు పట్టి కుదుపుతూ "అక్కా! అమ్మ భోజనానికి రమ్మంటోంది" అంది.

"నాకు ఆకలి వేయటం లేదని చెప్పు" సుషమ అంది. ప్రతిమ వెళ్ళి తల్లితో ఆ మాట చెప్పింది. తల్లి స్వయంగా వచ్చి అంది "కొంచెం తిను సుషమా. అక్కడ కూడా ఏదీ తిన్నావు కావు".

సుషమ వెంటనే లేచి కూర్చుంది. తన చేష్టలకు తనే సిగ్గుపడిపోయి "వస్తున్నాను పద" అంది సుషమ. తల్లి అమాయకురాలేం కాదు. ఆమెకూ ఆనాటి సంఘటనలు గుర్తుకొచ్చే వుంటాయి. ఈ ఆలోచన రాగానే సుషమకు మరీ సిగ్గుగా అనిపించింది.

"తల్లి వేడి వేడి రొట్టెలు పళ్ళెంలో పెడుతూ అంది "కలిసొచ్చే కాలంవుంటే కాకితో కబురంపినా అదృష్టదేవత పరుగెత్తుకు వస్తుందన్నట్టు గొప్ప జాతకాన్ని వెంటపెట్టుకొచ్చింది ప్లీడర్‌గారి కోడలు. అన్నిహంగులూ ఇదివరకే వున్నాయి. ఇప్పుడు కొడుకు కూడా పుట్టాడు."

తల్లి మాటల్లో భేదం. సుషమ మౌనాన్ని పట్టించుకోలేదామె. "ప్లీడర్ గారి భార్య చాలా అనుకుంది. కానీ, ఆ ప్లీడర్ పడనిచ్చాడు కాదు. అయినా ఎవరికి ఎక్కడ కావాలని రాసిపెట్టి వుంటే అక్కడే అవుతుంది. ఏదో అనుకోటమే తప్ప మన చేతిలో ఏదీ వుండదు."

తల్లి మాటలు చివరికి కర్మ సిద్ధాంతంలోకే వచ్చితేలాయి. ఆమె మాటలు తనకు అంతగా రుచించవు. సుషమకు తల్లి మనసేమిటో పూరిగా అర్థంకాదు. ఇలాంటి పేరంటాల్లో పాల్గొన్నప్పుడల్లా ఆమె అసంతృప్తికి లోనవుతూనే వుంటుంది.

సుషమ మౌనంగా రొట్టెలు తింటూ కూర్చుంది.




మీనాక్షి ఉత్తరం చదువుకుని సుషమ హృదయం ఉద్విగ్నంగా మారిపోయింది. ఆ ఉత్తరాన్ని చేతిలో పట్టుకుని అలాగే కూర్చుండిపోయింది చాలాసేపు. ఆమె ఏకాగ్రతని గమనించి ప్రతిమ అడిగింది– "అక్కా! ఉత్తరం వచ్చిందా? ఎవరి దగ్గర నుండి?"

"మీనాక్షి అని నాస్నేహితురాలు ఒకావిడవుంది. ఆమె పెళ్ళి కలకత్తాలోని ఓ వ్యాపారస్తునితో నిశ్చయమైందట".

ప్రతిమ కళ్ళు విశాలమయ్యాయి "అయితే ఆయన పెద్ద ధనవంతుడై వుంటాడు"

"కావచ్చు" అంటూ ఉత్తరాన్ని దిండుకింద పెట్టేసింది సుషమ. మీనాక్షి

ఎప్పుడూ పెద్ద ఉత్తరాలు రాయదు. కానీ ఈసారి పేజీలకు పేజీలు రాసేసి తన మనసంతా విప్పి చెప్పింది "దినేష్‌తో నా సంసార జీవితం లక్షణంగా సాగుతుంది. నేను అన్నిరకాలుగా ఆలోచించి చూసాను. ఆయన్ను పెళ్ళి చేసుకుని నేను ఒక కొత్త ప్రపంచంలోకి ప్రవేశిసాను. ఆయన సదా కాక్‌టెయిల్ పార్టీలు, డిన్నర్లు, డాన్సుల కబుర్లే చెబుతుంటారు. ఏ కారు బావుంటుంది, ఏ ఇంజను...నేను ఆయన ముందు జీన్‌పాల్ సార్త్రె గురించి మాట్లాడితే చకితులౌతారు. కానీ సుషమా! ఒక నిజం చెప్పనా? నేను ఈ జీవితంతో విసిగిపోయాను. చెప్పిన పాఠాలే చెప్పుకుంటూ, పాడిందే పాటరా అన్నట్లు ఈ ట్యుటోరియల్ కాలేజీ నాలుగు గోడల మధ్యన ఖైదీల కన్నా హీనంగా సంకుచితంగా బ్రతుకుతున్నాం మనం. చీటి మాటికి తగువులు, వెకిలిమాటలు, చాడీలు, పరనిందలు ఇలాంటివి నాకు నచ్చవు. ఇలా బ్రతకటం నా ధ్యేయం కాదు. ఒక



కొత్త ప్రపంచపు తలుపులు నా ఎదుటగా తెరుచుకుని వున్నప్పుడు ప్రవేశించకుండా ఎందుకుండాలి నేను?"

సుషమ ఆలోచించింది; నాలుగు వైపులా తలుపులు మూసివేయబడి, బ్రతుకంతా అంధకారబంధురంగా వున్న తన లాంటివాళ్ళ సంగతి ఏం కావాలి? అలా ఆ చీకటి చెరసాలలో మగ్గిపోవలసిందే!

తన సహజ సిద్ధమైన మాటలతో, ఎలాంటి కృత్రిమత్వం లేని నిష్కల్మష మైన మనసుతో మీనాక్షి ఏనాడో సన్నిహితురాలైపోయింది సుషమకు. మీనాక్షికి కూడా సుషమ అంటే గొప్ప ఇష్టం. ప్రతి తగువులోనూ సుషమను వెనకేసుకొచ్చి సుషమకు బదులు తానే పోట్లాడేది. అలాంటి మీనాక్షి ఇప్పుడు వెళ్ళిపోతోంది. ఓ పక్క దిగులుగా వున్నా మీనాక్షి తన జీవితాన్ని సుఖమయం చేసుకోవటానికే వెళ్తోంది కాబట్టి సుషమ ఆనందించింది. స్నేహితురాలి మేలు కోరుకుంటూ సంతోషంగా సాగనంపటమే తన కర్తవ్యం.

సంజయ్ గదిలోకి వచ్చి అన్నాడు "అక్కా! నువ్వెప్పుడు చూచినా ఒంటరిగా కూర్చుని ఏదో ఆలోచిస్తుంటావెమిటే? నా స్వెటర్ అల్లి పెట్టరాదూ; సగంలో అలాగే మిగిలిపోయివుంది!".

సుషమ ప్రయత్నపూర్వకంగా నవ్వి అంది - "అంత కంగారెందుకురా నీకు. ఊరెళ్ళాక అల్లి పంపిస్తానులే"

"ఊరికే కూర్చుని ఆకాశంలోని మబ్బు ముక్కలకేసి చూస్తుంటావు. ఏం జరుగుతోందని అక్కడ?"

సుషమ చిరునవ్వు నవ్వేసింది.

మరికాసేపట్లో ప్రతిమ వచ్చి పక్కనే కూర్చుంటూ అడిగింది-

"అక్కా నేను నిజంగా డాక్టర్‌నవుతానా?"

ఆ పిల్ల ముఖం కాంతివంతంగా మారిపోయింది. కళ్ళల్లో ఆశల మెరుపులు, ఆకాంక్షల ప్రతిబింబాలు స్పష్టంగా కనిపించాయి.

"ఓ! దర్జాగా అవుతావు"

"చాలా సంవత్సరాలు పడుతుందట. చాలా డబ్బు ఖర్చు అవుతుందట కదా మరి!"

"ఖర్చు గురించిన చింత నీకెందుకు?" తల తిప్పి ప్రతిమవైపు చూచింది సుషమ.

"అమ్మ ఎప్పుడు చూచినా డబ్బు గురించే గొడవ పెట్టేస్తుంటుంది. నీరూ పెళ్ళి, మా చదువులు అన్నీ ఎలా అవుతాయి. అయినా నువ్వు డాక్టరివై ఎవరిని ఉద్ధరించాలి గనుక. నీరూ పెళ్ళి, తరువాత నీ..." ప్రతిమ ఆగిపోయింది. సుషమ ప్రతిమ వైపే చూస్తోంది. తన చిన్న చెల్లి ఎంత పెద్దదైపోయింది. ఆరిందాలా అన్నీ మాట్లాడేస్తోంది. పెళ్ళి మాట దగ్గర సిగ్గుపడాలని కూడా దానికి తెలిసిపోయిందే - సుషమ అనుకుంది. ప్రతిమ ముఖమ్మీద పసితనపు ఛాయలు పోలేదు. కానీ మానసికంగా ప్రౌఢత్వానికి వచ్చేసింది.

ఇవ్వాల్టి సమాజం, ఈ వేగం చిన్న పిల్లలకు కూడా అన్నీ నేర్పేస్తాయి అనుకుంది సుషమ.

సంజయ్ ఎగిరి గంతులేస్తూ అన్నాడు "నారాయణ తమ్ముడు అరవింద్ లేడూ అతనికి, ప్రతిమకు పెళ్ళి చేసేస్తుందట, అమ్మ చెప్పింది"

"పోరా వెధవా! నీకెందుకు మధ్యలో" పెద్ద మనిషిలా తమ్ముడ్ని కసిరింది

ప్రతిమ.

"అక్కా...అక్కా... మొన్న తన ప్రాక్టికల్స్ పరీక్ష పోతే ఏడుస్తూ కూర్చుంది. అరవింద్ వచ్చి సర్ది చెప్పాక పూరుకుంది"

గతంలో తన తాలూకు స్వప్నం ఒకటి ఇలాగే జన్మించి వెంటనే మర ణించింది. మళ్ళీ ఇప్పుడు అలాంటి సన్నివేశంలోనే ప్రతిమ వుంది. చరిత్ర పునరావృతమవుతోంది – సుషమ పెది మను గట్టిగా కొరుక్కుంటూ అనుకుంది. మరుక్షణమే తనని తాను సంభాళించు కుంటూ ప్రేమ తొణికిసలాడుతున్న స్వరంతో అంది సుషమ "నువ్వు అమ్మ మాటలు పట్టించుకోకు. ఇంకా సంవత్సరం టైం వుంది. తరువాత నువ్వు ఎక్కడ ఏది చదువుతానంటే అది చదివించే బాధ్యత నాది. దిగులుపడకు"

"అక్కా! మరి నా స్వెటర్" సంజయ్ గుర్తుచేశాడు.

"అది కూడా అయిపోతుంది"

ఆ తరువాత సుషమ ఏదో పనులు కల్పించుకుని బిజీగావుండే ప్రయత్నంలో లీనమైంది. సంజయ్ స్వెటర్ అల్లింది. నిరుపమ కోసం కుషన్ కవర్ల డిజైన్లు వేసి పెట్టింది. అప్పుడప్పుడు వంట పనులు చేసింది. ఈ హడావుడి చూచి తల్లి మురిసి పోయింది. రకరకాల వంటకాలుచేసి సుషమను బతిమాలి మరీ తినిపించింది. భోజనాలయ్యాక సుషమ తండ్రి పక్కన కూర్చుని ఆయనకు తాంబూలం, హుక్కా ఏర్పాట్లు చేసి కాలేజీ సంగతులు పూస గుచ్చినట్టు చెప్పుకొచ్చింది. తను అలా పక్కన కూర్చుని కబుర్లు చెబుతున్న ప్పుడు అలసి, ముడతలు పడివున్న తండ్రి ముఖం ఆనందంతో వెలిగిపోయేది. తన బాధ్యతలు,బరువులు మోయటానికి తోడు మరొకరు కూడా వున్నారన్న తృప్తి ఆయన కళ్ళల్లో కనిపించేది.

ఇన్ని చేస్తున్నప్పటికీ సుషమ మనసులో ఏదో వెలితి కలుక్కున గుచ్చు కుంటూనే వుండేది. శలవు దినాలు రెక్కలు కట్టుకుని ఎగిరిపోతున్నాయి. సుషమ తిరుగు ప్రయాణమైన రోజు ఇంటిల్లిపాది దిక్కు మొహాలు వేసుకుని చూస్తుండిపోయారు. చెల్లెళ్ళు, తమ్ముళ్ళు ఏకంగా ఏడ్చేశారు.

రైలు జమునా నది బ్యారేజ్ మీద నుంచి పరుగెత్తుతున్నప్పుడు సుషమ దూరమౌతున్న తన జన్మస్థలాన్ని రెప్ప వాల్చకుండా చూస్తూ కూర్చుంది. రైలు ఢిల్లీ స్టేషన్‌లో ఆగింది. తను తన స్వంత ఇంటికి వచ్చినట్టు సుషమకు అని పించింది.

సామాను కూలీకప్పగించి తల ఎత్తి చూసిన సుషమకు కాస్త దూరంలో ఓ స్తంభానికిఆనుకుని నిలబడివున్న నీల్ కని పించాడు. సుషమ నిశ్చేష్టురాలై అలాగే నిలబడిపోయింది. నీల్ నెమ్మదిగా అడు గులు వేసుకుంటూ సుషమ దగ్గరకు వచ్చాడు "నమస్తే! గుర్తు పట్టారా నన్ను?"

సుషమకు పగలల్లా ప్రయాణంచేసి వాడి పోయివున్న తన ముఖం, నలిగిపోయి వున్న బట్టలు, చెదిరిపోయివున్న జుత్తు గుర్తుకొస్తున్నాయి. నీల్ తెల్లటి షర్టు, తెల్లటి ప్యాంటు వేసుకుని స్వచ్ఛంగా కడిగిన ముత్యంలా వున్నాడు.

"ఎవరినన్నా రిసీవ్ చేసుకోవటానికి వచ్చారా?" సుషమ అడిగింది.

"ఊఁ" సుషమ కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు నీల్. సూటిగా చూసే

నీల్ అలవాటుకు ప్రతిసారీలాగే కంగారు పడిపోయింది సుషమ.

"మరి వచ్చారా వాళ్ళు?"

"వచ్చారు" నీల్ అన్నాడు.

అతడి మాటల్లో దురుసుతనం ఏ కోశానాలేదు. అతడి కళ్లు స్పష్టంగా ఏదో సందేశాన్ని సుషమకు అందజేస్తున్నాయి. కాని వాటి మూకాభినయాన్ని పట్టించు కోకుండా సుషమ అంది - "అయితే వస్తాను. నమస్తే"

సుషమ నీల్‌ని అక్కడే వదిలివేసి ముందుకు నడిచింది. కూలీ సామానులు



టాక్సీలో పెట్టాడు. సామానులు పట్టుకుని వెనుదిరిగి చూచింది సుషమ. తనకు రెండడుగుల దూరంలో నిలబడి వున్నాడు నీల్. "నేనూ మీతో వస్తాను"

"మీరు ఎక్కడ నుంచి వచ్చారు అసలు"





"మీ వెనకే వస్తున్నాను. మీరు ఒక్క సారి కూడా తలతిప్పి చూడలేదు. మీరే మనుకున్నా సరే నేను మీ వెంట వచ్చి తీరుతాను"

"అంత దూరంవచ్చి మళ్ళీ వెనుతిరిగి వస్తారా ?"

"అవును. ఇంత రాత్రివేళ మిమ్మల్ని ఒంటరిగా వెళ్ళనివ్వను"

"ఇలా ఒంటరిగా వెళ్ళటం నాకు అలవాటే" సుషమ మంద్ర స్వరంతో నీల్ మొండితనం ముందు వివశరాలవుతూ అంది.

"చెప్పాను కదా మిమ్మల్ని వెళ్ళనివ్వను"

సుషమ పర్సు తెరిచేముందే నీల్ కూలీకి డబ్బు చెల్లించేసాడు. టాక్సీతలుపు తెరుచుకుని మౌనంగా ఒక మూలన కూర్చుండిపోయింది సుషమ.

దరియాగంజ్ రోడ్డువెంట ట్రాఫిక్ లోంచి టాక్సీ వెళ్తున్నంతసేపు నీల్ అద్దం లోంచి బయటకు చూస్తూ కూర్చుండిపోయాడు. చీకటిమయంగా వుండే మదుర రోడ్డు మీద టాక్సీ మలుపు తిరిగిన వెంటనే సుషమకు అతి దగ్గరగా జరిగాడు నీల్. మెడచుట్టూ చేతులు వేసి నిర్భయంగా ఆమె మీదకు ఒంగాడు.

"ఇందుకోసమేనా వచ్చి తీరతానని మొండికెత్తారు?" సుషమ కోపంగా అంది.

"అవును...అవును... నేను చాలా చెడ్డవాణ్ణి, దుర్మార్గుణ్ని, పిచ్చివాణ్ణి ఏదో ఒకటి మీ యిష్టం వచ్చినట్టు అనేసుకోండి. కానీ నన్ను దూరంగా పొమ్మని మాత్రం చెప్పవద్దు".

సుషమ నెమ్మదిగా అంది "టాక్సీ డ్రైవర్ ఏమనుకుంటాడు? అదిగో చూసేస్తున్నాడు".

"హి కెన్ గొ టు హెల్- గంగలో కలుస్తాడు. వాడేదో అనుకుంటాడన్న భయం నాకు లేదు. నా సంగతి మీకు తెలియదు. చాలా మొండివాడ్ని. అంతకు మించి అల్లరివాడ్ని. నేను దేన్ని కోరుకుంటానో దాన్ని అరిచి కేకలు వేసి భాహాటంగా అల్లరి చేసి మరీ పొందితీరతాను"

"నాకు ఇష్టం లేకున్నా సరే..."

"ఆత్మవంచన ఎందుకు చేసుకుంటారు? మీరు నన్ను కోరుకుంటున్నారని, నేనంటే ఇష్టమని నాకు తెలుసు. మరి లేకపోతే నేను చేస్తున్న అల్లరి ఎందుకు భరిస్తారు ? మీరు చాలా కరుణా స్వభావులని కూడా నాకు తెలుసు. నాకు మీ ప్రేమలభించకపోయినా కాస్తకరుణలభిస్తే చాలు. చెప్పండి ఎందుకు నన్ను కసిరి కొడతారు?" అంటూనే సుషమను మరీ దగ్గరగా తీసుకున్నాడు నీల్.

"అబ్బ...వదలండి" సుషమ విడదీసుకునే ప్రయత్నం చేసింది.

"వదలను. నా ప్రశ్నకు సమాధానం చెప్పేవరకు వదలనంటే వదలను"

"నాకు ఇదేం నచ్చలేదు. నా మనసు ఇందుకు అంగీకరించటం లేదు" సుషమ నెమ్మదిగా అనేసి నీల్‌కు దూరంగా జరిగి కూర్చుంది.

టాక్సీ వేగంగా దూసుకెళ్తోంది. రోడ్డు నిండా చీకటి. నీల్ ముఖం కనిపించటం లేదు. అప్పుడప్పుడు వీధి దీపాల వెలుతురు పడినప్పుడల్లా మెరుస్తున్న నీల్ కళ్ళు కనిపిస్తున్నాయి. సుషమ తనలో చెలరేగుతున్న ఆలోచనల సంఘర్షణను అదుపులో పెట్టుకోలేక సతమతమై పోతోంది. రక్తనాళాలు తీవ్రంగా కంపి

స్తున్నాయి. వణుకుతున్న వేళ్ళతో చీర కుచ్చిళ్ళు సరిచేసుకుంది. చల్లగాలి విసురుకు శరీరం విచిత్రంగా గగుర్పొడుస్తోంది.

టాక్సీ కాలేజీ చేరుకునేవరకు ఇద్దరూ అలాగే దూరంగా కూర్చుండిపోయారు. ఆరోజు సుషమ వస్తుందని చౌకీదారుకు తెలుసు. అతడే ఇల్లు శుభ్రంచేసి వుంచాడు. అతడి భార్య వంటచేసి సిద్ధంగా వుంచింది. పనిమనిషి భైరు రెండోరోజు వస్తుంది. చౌకీదార్ సామానులు దింపాడు. ఈలోగా సుషమ లోపలికెళ్లి మూసి వున్న గదుల తలుపులన్నీ తెరిచింది. చౌకీదారు సామానులు ఇంట్లో పెట్టాక టాక్సీ డబ్బులు ఇవ్వబోయింది సుషమ. "సార్ డబ్బులిచ్చేసారు" అన్నాడువాడు. సుషమ కిటికీ తలుపులు తెరవసాగింది.

నాలుగు దిక్కులా నిశ్శబ్దం నిండిపోయివుంది. హాస్టల్ స్టూడెంట్లు ఇంకా రాలేదు. చౌకీదార్ దుప్పట్లు, పరుపు దులిపి బెడ్ రెడీచేసి "ఇక నేను వెళ్ళనా, ఇంకేమైనా పనివుందా?" అడిగాడు.

"లేదు—నువ్వెళ్ళు"

చౌకీదార్ నీల్‌కు నమస్కరించి వెళ్ళిపోయాడు. సుషమ అడిగింది "భోంచేసారా?"

"లేదు. ట్రైన్ తొమ్మిదిన్నరకు వస్తుందని తెలిసినా ఏడున్నరకే స్టేషనుకు వచ్చి కూర్చున్నాను"

"సరే కూర్చోండి. నేను ఐదు నిమిషాల్లో వచ్చేస్తాను. భోంచేసి వెళ్లరుగాని"

సుషమ బీరువాలోంచి బట్టలు తీసుకుని బాత్‌రూమ్ వైపు వెళ్ళిపోయింది. నీల్ సోఫాలో కూర్చున్నాడు. ఒంటికి సబ్బు రాసుకుంటూ సుషమ మరో రకమైన సంఘర్షణకు లోనైంది.

నీల్‌ని పూర్తిగా కసిరికొట్టగల సాహసం తనలో లేదు. తనకు ఎందరో మగమిత్రులూ, పరిచయస్తులూ వున్నారు. కానీ నీల్ సంగతి వేరు. తన మాటలతో, చేష్టలతో ప్రియతముడైపోయాడు. అదే సమయంలో నీల్ ప్రేమోధృతాన్ని తట్టుకునే సామర్థ్యం, ధైర్యంకూడా తనలో లేవు.

స్నానం ముగించి అలంకరణ పూర్తి చేసుకుని వచ్చింది సుషమ.

"నేను భోజనం ఏర్పాట్లు చేసివస్తాను" అంది నీల్‌తో. లోపల వరండాలో డైనింగ్ టేబుల్ వేసివుంది. ప్లేట్లు, స్పూనులు శుభ్రంగా కడిగి పెట్టివున్నాయి. సుషమ ప్లేట్లలో భోజనం వడ్డించి నీల్‌ని పిలిచింది. వరండాముందు ఖాళీస్థలంవుంది. అక్కడే సుషమ పడక సిద్ధంచేసి వెళ్ళాడు చౌకీదార్. పౌర్ణమి ఇంకా రెండురోజులుంది. చుట్టూ పాలసముద్రంలాంటి వెన్నెల పర్చుకునివుంది. నీల్ కళ్లు చుట్టూ ఒకసారి పరికించి చూసి, సుషమ దగ్గర ఆగిపోయాయి. ఆమె తెల్లటి చీర, నీలిరంగు ఖద్దరు బ్లౌజ్ వేసుకుని వుంది. మెడలో బారాటి చైను. ముఖం తెల్లగా మెరిసిపోతోంది. తిలకం దిద్దుకోలేదు. అలసిపోయినట్లున్న సుషమ ముఖం అతి కోమలంగా, అనాఘ్రాత పుష్పంలా వుంది.

"తినండి—" సుషమ మౌనంగా కూర్చునివున్న నీల్‌ని హెచ్చరిస్తూ రకరకాలఆహారపదార్థాలతో నిండివున్న ప్లేట్లు అతని ముందుకు నెట్టింది. తనకు మాత్రం ఏదీ తినాలనిపించలేదు. తన గుండె గొంతులో కొట్లాడుతున్నట్టు అనిపించింది సుషమకు.

విశాలంగా పరుచుకుని వున్న వరండా




లోకి చల్లటిగాలి అనాయాసంగా చూసు కొస్తోంది. సుషమ పమిట కొంగు భుజాల చుట్టూ కప్పుకుంది. ఎదురుగా కూర్చున్న నీల్ రూపం క్షణక్షణానికీ ఆమె గుండె వేగాన్ని పెంచుతోంది. భోజనాలయ్యాక చిన్న ప్లేటులో యాపిల్ ముక్కలు, యాలక్కాయలు పెట్టుకొచ్చింది. ఆ క్షణంలో ఇవ్వాళ నాన్నగారికి తాంబూలం దొరికిందో లేదో అనుకుని తండ్రి గుర్తుకు రాగానే సుషమ ఉదాసీనంగా మారి పోయింది. తనవాళ్ళందరికీ దూరంగా వుంటూ తను మరీ అనాథ అయిపోయినట్టు అనిపించసాగింది. పాత ఇల్లు, మాసి పోయిన గోడలు...అయితేనేం, అక్కడే తన ఆత్మీయులందరూ వున్నారు. ఈ ఖరీదైన బంగ్లా బందిఖానాలాకనిపించింది. సహజ సిద్ధమైన స్నేహం లేకపోగా కృత్రిమ సంస్కృతి వైరితలలు వేసి నట్లుంది.

"ఇంక నేను వెళ్ళనా" నీల్ అడిగాడు. నీల్ ప్రశ్నకు ఉలిక్కిపడింది.

నీల్ వెళ్ళిపోతే తను ఒంటరిదై పోతుంది. కాలేజీ బిల్డింగులు రాక్షసుల్లా నోళ్ళు తెరచుకుని తనను ఎప్పుడు మింగుదామా అని ఎదురుచూస్తున్నాయి. రేపు హాస్టల్ గదుల తలుపులన్నీ తెరుచు కుంటాయి. మళ్ళీ నవ్వులు, గాజుల గల గలలతో ఆ ప్రాంగణం అంతా సంగీత భరితంగా మారిపోతుంది. కానీ ఇప్పుడు మాత్రం శ్మశాన నిశ్శబ్దం అలముకుని వుంది.

"వెళ్ళనా?" నీల్ మళ్ళీ అడిగాడు.

"ఎందుకలా మాటి మాటికి అడగటం? వెళ్ళాలని వుంటే వెళ్ళు" అనేసింది సుషమ.

టేబుల్‌మీద స్పూన్‌తో ఖంగు ఖంగున మోగిస్తూ నీల్ అన్నాడు-

"అంత అర్జంటుగా వెళ్ళవలసిన అవసరమూ లేదు"

"ఆఁ" సుషమ గాభరాపడిపోయింది. మళ్ళీ ఏదో ప్రకంపన శరీరాన్ని కుదిపే సింది. రక్తప్రవాహ వేగం మునుపటి లాగే హెచ్చింది. వెన్నెల్లో తడిసి ముద్దవు తున్న మంచం వైపు ఓసారి చూచి మరుక్షణం దృష్టి మరల్చుకుని నీల్‌వైపు చూచింది.

నీల్ ఆమెవైపు స్థిరంగా, సూటిగా చూస్తున్నాడు.

"అయితే..." అతను అడిగాడు.

"అలా ఎలా కుదురుతుంది?" సుషమ మరోవైపుకు తిరిగి అల్మారా తలుపులు మూస్తూ అడిగింది. నీల్ నెమ్మదిగా నడిచి వచ్చాడు. రెండు భుజాలపై చేతులు వేసి గట్టిగా పట్టుకుంటూ అన్నాడు "నిజమా?" ఆ ఒక్క క్షణంలో అనేక వేల చిత్రాలు రంగు రంగులవి సుషమ కళ్ళ ముందు నిలిచి వెంటనే గజిబిజిగా చెరిగిపోయాయి.

తను అలా నిలబడి అప్పటికే ఒక యుగం గడిచిపోయినట్టు అనిపించింది. అంతవరకు చదువుకున్న అనేక గ్రంథాల పేజీలు చప్పున ఒకొటొకటిగా కళ్ళ ముందు కదిలాయి. అక్షరాలకు ప్రాణం వచ్చి స్వరం హెచ్చి ఏదో ఆలాపన మొదలైంది. ఒక మధురమైన అలసట ఆవరించుకుంది. అది జీవితంలో అమూల్యమైన కాలం. ఆ ఒక్క క్షణం చాలు-అది సజీవ స్పందనలకు నిలయం. ఆమె శరీరం పువ్వులా గాలిలో తేలి పోతోంది. వర్తమానానికీ భవిష్యత్తుకీ మధ్య వున్న వారధిమీద ఆమె నిలబడి వుంది. వెంటనే ఆమెలో ఏవో మిశ్రమ

భావాలు, పరస్పర విరుద్ధ ఆలోచనా తరంగాలు ముంచెత్తాయి.

"చెప్పండి" నీల్ సుషమ భుజాలు పట్టి కుదుపుతూ అడిగాడు.

అల్మారా మూసివేసి సుషమ వెపు తిరిగింది. వీపు అల్మారాకు ఆనించి నిలబడింది. ఆమె విశాలమైన కన్రెప్పలు వెడల్పాటి కళ్ళమీద వాలిపోయాయి. ఆపుకోజాలనంత సిగ్గుతో పెదవులు కంపించాయి. అర్ధనిమీలిత నేత్రాలలోంచి అనుభూతుల పక్షులు రివ్వున గగనంలోకి లేచాయి.




"ఇంకా తయారుకానేలేదా" గదిలోకి అడుగుపెడుతూ అడిగాడు నీల్. సుషమ నీల్ ఆత్రుత చూచి చిరునవ్వు నవ్వింది. ఆ నవ్వులో సాధికారమైన ఆత్మీయత తొంగి చూచింది. "ఇదిగో ఇప్పుడే తయారవుతున్నాను. అయినా నీదంతా స్పీడ్ వ్యవహారం నిన్ను పట్టుకోవటం చాలా కష్టం" జారుతున్న పైట సరిచేసుకుంటూ అంది సుషమ.

వదులుగా వున్న జడను బిగించి కడదామని చేతులు పెకెత్తింది సుషమ. నీల్ వచ్చి నడుముచుట్టూ చేతులు బిగించేసాడు.

"ఇప్పుడు ఆలస్యం చేస్తున్నది ఎవరు?" సుషమ చిరుకోపం ప్రదర్శిస్తూ అంది. ఆమె స్వరం ముద్దు ముద్దుగా ధ్వనించింది. ఆమె చేతులు నీల్ భుజాలను చుట్టేసుకున్నాయి. జుత్తు ఊడి వీపునిండుగా పరుచుకుంది.

"అమ్మగారూ! టీ పెట్టమంటారా?" లోపల నుంచి భైరూ అరిచింది.

సుషమ దూరంగా జరుగుతూ "ఇక్కడికి తీసుకురా" అంది. పసుపు పచ్చ కర్టెన్ తొలగించుకుని బెడ్‌రూం లోంచి బయటకు వెళ్తూ నీల్‌తో "ఇప్పుడే వస్తాను" అంది.

బీరువా తెరచి అస్తవ్యస్తంగా పడివున్న చీరల్లోంచి ఒకటి తీసి మంచమ్మీద పడేసి, బాత్‌రూంలోకెళ్ళి ముఖం కడుక్కోసాగింది సుషమ. చల్లటి నీళ్ళు చెంపలకు తాకగానే నరనరాల్లో విద్యుత్ప్రవాహం మొదలైంది. టర్కీటవల్‌తో ముఖం తుడుచుకుంటూ అనుకుంది సుషమ. నీల్‌తో తనకింకా పూర్తి పరిచయం లేదు. అపరిచిత భావనలు, అపరిచిత స్పర్శలతో అతను తనకోసం ఎదురు చూస్తున్నాడు. తన శరీరం శృతి చేసి సిద్ధంగా వున్న వీణలా వుంది. వేళ్ళ చివళ్ళు ఒక్కసారి తాకితే చాలు భువన నాదం ప్రకంపిస్తోంది. రాగాల వాన జలజల కురుస్తోంది.

డ్రెస్సింగ్ టేబుల్ అద్దంలో నీల్ ప్రతిబింబం కనిపిస్తోంది. ఆ ప్రతిబింబం చూస్తూ సుషమ పట్టుబడిపోయిన దొంగలా సిగ్గుపడిపోయింది.

నీల్ టీ కప్పుతో వచ్చి మంచమ్మీద కూర్చున్నాడు. టీ నెమ్మదిగా సిప్ చేస్తూ సుషమవైపుముగ్ధుడైపోతూ చూస్తున్నాడు. సుషమ జుట్టుకు నూనె పట్టించి, రెండు వేళ్ళతో ఒడిసి పట్టుకుని కొప్పు బిగించు




కోసాగింది. క్షణకాలం సున్నితమైన తీగల్లాంటి ఆమె వేళ్లు చక చక పని చేసాయి. కొప్పు తయారైంది. పిన్నులు గుచ్చుతూ సుషమ తననే ఏకాగ్రంగా చూస్తున్న నీల్‌తో అంది–

"అంతగా చూస్తున్నావు, ఏముంది నాలో?"

"నీకు ఇంత అందం ఎక్కడ నుంచి వచ్చిందా–అని"

"అలాగా!"

సుషమ ముఖమ్మీద పౌడర్ అద్దుకుంటూ మళ్ళీ అంది "నువ్వు బయటికి వెళ్ళు. నేను చీర మార్చుకోవాలి"

"నేను నిన్నేమీ కొరుక్కు తినను. ఊరికే నా మానాన నేను మౌనంగా కూర్చుంటాను".

"కుదరదు. నన్నెవరైనా గమనిస్తుంటే నేను ఏ పనీ సరిగ్గా చేయలేను" సుషమ పెదాలకు లిప్‌స్టిక్ రాసుకుంటూ అంది. నీల్ టీ కప్పు కింద పెట్టి వచ్చి సుషమ వెనుక నిలబడ్డాడు. ఆమె భుజమ్మీద

గెడ్డం ఆన్చుతూ నెమ్మదిగా చేతులతో చుట్టేసాడు.

"ఊఁ! నన్ను కదిలించకు. తిలకం దిద్దుకుంటున్నాను. పాడైపోతుంది"

"ఓహో... నీ అలంకరణ కూడా నాకు సంకెళ్లప్రాయంగా తయారైంది. ఎప్పుడు చూచినా ఇలా చేయకు, అలా చేయకు, ఇదిగో జుత్తు పాడౌతుంది, బొట్టు చెరిగిపోతుంది, లిప్‌స్టిక్ మొఖం నిండా అంటుకుంటుంది అని వారించటమే తప్ప"

సుషమ నవ్వింది— "నువ్వు వద్దంటే అలంకరణ మానేస్తాను. మానేయనా?" పక్కనే స్టూల్ మీద పడి వున్న తడి టవల్ కుర్చీ మీద ఆరవేస్తూ అంది సుషమ.

"మానేయ్ నా కే హాయిగా వుంటుంది. నా చొక్కాలు నీ లిప్‌స్టిక్. తిలకాల మరకల బారి నుంచి రక్షింపబడతాయి"

"పోను పోను నువ్వు చాలా చెడ్డ పిల్లాడివైపోతున్నావు నీల్" చూపులను బాణాల్లా సంధిస్తూ అంది సుషమ.

నీల్ పకపక నవ్వేసాడు. తయారై బయలుదేరబోతుండగా భైరూసాయంత్రం పోస్టులో వచ్చిన ఉత్తరం తెచ్చి సుషమ కిచ్చింది. కవర్ తెరచి ఉత్తరం చదువుతున్న సుషమ ముఖంలో రంగు మారటం నీల్ గమనిస్తున్నాడు. సుషమ ఉత్తరాన్ని హేండ్‌బాగ్‌లో పడేసుకుంటూ "పద నీల్ నేను రడీగా వున్నాను" అంది.

సుషమని తీసుకుని ఏదైనా క్లబ్బుకు వెళ్దామని నీల్ ఆలోచన. కానీ మధ్యలో ఆ ఆలోచనని మానుకుని కెనాట్ ప్యాలెస్ వైపుకు కారు నడుపుతూ అడిగాడు నీల్— "సిటీలో మంచి సినిమాలేం ఆడుతున్నాయి?"

"ఇవ్వాళ సినిమాకు వద్దులే. మరో రోజు వెళ్దాం" సుషమ స్వరంలో ధ్వనించిన నిశ్చయత్వంతో నీల్ మరి మాట్లాడలేదు. అతడు సుషమని తన అభిమాన రెస్టారెంట్‌లోకి తీసుకెళ్ళాడు. ఇద్దరూ ఫామిలీ బాక్స్‌లో కూర్చున్నారు. నీల్ కాఫీ ఆర్డర్ చేసాడు. రెస్టారెంట్‌లో పాసింజర్స్ ఎక్కువగా లేరు. నిశ్శబ్దంగా వుంది వాతావరణం. సుషమ నీల్ కనుపాపల్లో తన ప్రతిబింబాన్ని చూసుకుంటూ కూర్చుంది. ఆమె కట్టుకున్న నారింజ రంగు చీరకున్న జరీబార్డర్ ధగధగ మెరుస్తోంది. నల్లటి జుత్తు మీద పడుతున్న కాంతి కిరణాలు మెరుపుల్లా కిందకు జారుతున్నాయి. ఇద్దరూ ఎదురెదురుగా కూర్చుని వున్నారు.

నీల్ ఆమె వైపుకు వంగుతూ అన్నాడు.

"సుషమా! ఇవ్వాళ అదోలా వున్నావేం? హటాత్తుగా ఉదాసీనంగా మారిపోయావేం?

సుషమ తడబడుతూ నీల్ వైపు చూచింది. "అదేం లేదు మామూలుగానే వున్నాను" అని కాఫీ తాగసాగింది.

"చాలా సేపటి నుంచి గమనిస్తున్నాను. నేను నీ ఎదురుగా వున్నానన్న స్పృహ కూడా నీకు లేదు. ఎక్కడో ఆలోచిస్తున్నావు"

సుషమ తన చేతిని నీల్ వైపుకు చాచింది.

ఆమె చేతిని అందుకుంటూ అన్నాడు నీల్.

"ఊఁ నన్ను బులిపించి, మైమరపించే పనులు మాత్రం చాలా వచ్చు నీకు!"




"నువ్వు నా పక్కన వుంటే మౌనం కూడా అర్థవంతంగా వుంటుంది. నిశ్శబ్దం లోనూ లయ కనిపిస్తుంది"

అప్పటివరకు బిగుసుకుపోయి వున్న నీల్ ముఖం నెమ్మదిగా వికసించటం సుషమ గమనించింది. తరువాత నీల్ ఆక్షేపణ లేని సాధారణ స్వరంతో అన్నాడు "సుషమా అప్పుడప్పుడు నాకేమనిపిస్తుం దంటే నేను నీ హృదయాన్ని పూర్తిగా గెలుచుకోలేకపోయాననీ, కేవలం నీ అస్తిత్వపు సరిహద్దుల్లో మాత్రమే నిల బడి వున్నాననీ అనిపిస్తోంది"

కొన్ని క్షణాలసేపు సుషమ కనురెప్పలు కిందకు వాలిపోయాయి.

"మరి నేను" సుషమ తలవంచుకునే ప్రశ్నించింది. "నువ్వు వినా నాకు మరో లోకం లేదు. నా జీవితం నిండా నువ్వే వున్నావు"

— చిన్న చిన్న కాంతి కిరణాలు సుషమ కనుపాపలమీదకు ఎగబ్రాకుతున్నాయి. మంద్రమైన ఆ కాంతిలో సుషమ ముఖం మనోహరంగా కనిపిస్తోంది. ఆమె సున్నితంగా నీల్ గోళ్ళపై వేళ్ళతో రాస్తూ కూర్చుంది. హటాత్తుగా చేతిని వెనక్కు తీసుకుంటూ అంది. "నీల్' పద ఇక పోదాం. చాలా ఆలస్యమైపోతోంది"

నీల్ మాసమాటాడకుండా లేచి నిల బడ్డాడు. బిల్లు చెల్లించి బయటకు వచ్చారు. కారు స్టార్ట్ అయింది.

"ఉత్తరం మీ యింటి దగ్గరనుంచి వచ్చిందా?"

"అవును అమ్మ రాసింది"

"ప్రత్యేకమైన విశేషం ఏదైనా వుందా?"

"లేదు" సుషమ నీల్‌తో చెప్పాలా వద్దా అన్న విచికిత్సలో పడిపోయింది. మళ్ళీ ఒక నిశ్చయానికి కొచ్చి చెప్పింది "నీరు పెళ్ళి గురించి మావాళ్ళు కంగారు పడుతున్నారు"

వెంటనే సుషమ హృదయం ఆక్రోశంతో నిండిపోయింది. తను నీల్‌తో షికారుకెళ్ళటానికి ఎంత ఆనందంగా తయారైంది. తల్లి దగ్గర నుంచి వచ్చిన ఉత్తరం ఆ ఆనందాన్నంతటినీ క్షణంలో ధ్వంసం చేసేసింది. ఉత్సాహమంతా చప్పగా చల్లారిపోయింది. నీల్ పక్కన వుండి కూడా తన మనసు ఉదాసీనంగా తయారైంది.

"నువ్వు ఇంతగా బాధపడవలసిన అంశం ఏముంది అందులో? ఎందుకలా దిగాలుపడిపోతావు ?''

"నీకు తెలియదు నీల్ ! మా నాన్న గారు మొదటినుండి ఇలాంటి బాధ్యతలు చేపట్టడంలో అసమర్థుడుగానే మిగిలి పోయాడు. ఆయనవల్ల ఏ పనీ అయ్యేది కాదు. మా అమ్మ ఇంటి బరువు బాధ్యత లన్నీ నా మీద మోపి కూర్చుంది" సుషమ ఒక పెద్ద నిట్టూర్పు విడుస్తూ అంది "సరే వదిలెయ్''

ఆమె నీల్‌కు దగ్గరగా జరిగి అతడి భుజమ్మీద తల ఆన్చింది. "సుషమా! నీ సహృదయతని నీవాళ్ళు దారుణంగా ఎక్స్‌ప్లాయిట్ చేస్తున్నట్టున్నారు. ఇది చాలా అక్రమం. నీ తమ్ముళ్ళని, నీ చెల్లెళ్ళని చూడవలసిన బాధ్యత మీ అమ్మది, మీ నాన్నది. పోనీ నీకూ కొంచెం ఉండ నుకున్నా అంతా నీదే కాదు"

సుషమ ఒక్కసారిగా ఏడ్చేసింది. వెక్కిళ్ళుపడుతూ అలాగే వుండిపో యింది.

తరువాత కొద్ది సేపటివరకు నీల్ ఏమీ మాట్లాడలేదు. సుషమ అతి ప్రియ

త్నమ్మీద దుఃఖాన్ని అదుపులోకి తెచ్చు కుంది. స్టీరింగ్‌వీల్ మీద వున్న నీల్ చేతిని గట్టిగా పట్టుకుంది. నీల్ చిన్నగా నవ్వాడు. అతి కోమలంగా ఉందా నవ్వు. సుషమ కళ్ళు తుడుచుకుంది.

* * *

ఆరోజు అలస్యంగా నిద్రలేచింది సుషమ. టీ తాగి అలసిపోనట్టు కుర్చీలో కూర్చుని పేపర్ తిరిగేస్తోంది. ఉదయపు లేత కిరణాలు ఆహ్లాదాన్ని స్తుంచే ఆ క్షణాల్లో తన జీవితం ఎంతో అందంగా వున్నట్టు అనిపించింది సుషమకు.

పేపర్ తిరిగేసి అవతల పడేసి కళ్లు రెండు మూసుకుని అలసటలోని అనుభూతిని అనుభవిస్తోంది సుషమ. ఇంతలో ఎవరిదో చెయ్యి భుజమ్మీద పడింది. సుషమ కళ్లు తెరచి చూచింది.

"రాణిగార్కి ఇంకా నిద్ర చాల లేద నుకుంటా ?" నవ్వుతూ అంది మీనాక్షి.

"రా మీనాక్షీ" సుషమ మీనాక్షిని ఆహ్వానించింది. కానీ అలాగే కుర్చీలో అర్ధనిమీలిత నేత్రాలతో కూర్చుండి పోయింది.

"నిన్న నువ్వు మిసెస్ పూరి ఇంట్లో డిన్నర్‌కు రాలేదే?" మీనాక్షి ఆమె కుర్చీ చేతిమీద కూర్చుంటూ అడిగింది.

"ఓ...నేను మర్చేపోయాను" సుషమ తప్పుచేసినదానిలా అనేసింది.

"ఎలా గుర్తుంటుంది నీకు? కాలాన్ని రసమయంగా గడిపేస్తున్నావు కదా" అనేసి మీనాక్షి దొంగనవ్వు నవ్వుకుంటూ సుషమ మొఖంలోకి సూటిగా చూడ సాగింది.

"నిజం మీనాక్షీ! నాకు బొత్తిగా గుర్తు లేదు. సువ్వా గుర్తు చేశావు కాదు" నేరం మోపుతూ అనేసి వదులుగా ఉన్న జుత్తులోకి వేళ్లు జొనుపుకుంటూ చూచింది.

"వెళ్ళేముందు నేను వచ్చాను. నువ్వు లేవు భైరు 'అమ్మగారు నీల్ గారితో షికారుకెళ్ళారు' అని చెప్పింది. బహుశా నువ్వు అటునుంచి డిన్నర్‌కు వస్తావేమో అనసుకున్నాను. అందరూ నీ గురించి నన్ను అడిగారు. కాస్త లేటుగా వస్తావని చెప్పాను. అందరం చాలా సేపు ఎదురు చూశాం"

సుషమ మాట్లాడలేదు.

"అక్కడ డిన్నర్‌లో అందరూ నీ గురించే అనుకున్నారు"

సుషమ మాట్లాడలేదు. తన మాటలు సుషమ మీద ఏ మాత్రం ప్రభావం చూపించకపోవటాన్ని గమనించి మీనాక్షి మళ్ళీ అంది-"మిస్ శాస్త్రి అందరికన్నా ముందు నీ గురించి అందరికీ చెప్పింది. అందరూ ఆమె మాటల్లోని రసాన్ని తాగి తన్మయులయ్యారు. నువ్వు ఎప్పుడు బయటకు వెళ్ళేదీ, ఎప్పుడు తిరిగివచ్చేదీ, ఎవరెవరు నీ దగ్గరకు వచ్చేదీ, నువ్వు ఎవరితో సినిమా హాల్లో కనిపించేదీ, హోటళ్ళలో ఎవరితో కనిపించేదీ... ఒకటేమిటి నీ దినచర్య యావత్తూ ఈస్ట్‌మన్ కలర్‌లో వర్ణించి మరీ చెప్పింది మిస్ శాస్త్రి"

"మరి వాళ్ళకి మరో పని వుంటేగా" అసహ్యించుకుంటూ అంది సుషమ. ఆమె ముఖం మ్లానమైంది.

మీనాక్షి కుర్చీమీద నుంచి లేచి కాసేపు పక్కనే వున్న పేపర్‌పై దృష్టి నిలిపింది. తరువాత అంది "సుషమా! నువ్వుమరోవిధంగా భావించకుండా విను.




చాలా రోజుల నుంచి నీకు చెబుదామను కుంటున్నాను. ఈ హాస్టల్ తాలూకు నాలుగు గోడల మధ్య ఎప్పుడెప్పుడు ఏ విశేషం జరుగుతుందా, దానికి రంగులు పులిమి చర్చించి ఆనందిద్దామా అని ఎదురు చూస్తుంటారు వీళ్లు. కొన్నిరోజులుగా హాస్టల్ గదుల్లో, నౌకర్ల చాకర్ల మధ్య, మన కొలీగ్స్ మధ్య ఎక్కడ చూచినా నీ గురించిన చర్చే జరుగుతోంది. వాళ్ళకా అవకాశం ఎందుకివ్వాలి మనం?"

"నేను వీళ్ళెవరినీ లెక్కచెయ్యను" సుషమ కఠిన స్వరంతో అంది.

"మనముంటున్న వాతావరణం అలాంటిది సుషమా! ఇక్కడ మన చర్యల్ని రకరకాలుగా ఖండించి చెప్పుకుని ఆనందిస్తారు వీళ్ళు" నచ్చచెప్పే ప్రయత్నం చేస్తూ నెమ్మదైన స్వరంతో అంది మీనాక్షి. తను చెపుతున్న మాటలు తనకే అసహ్యాన్ని కల్గిస్తున్నాయి. కానీ తన స్నేహితురాలు సుషమ నలుగురి నోళ్ళల్లో నానటం ఇష్టంలేక బలవంతంగా చెబుతోంది మీనాక్షి.

"మీనూ! నామీద నీకు నమ్మకంలేదా? నన్ను మరో స్వాతిగా అంచనా వేసుకుని మాట్లాడుతున్నావా?"

"నా ప్రశ్న అదికాదు సుషమా. నువ్వు నీ పరిస్థితిని మర్చిపోయి ప్రవర్తించకూడదు. ఒక బాధ్యతాయుతమైన పదవిలో వున్నదానివి. నువ్వు నీ స్టూడెంట్ల ఎదుట ఒక మంచికి ఉదాహరణగా వుండాలి"

"అయితే? నా డ్యూటీ నేను ఖచ్చితంగా నిజాయితీగా చేస్తున్నాను. నాకు, కాలేజీకి వున్న అనుబంధం అంతవరకే. మిగతావి నా వ్యక్తిగతమైన వ్యవహారాలు. వాటిలో జోక్యం చేసుకునే హక్కు ఎవరికీ లేదు. ఎప్పుడూ ఈగలు తోలుకుంటూ గంభీర ముద్ర ధరించి కూర్చోటానికి నేను ముసలిదాన్నో, ముక్కిదాన్నో, విధవరాలినో కాదు"

మీనాక్షి ఉదాసీనంగా మారిపోతూ అంది "సుషమా! తొమ్మిదేళ్ళ నుంచి నువ్వీ కాలేజీలో పనిచేస్తున్నావు. నీకు తెలియని సంగతులు లేవు. అయినా నువ్వు ఇలా మాట్లాడేస్తున్నావు. ఇక్కడ ఎవరికీ వ్యక్తిగత జీవితం లేదు. అది ఒక తెరుచుకుని వున్న పుస్తకంలాంటిది. అదీగాక నిన్ను చూసి అందరూ ఏడ్చి పోతుంటారు. జెలసీతో మండి పడుతుంటారు. ప్రిన్సిపాల్‌కు నీమీద గొప్ప నమ్మకం వుంది. ఆవిడే స్వయంగా నిన్ను వార్డెన్‌గా సజెస్ట్ చేస్తూ కాగితాలు పైకి పంపింది"

సుషమ కళ్ళల్లో మాంద్యం నిండిపోయింది. అది చూచి మీనాక్షి మౌనంగా వుండిపోయింది. కొద్దిరోజులుగా సుషమలో కనిపిస్తున్న మార్పు చూచి మీనాక్షి ఆశ్చర్యపోయింది. ఎప్పుడూ తనలో తానై తనపని తను చేసుకుంటూ ఒక మూలన వుండే సుషమకు, ఈనాటి సుషమకు పోలికలేదు. ఇప్పుడు సుషమ కళ్ళల్లో నీరసం స్థానంలో మెరుపులు చోటు చేసుకున్నాయి. నీల్ గురించి మీనాక్షి ఎన్నడూ సుషమని అడగలేదు. అలా అని తెలుసుకోకుండాను ఉండలేదు. మీనాక్షి అమాయకురాలేం కాదు.

సుషమ కళ్ళల్లో మెరుపులు పుట్టించిన వాడు, ఆమెలోని పరివర్తనకు కారకుడు నీల్ అని మీనాక్షికి స్పష్టంగా తెలుసు.

సుషమ స్తంభించిపోయిన దానిలా కూర్చుని వుంది. మీనాక్షి ఒకటి రెండు

సార్లు కదిలించి పలకరించే ప్రయత్నం చేసింది. సుషమ నిర్జీవమైన నవ్వొకటి నవ్వి ఊరుకుంది. కళ్ళల్లోని మెరుపులు స్విచ్ ఆఫ్ చేసినట్లు ఆరిపోయాయి. పెదవులు వణుకుతున్నాయి. శూన్యంలోకి చూస్తోందే తప్ప నోరు విప్పదు. ఆ మరు క్షణమే ఆమె కళ్లనిండుగా నీళ్లుబికి వచ్చాయి. మీనాక్షికి అప్పుడనిపించింది- అవన్నీ చెప్పి తను సుషమ మనసుని క్రూరంగా గాయపర్చానని.

మీనాక్షి అసహాయంగా సుషమ వైపు చూస్తూ అపరాధినిలా అంది "సుషమా! ఐయాం సారీ! నీ వెనుక ఏం జరుగు తోందో నువ్వు తెలుసుకోవటం మంచిదనే ఉద్దేశంతో చెప్పాను. అంతకు మించి నీ మీద నాకెలాంటి దురభిప్రాయం లేదు"

సుషమ వేళ్ళ చివళ్ళతో కన్నీళ్ళు తుడుచుకుంది. భారమైన స్వరంతో అంది "నువ్వు నిజమే చెప్పావు మీనాక్షీ! ఇక్కడ నాకున్న ఒకే ఒక్క ఆత్మీయు రాలివి నువ్వు. నన్ను బాధపెట్టే అధి కారం, చీవాట్లు పెట్టే అధికారం రెండూ నీకున్నాయి. కానీ నా విన్నపం కూడా నువ్వు వినాలి. లోకులు నా గురించి ఏమనుకున్నాసరే నువ్వు మాత్రం వాళ్ళు అలా అనుకుంటున్నారని నా దగ్గర ఇంకె ప్పుడూ చెప్పకు"

తను సుషమని తన మాటలతో ఎంతగా బాధపెట్టిందీ అప్పుడర్థమైంది మీనాక్షికి.

మీనాక్షి విషయాన్ని చాలా మర్యాదగానే చెప్పింది. ఆమె తన స్నేహితురాలు కాబట్టి అలా చెప్పింది. మరి మిగతావాళ్ళు ఎంత అసహ్యంగా మాట్లాడుకుంటున్నారో, ఆనందిసు న్నారో? సుషమ ఆలోచిస్తోంది. నీల్‌తో కలసి తిరగటం, షికార్లకు, సినిమాలకు, క్లబ్బులకు పోవటం ఆనందంగా గడప టానికి మాత్రమే అనుకుంది సుషమ. అలాగే నీల్ సమక్షంలో ఆనందించింది. కానీ ఆ తరువాత ఆ ఆనందం బంధం అయిపోతుందనుకోలేదు. కేవలం కొన్ని రోజుల్లో నీల్‌తో ఎంతటి పటిష్ఠమైన బంధం ఏర్పడిపోయిందో, దాని వేళ్ళు ఏ మేరకు విస్తరించాయో స్వయంగా సుషమకు కూడా ఒక అంచనా లేదు. ఊహించని బంధం ఊపిరై కూర్చుంది. నీల్ తనకు అత్యంత ప్రియమైనవాడని మాత్రం సుషమ స్పష్టంగా ఒప్పేసు కుంది. శాపగ్రస్తురాలైన రాజకుమారి లాంటిది తను. నీల్ స్పర్శతో తను మేలు కొంది. శాపవిముక్తిని పొందింది. తను కనిపించినప్పుడల్లా నీల్ కళ్ళల్లో కని పించే వెలుగుకు, ప్రతిక్షణం ముగ్ధుడై పోతూ తనని చూసే తీరుకు తాను ఆశ్చర్య పోయేది. ఎదుటి మనిషిని ముగ్ధుడ్ని చేయ గల అందం,సామర్థ్యం తనలోవున్నాయా అసలు?

పాత వ్యక్తిత్వం మరుగున పడిపోయి, చెరిగిపోయి ఆశిథిలాలలోంచిఉద్భవిస్తున్న తేజో విరాజితమైన సరికొత్త వ్యక్తి త్వాన్ని చూచి సుషమ అమితాశ్చర్యానికి లోనైంది. ఆమె ఇంద్రియాలు, రక్త నాళాలు ఒక వినూత్నమైన తీక్షణతకు గురి అవసాగాయి. అదివరకు స్టూడెంట్ల పట్ల కఠినంగా వుండే సుషమ ఇప్పుడు పట్టు సడలించింది. గేటు దగ్గర ఎవరి కోసమో నిరీక్షిస్తూ నిలుచున్న అమ్మా యిలను చూచినా' లావాటి కవర్లు పోస్టులో అమ్మాయిల పేర వచ్చినా చూచీచూడనట్టుఉదారంగా ఉండిపోతోంది.




సుషమలో వచ్చిన ఈ ఘనమైన మార్పుని దాదాపు అందరూ గమనించారు. స్టూడెంట్లకు సుషమ తిలకంలో కొత్త కాంతి వచ్చి చేరినట్టు, పెదవులు కోమలంగా మారిపోయినట్టు కనిపించ సాగాయి. సుషమ వాళ్ళందరి ప్రియమైన లెక్చరర్ అవటంతో మరీ పట్టి పట్టి గమనించేవారు వాళ్ళు.

క్వార్టర్స్‌లో వుండే కొలీగ్స్ "సుషమ ఈమధ్య కనిపించటమే లేదు. ఎవరైనా కలవటానికి వస్తే ఒకటి రెండు నిమిషాల్లో చర్చ ముగించేసి ఇంక వెళ్ళ వచ్చు అన్నట్టు చూస్తుంది. సుషమ ఇప్పుడు సుషమ కాదు 'రేషమా' అయిపోయింది అంటుండేవారు. వాళ్ళ మాటలు ఒకటీ అరా చెవిన పడేవి. కానీ పట్టించుకునేది కాదు.

ఆ రోజు నీల్ రానని చెప్పాడు. నాలుగు గంటలకే క్లాస్ ముగించి మీనాక్షితో షాపింగ్‌కు బయలుదేరింది సుషమ. కొన్ని చీరలకు మాచ్ అయ్యే బ్లౌజ్ పీసెస్ సెలక్టు చేసుకుని షాపులోంచి బయట పడేసరికి చీకటి పడిపోయింది. చేతుల్లో ప్యాకెట్లతో ఇద్దరూ కాఫీకోసం రెస్టారెంట్‌లోకి నడిచారు. నీల్ ఎప్పుడూ సుషమని అదే రెస్టారెంట్‌లోకి తీసుకొచ్చేవాడు.

కాఫీ వడపోస్తూ మీనాక్షి అంది "నిన్ను చాలా హింసించాను కదూ! నువ్వింకా నా మాటల్నే పట్టుకుని బాధ పడటం లేదుకదా ?"

"లేదు.కాస్త అలసటగా వుంది అంతే" అంది సుషమ. కానీ ఆమె కళ్లు ఇంకా తడి ఆరలేదు. ఆ మాటలు గుర్తుకొచ్చి నప్పుడల్లా మళ్ళీ నీళ్ళుబుకుతున్నాయి.

మీనాక్షి కూడా మౌనంగా కూర్చుంది. రెస్టారెంట్ స్ప్రింగ్‌డోర్స్ ఐదు నిముషాలకోసారి తెరుచుకొని మరుక్షణమే మూసుకుంటున్నాయి. లోపల గ్రాంఫోను రికార్డుల సంగీతంతో పాటు ప్లేట్ల, చెంచాల శబ్దాలు కలసి వినిపిస్తున్నాయి. సుషమ ద్వారానికి దగ్గర పర్చివున్న ఎర్రకార్పెట్ చూస్తోంది. మళ్ళీ గోడకు వేలాడుతున్న పెయింటింగ్‌వైపుచూచింది. ఈసారి తెరుచుకుంటున్న తలుపులవైపు చూచింది. మరో ఇద్దరు మధ్య వయస్కులతో నీల్ లోపలకు వచ్చాడు. నీల్ కనిపించగానే సుషమ పెదవుల మీద చిరునవ్వు చిగిర్చింది. కళ్ళు నీల్‌నే గమనిస్తున్నాయి. కానీ నీల్ సుషమని గమనించలేదు. వాళ్ళు ముగ్గురు మరో మూలకు వెళ్ళి కూర్చున్నారు. ఇప్పుడు నీల్ కొంచెం మాత్రమే కనిపిస్తున్నాడు. తను కుర్చీకాస్త అవతలకు జరుపుకుంటే నీల్‌ని పూర్తిగా చూడవచ్చు. మీనాక్షి తిండియావలో వుంది. సుషమ లేచి కుర్చీ జరుపుకుంది. కుర్చీ జరిపిన శబ్దానికి మీనాక్షి ఉలిక్కిపడుతూ తల ఎత్తి చూచింది. "ఏమీ లేదు. విశాలంగా కూర్చుందామని" అని చెప్పి సుషమ మళ్ళీ తన దృష్టిని నీల్‌వైపు మరల్చుకుంది.

నీల్ బ్లాక్ పాంటు, వైట్ షర్ట్ వేసుకుని వున్నాడు. కబుర్లు చెబుతూ మధ్య మధ్యలో నవ్వుతున్న నీల్ ముఖం సుషమని వేల సంకెళ్ళతో బంధించి వేసింది.

నీల్ సిగరెట్ కేస్‌లోంచి సిగరెట్ తీసి వెలిగించుకున్నాడు. అగ్గిపుల్ల యాష్ ట్రేలో పడేస్తూ మళ్ళీ నవ్వాడు. తరువాత పైకప్పు కేసి చూశాడు. ఈసారి అతడి

దృష్టి సుషమ వున్న దిశగా ప్రసరిం చింది. తన వైపే చూస్తున్న సుషమని గమనించి తన మిత్రులతో ఏదో చెప్పి అక్కడనుంచి లేచి సుషమ దగ్గరకు వచ్చాడు. మీనాక్షి అతడ్ని చూడగానే గుర్తుపట్టేసింది. సుషమ సహజ స్వరంతో అతడ్ని మీనాక్షికి పరిచయం చేసింది. "మీనూ! వీరు నీల్- ఈవిడ మీనాక్షి నా ఫ్రెండు కొలీగ్‌కూడా"

మీనాక్షికి నీల్‌తో మొదటి పరిచయం అది. అంతకు ముందు దూరం నుంచి చూసింది. దగ్గర నుంచి చూడాలన్న కుతూహలం ఇప్పుడు తీరింది. నీల్ చాలా బావున్నాడు. సూటిగా, నిర్భయంగా చూడగల కళ్ళు, చిన్నగా, విశిష్టంగావున్న చిరునవ్వు, అమాయకంగా కనిపించే ముఖం. సుషమ చాలా అదృష్టవంతురాలు అనుకుంది మీనాక్షి

తన ఆలోచనలను అక్కడితో ఆపి వేస్తూ మీనాక్షి అంది "మీ కోసం ఏదైనా తెప్పించనా ?"

"వద్దండి థ్యాంక్స్" నీల్ అన్నాడు. "నేనూ మాఆఫీసులోని ఇద్దరుఫ్రెండ్స్‌తో వచ్చాను. మీరు భారీ ఎత్తున షాపింగ్ చేసి వచ్చినట్టున్నారే !" ఖాళీగావున్న కుర్చీ మీద పెట్టివున్న ప్యాకెట్స్‌వైపు చూస్తూ అన్నాడు నీల్. మళ్ళీ మీనాక్షిని ఉద్దేశించి అన్నాడు నీల్ "మీరు తిరిగి కాలేజికి వెళ్తారు కదా ? నేను వచ్చి దిగబెడతాను"

"నాకు వేరే పనివుంది. మా ఆంటీతో వాళ్ళింటికి వస్తానని చెప్పాను. తప్పకుండా వెళ్ళాలి. మీరిద్దరూ వెళ్ళండి. నేను దారిలో హనుమాన్‌రోడ్డు దగ్గర దిగి పోతాను" అంది మీనాక్షి. ఆ క్షణం తనకు హటాత్తుగా వచ్చిన ఆ ఆలోచనకు తనను తానే అభినందించుకుంది. ఉదయం తను చేసిన చర్చలోని చేదుని ఈ రకంగానైనా కడిగివేసుకుందామనుకుంది మీనాక్షి.

"టీ తాగాక తన ఫ్రెండ్సుకి వీడ్కోలు చెప్పి సుషమని దిగబెట్టటానికి బయలుదేరాడు. బయలుదేరే ముందు కిళ్ళీబడ్డీ ముందు కారాపి ఒక సిగరెట్ ప్యాకెట్, అగ్గిపెట్టె తీసుకున్నాడు. సుషమ అప్పుడు మౌనంగా వుంది. హనుమాన్ రోడ్డులో మీనాక్షి దిగిపోయాక తామిద్దరే వున్న ఏకాంతంలో సుషమ అడిగింది "నువ్వు సిగరెట్లు ఎప్పటి నుంచి తాగుతున్నావు?"

"అప్పుడప్పుడు ఏదైనా విశేషంవున్న రోజున కాలుస్తుంటాను" అని వాచి చూసుకుంటూ "నువ్వు అర్జంటుగా వెళ్ళవలసిన అవసరం వుందా ?" అన్నాడు. అతడి దృష్టి సుషమని బంధించి వేసింది.

"అవసరం లేకపోతే ఏమిటి చెయ్యాలని?" సుషమ వెంటనే అంది.

"ఎటైనా వెళ్దాం"

"ఎటు?"

"ఆ సంగతి నా కొదిలెయ్" నీల్ సుషమని చూపులతో మరింతగా బంధిస్తూ అన్నాడు



నీల్ గోడ నానుకుని కూర్చున్నాడు.

ఉదయం జరిగిన చర్చతో సుషమ మనసు ఇంకా భారంగానే వుంది. ఆ పీడన నుంచి నీల్‌తో వున్న ఏకాంతంలో కూడా విముక్తి పొందలేకపోయింది. చిక్కటి చీకటి కారణంగా వాళ్ళకు కొంచెం దూరంలో వున్న దిగుడు బావి లోని నీళ్లు నల్లటి పెద్ద మచ్చలా కని పిస్తున్నాయి. చుట్టూ వేపచెట్లు గుంపులు గుంపులుగా పెరిగి వున్నాయి. చెట్ల ఆకుల సందుల్లోంచి దూరంగా వున్న రోడ్డు మీద మున్సిపల్ లైట్ల కాంతి కొద్దిగా కనిపిస్తోంది.

నీల్ మౌనంగా కూర్చుని సుషమని అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తున్నాడు. సుషమ ఏదో చెప్పాలని చెప్పలేక పోతోందని నీల్‌కు అర్థమవుతోంది. ఆమె గుండెల్లోని మాటలు గొంతువరకు కొన్ని, పెదవుల వరకు కొన్ని వచ్చి ఆగిపోతున్నాయి.

గాలి ఒక్కసారి విసురుగా వీచింది. వేపచెట్ల కొమ్మలు రాసుకున్న శబ్దంతో పాటు ఆకులు రాలిన శబ్దం వినిపించింది. సుషమ హఠాత్తుగా అంది "నీల్..."

నీల్ తనకు కొద్ది దూరంలో కూర్చుని వున్న సుషమ వైపు తల తిప్పి చూశాడు.

"నీల్! ఇకపై నువ్వు నా దగ్గరకు రావద్దు" సుషమ ధైర్యాన్నంతటినీ కూడ గట్టుకుని అనేసింది.

నీల్ ఉలిక్కిపడ్డాడు.

సుషమ ఈ మాట చెబుతుందని అతడు ఊహించలేదు. కొద్దిసేపటివరకు అలాగే చూస్తుండిపోయాడు. చీకట్లో సుషమ ముఖం స్పష్టంగా కనిపించలేదు. కాని ఆమె స్వరంలోని అమాయకత్వానికి చలించిపోయాడు.

సుషమకు తన దుఃఖం ఒకేసారి బరువైపోయినట్టు, అసహనంగా వుంది. మనసు అంతా విప్పి నీల్‌తో చెప్పే యాలన్న ఆత్రుత అధికమైంది.

నీల్ ఆమెను చీకటిగా, నిశ్శబ్దంగా, నిర్మానుష్యంగా వున్న ప్రదేశానికి తీసు కొచ్చాడు. కన్నీళ్ళతో మాసిపోయివున్న తన ముఖం నీల్ చూడకుండా రక్షించి నందుకు చీకటిని కృతజ్ఞతా పూర్వ కంగా చూస్తోంది సుషమ. క్షణ క్షణానికి దుఃఖ తీవ్రత హెచ్చుతోంది. శ్వాశ అందటం లేదామెకు.

"సుషమా ! ఏమైంది నీకు ? ఏం జరిగింది ? నా నుంచి ఎందుకు దాస్తావు? నేను పరాయివాడినా ? నీకేమీ కానా ?" నీల్ ఆర్ద్రంగా అడిగాడు "నాతో ఏదీ చెప్పవు. మనసు విప్పి మాట్లాడవు. అంతరాంతరాల్లో అన్నీ దాచేసుకుని కుమిలిపోతుంటావు"

సుషమని దగ్గరగా తీసుకుని తన కౌగిట్లో దాచుకున్నాడు నీల్. తనను కౌగిలించుకున్న బలమైన చేతులు సుషమకు అప్పటివరకు లేని ధైర్యా న్నిచ్చాయి. కొండంత అండ దొరికినట్టు అనిపించింది. ఆర్ద్రతతో తడిగా వున్న నీల్ స్వరం సుషమ తలపై గొడుగులా విప్పుకుంది. సుషమ చీరకొంగుతో కళ్ళు తుడుచుకుని కంపిస్తున్న స్వరంతో అంది.

"ముప్పై మూడేళ్ళవరకు అనా ఘాతంగా, స్వచ్ఛంగా, మరో స్పర్శ ఎరగకుండా జీవించిన నేను ఇలా నీ కౌగిలిలోకి ఎలా వచ్చాను? ఎప్పుడయినా ఆలోచించావా నీల్?"

వేపచెట్ల కొమ్మలు మళ్ళీ గాలి విసురుకి రాసుకొని శబ్దం చేసాయి.



నెమ్మదీ నెమ్మదిగా సుషమ స్వరం బలాన్ని పుంజుకుంది. "నా జీవితంలో గడిచిన అనేక సంఘటనలు, మజిలీల గురించి నీకు చెప్పలేదు. చెప్పాలని అనుకోనూ లేదు. ఎందుకంటే నా గత జీవితపు శిథిలాలు నీకు గుచ్చుకోకూడదు. అవి నిన్ను బాధపెట్టకూడదనుకున్నాను. కానీ నీల్...పదకొండు సంవత్సరాలుగా నేను జీవితంతో హోరాహోరీ పోరాడుతూ బ్రతుకుతున్నాను" సుషమ

ఒక్క క్షణం నిట్టూర్పుతో విశ్రాంతి తీసుకుని ఎదురుగా పరుచుకుని వున్న శూన్యంలోకి చూస్తూ చెప్పసాగింది "నీకు పూర్తి వివరాలు చెప్పలేను. కానీ ఒక విషయం గట్టిగా చెప్పదల్చుకున్నాను. ఈ ఉద్యోగం చాలా విలువైనది. నేను పేదదాన్నే, పేదగానే వుంటాను. నాకు ధనం లేకపోవచ్చు. కాని అభిమాన ధనంమాత్రం చాలావుంది. నేను తల్చుకుంటే ఈ శరీరం ద్వారా లక్షలకు అధికారిణిని అయి వుండేదాన్ని. నేను ఇంతకుముందు ఉద్యోగంచేసిన కంపెనీ సెక్రటరీ ఆ పట్టణంలోని ధనికుల్లో ఒకడు. ఎన్నో ఆశలు చూపించాడు. కానీ నేను లొంగలేదు. నన్ను ప్రలోభపెడదామని చూశాడు. నేను అక్కడ ఆ క్షణమే ఉద్యోగం మానేసాను.

"రిజైన్ చేసి వచ్చి మా అమ్మ తో చెప్పాను. అప్పుడు మాఅమ్మ 'ఇప్పుడు



ఈ పసికందుల గతేమౌతుంది?' అంది. అప్పటికేనాన్నగారుపక్షవాతంతో మంచాన పడివున్నారు. ఉద్యోగంతో నాకెంతో అవసరం వుంది. కానీ ఉద్యోగం కోసం ఆత్మని తాకట్టు పెట్టటం, అభిమానాన్ని అమ్ముకోవటం సహించలేకపోయాను.

"మా అమ్మ నాతో ఏమాత్రం సహకరించలేదు. పైగా ఎత్తిపొడుపు మాటలతో నన్ను చిత్రవధ చేసేది. కుటుంబంలోని కష్టాలన్నింటికీ నేనే కారణమన్నట్టు ప్రవరించేది. ఆ రోజుల్లో నన్ను ఒక ధనిక ప్లీడర్‌కిచ్చి పెళ్ళి జరిపించేద్దామని ప్రయత్నించింది. నేను మొండిగా కాదని చెప్పేసాను. బహుశా ఆమె తల్లికాదు రాక్షసి అయివుంటుందని నీవు అనుకుంటుండి వుంటావు. కానీ ఆవిడమాత్రం ఏం చేస్తుంది? జీవితం, దారిద్ర్యం ఆమెను పీల్చి పిప్పి చేసేసాయి. మా నాన్నగారికి రెండో భార్యగా రావటంవల్ల ఆవిడ కోరికలూ, కాంక్షలూ ఏ ఒక్కటీ పూర్తి కాలేదు. ఆ అసంతృప్తి నంతటినీ నా మీద ప్రదర్శించేదామె. అటు భర్త అశక్తుడు, అసమర్థుడు – ఇటు కూతురు మొండి ఘటం...

"తొమ్మిదేళ్ళనుంచి నేనీ కాలేజీలో వున్నాను నీల్! కానీ ఇక్కడి మనుషులు ఎవరినీ సుఖంగా, శాంతిగా బ్రతకనివ్వరు. అందుకనే నేను నీతో ఆ మాట అన్నాను. నా జీవితం పూర్తయిపోయింది. కేవలం ఆకార మాత్రంగా మిగిలివున్నాను. నా ఆలోచనలకు విలువ లేదు, నా ఆశలకు ఆధారంలేదు. పెళ్ళిచేసుకుని కుటుంబాన్ని నిరాధారంగా వదిలేయగల ధైర్యం నాకు లేదు. అసంభవమైన పని అది. నా జీవితం ఏనాడో వాళ్ళకు అంకితమై, వాళ్ళకే పరిమితమైపోయింది. నన్ను వదిలెయ్ నీల్. నువ్వు వెళ్ళిపోయాక మళ్ళీ నన్ను నేను ఆ నాలుగు గోడల మధ్య బంధించేసుకుంటాను."

సుషమ శాలువా భుజాల చుట్టూ బిగించి చుట్టుకుంది. తను ఆనుకున్న గోడనుంచి వస్తున్న చల్లదనంతో ఆమె బొమికలకు కూడా చలివేస్తోంది. నీల్ భుజాలు పాకుతున్న చోటమాత్రం వెచ్చగా వుంది. ప్రత్యేకాత్మకంగా వుంది. ఈ క్రూర, కఠోర ప్రపంచంలో తనను అక్కున జేర్చుకుని కాపాడగలవాడు నీల్ ఒక్కడే. అతడి స్పర్శలోనే ఆమెకు సాంత్వనం లభిస్తుంది. ఆ స్పర్శలో స్నిగ్ధత, ఉష్ణత, ఆత్మీయత, అనురాగం మిళితమై వుంటాయి అనుకుంది సుషమ.

నీల్ అగ్గిపుల్ల వెలిగించి చెయ్యి పైకెత్తి ఆ వెలుగులో సుషమ వైపు చూశాడు.

తడిగా వున్న సుషమ కనుపాపలు, ముఖమ్మీద కదలాడుతున్న విషాద ఛాయలు, చిందరవందరై వున్న కేశాలు చూసి అగ్గిపుల్లను అవతలకు పారేసాడు. మనసు విప్పి నీల్ ముందుపర్చి, తనివి తీరా ఏడ్చి సుషమ తేలికపడింది.

చాలా సేపటివరకు ఇద్దరూ మౌనంగా కూర్చుండిపోయారు. ఇద్దరి మధ్యా గడ్డ కట్టుకపోయి వున్న నిశ్శబ్దాన్ని ఛేదిస్తున్న స్వరంతో అంది సుషమ "మరో అగ్గిపుల్ల వెలిగించు నీల్"

"ఎందుకు?"

"జుత్తు సరిచేసుకుంటాను" సుషమ పౌడర్ కేస్ తీసి మోకాళ్ళమధ్య అదిమి పట్టుకుని, బ్యాగ్‌లో దువ్వెనకోసం వెదకింది. నీల్ అగ్గిపుల్ల వెలిగించాడు. గాలికి కంపిస్తున్న ఆ చిన్ని వెలుతురులో సుషమ





తల దువ్వుకో సాగింది. నీల్ ఒకదాని తరువాత ఒకటిగా అగ్గిపుల్లలు వెలిగిస్తూ ముగ్ధుడైపోతూ సుషమనే కన్నార్పకుండా చూస్తూకూర్చున్నాడు. ఆఖరి అగ్గిపుల్లను కిందపడేస్తూ నీల్ అన్నాడు "ఇకనుంచి వెంట ఒక టార్చిలైటు తెచ్చుకుంటాను"

సుషమ నవ్వింది. తేనెకన్నా తియ్యగా వుందా నవ్వు.

"ఇంక నన్ను తీసికెళ్ళి దిగబెట్టే ఉద్దేశం వుందా లేకపోతే కాలేజీలో నుంచి ఊస్ట్ చేయిస్తావా?" సుషమ అడిగింది.

* * *

సుషమ వచ్చేసరికి మీనాక్షి తన గదిలో కూర్చుని కనిపించింది. మీనాక్షిని చూసి సుషమ తడబడింది. చేతిలో వున్న పత్రికను అవతల పడేస్తూ మీనాక్షి అంది "దార్లు చాలా బారైపోయినట్టున్నాయి. ఇంత ఆలస్యంగా వస్తున్నావు? ఎక్కడ దారితప్పి పోయావు?"

సుషమ ముఖం ఎర్రబారుతుండగా అంది "మీ ఆంటీ దగ్గరకు వెళ్ళావా?"

"వెళ్ళాను. నీకన్నా చాలా ముందుగా కూడా వచ్చేశాను. సరే నా సామాను ఎక్కడుంది?"

"అరె..." సుషమకు గుర్తుకొచ్చింది అప్పుడు.

"కారులోనే మర్చిపోయావా? హోప్‌లెస్ సుషమా! అసలు నీకు బొత్తిగా స్పృహే వుండదు".

సుషమ కంగారుగా పమిట సర్దుకుంటూ అంది "రేపు వచ్చేస్తాయిలే. నేను చౌకీదారు కారులోంచి తీసుకొస్తాడన్న ఉద్దేశంలో వుండిపోయాను" అంటూ బట్టలు మార్చుకునే ప్రయత్నం చేయకుండానే మంచమ్మీద వాలిపోయింది. కంబళి లాగి తన మీద కప్పుకుంది.

భైరు వచ్చి అడిగింది. "అమ్మగారూ! బట్టలు ఇంకా మార్చుకోనే లేదా? భోజనం వడ్డించమంటారా? కాసేపు ఆగమంటారా"

"మీనాక్షి! నువ్వు కాసేపు ఉంటావు కదా? నాకు బొత్తిగా ఆకలి వేయటం లేదు. ఓ అరగంట ఆగి భోంచేద్దాం" సుషమ ఓ పక్కకు ఒత్తిగిలుతూ అంది.

"పోనీలే ఇవ్వాళ నన్ను మీ యింటికి భోజనానికి పిలిచావన్న సంగతన్నా గుర్తుంది. రక్షించావులే. లేకపోతే నేను నానా అవస్థపడవలసి వచ్చేది" మీనాక్షి ఎత్తిపొడుపు మాటలు ఆ సమయంలో నచ్చాయి సుషమకు. పది నిముషాలు గడిచాక సుషమ లేచి స్నానం చేసింది. గుప్పెడు టాల్కం పౌడర్ తీసి మీద గుమ్మరించుకుని ఉతికిన బట్టలు కట్టుకుంది. పౌడర్ అమితంగా పులుముకోవటంతో గుప్పు గుప్పున వస్తున్న పరిమళం మైమరపింపజేసింది.




మరునాటి రోజు నీల్ నౌకర్ బట్టల ప్యాకెట్లు తీసుకొచ్చాడు. సుషమ నీల్ స్వయంగా వస్తాడనుకుంది. మధ్యాహ్నం నీల్‌కు ఫోన్ చేసింది సుషమ. ఫోన్‌లో నీల్ గొంతుక పూర్తిగా మారిపోయింది. ఎవరో పరపురుషుడితో ప్రేమ కబుర్లు చెబుతున్నట్టు అనిపించింది సుషమకు. నీల్ తను

కంపెనీ పని మీద బొంబాయి వెళుతున్నట్టు చెప్పాడు. ఎప్పుడు తిరిగి వచ్చేదీ నిశ్చయంగా చెప్పలేనన్నాడు. సంభాషణ మధ్యలో వుండగా మిస్ శాస్త్రి రావడంతో సుషమ ఫ్రీగా మాట్లాడలేకపోయింది. సుషమ రిసీవర్ ఫోన్ మీద పెట్టేయగానే మిస్ శాస్త్రి అంది "నేను హాస్టల్ వదిలి మరో చోటికి వలసపోవలసిన అవసరం వచ్చిపడింది. ఇక్కడ ఏం జరుగుతోందో పట్టించుకునే తీరిక నీకు లేదు. ఆడపిల్లలు చేస్తున్న కొంటె పనులకు హద్దు లేకుండా పోతోంది?"

సుషమ గంభీరమైపోతూ అడిగింది "నాకు వివరంగా చెప్పండి. ఏం జరిగింది?"

"నిన్న రాత్రి చౌకీదార్ నా కారేజి తెచ్చి కాంటీన్‌లో పెట్టి వెళ్ళాడు. నేను పనుండి బయటికి వెళ్ళి ఆలస్యంగా వచ్చి భోంచేద్దామని క్యారేజీ విప్పాను. గిన్నెల్లో భోజనానికి బదులు కప్పలున్నాయి"

"కప్పలా!?" సుషమ నమ్మలేనట్టుగా అంది. "ఈ చలికాలపు రోజుల్లో అన్ని కప్పలు ఎక్కడ దొరుకుతాయి."

"కప్పలే. నాలుగు గోదురు కప్పలు. బయట చీకటిలో అమ్మాయిలు గుంపుగా నిలబడి నన్ను చూసి విరగబడి నవ్వుకుంటున్నారు. నేను లేచి వెళ్ళి బుద్ధి వచ్చేలా చీవాట్లు పెట్టాను"

"ఎవరా అమ్మాయిలు?" సుషమ అడిగింది.

"అందరూ పారిపోయారు. ఇంకెవరవుతారు. ఆ మహీంద్ర, సరిత అయి వుంటారు" మిస్ శాస్త్రి మండిపడుతూ చెప్పింది.

"వాళ్ళని ఉదయం పిలిచి కేకలేయలేదా"

"ఆ పని చేయవలసింది నువ్వు. నేను రిపోర్టు నీ ముందుంచాను"

"నేను వాళ్ళని పిలిచి అడుగుతాను. పెద్దవాళ్ళతో పరాచకాలు ఆడటం వాళ్ళకే మంచిది కాదు. ఈ వ్యవహారం నేను తేల్చుకుంటాను. మీరు బాధపడకండి"

"బాధపడకుండా వుండటమా? నేను ఇరవై నాలుగ్గంటలూ వాళ్ళ మధ్య ఉండవలసినదాన్ని. నా యిష్టం వచ్చిన పనులు చేసుకోవటానికి నీకున్నట్టు నాకు ప్రత్యేకమైన బంగ్లా లేదు. నీకు వాళ్ళ అరుపులు, కేకలు, అల్లరి వినిపించవు. నేను నిన్న రాత్రంతా ఆకలితో మాడి చచ్చాను. చివరికి నా బిస్కెట్లు వగైరా కూడా ఆ అమ్మాయిలు కాజేశారు. గొడవ జరిగిన మరుక్షణమే నేను నీ కోసం వచ్చాను. మీనాక్షి కూర్చుని వుంది. నీవు ఏమైపోయావో మరి"

సుషమ చటుక్కున కాలింగ్ బజర్ నొక్కింది. చప్రాసీ లోపలికొచ్చాక "సీనియర్స్ అందరినీ నేను రమ్మంటున్నానని చెప్పు" అంది.

మిస్ శాస్త్రి కోపంతో మొహం ఇంత లావు చేసుకుని కూర్చుండిపోయింది. కొద్ది నిముషాల తరువాత చప్రాసి వచ్చి సునందగారి క్లాసులో వున్నారని చెప్పి వెళ్ళాడు.

"ఒక పని మనకు చేత కానప్పుడు మరొకరికి అప్పగించేయాలి. ఈ ఉద్యోగం నువ్వు చేయలేకపోతే రాజీనామా చేసెయ్. కాలేజీలో నలభై ఎనిమిది మంది లెక్చరర్స్ వున్నారు. ఎవరో ఒకరు వార్డెన్‌గా వచ్చేస్తారు."

"ఈ అల్లరి అంతటికీ కారణం మహీంద్ర. చాలా పెచ్చరిల్లిపోతోంది. సిగ్గూ లజ్జా వదిలేసి బరితెగించి తిరుగు

 

తోంది. టీచర్స్ పక్కనే వున్నారని తెలిసికూడా 'నేను బాయ్ ఫ్రెండ్ దగ్గరకు వెళ్తున్నాను లవ్ మేకింగ్ చేయటానికి' అని గొంతు చించుకుని మరీ చెబుతుంటుంది. ఈ ప్రపంచం చివరికి ఏమైపోతుందో అర్థం కావటంలేదు. చిన్నా పెద్దా అన్న తారతమ్యాలు, గౌరవాలు, మర్యాదలు అన్నీ గాలికి ఎగిరిపోయాయి."

సుషమ స్తంభించిపోయి కూర్చుంది. మిస్ శాస్త్రి కేవలం తనని గాయపర్చే ప్రయత్నంలో లీనమై వుందని సుషమకు తెలుస్తూనే ఉంది. మిస్ శాస్త్రి లోపలకు పీక్కుపోయిన చెంపలు, కన్నెప్పుల చివర బూజుపట్టినట్టున్న వెంట్రుకలు, నుదుటి మీద మసి పూసినట్టున్న గొంగళీ పురుగుల్లా వున్న కనుబొమలు సుషమకళ్ళల్లో గుచ్చుకున్నాయి. ఆవిడ వికృత స్వరూపాన్ని అంత నిశితంగా పరిశీలించటం అసహ్యంగా వుందనుకుంది సుషమ.

"పోనీలెండి మిస్ శాస్త్రీ! వాళ్లు చిన్న పిల్లలు. ఈ వయసులోనే కదా వాళ్ళు అల్లరి చేయాలి మరి. మనం పెద్దవాళ్లం చూసీ చూడనట్టుండాలి" సుషమ అంది.

"అల్లరి వయసు అందరికీ వస్తుంది. ఈవయసులో ఉన్నప్పుడు మేమూ అల్లరి చేసేవాళ్ళం. కానీ ఇలా కాదు. ఇంత బరితెగించి కాదు."

తపించిపోతున్న భూమిలా కనిపించింది మిస్ శాస్త్రి సుషమకు. ఆమెలో పూర్తికాని ఆశలు ఆమె దృష్టిని వికృతంగా మార్చేసాయి. తను తపించిన దాన్ని పొందలేకపోగా, వయసుకు తగిన అల్లరి చేయక, ప్రేమ, ప్రణయం అనుభవించలేకపోగా వాటిని అసహ్యమైనవాటిగా భావించేసుకుని వుంటుంది. ఇలా అనుకునే చాలామంది మనుషులు ప్రేమను పోగొట్టుకుని సినిక్స్‌గా తయారవుతారు. తీరని కోరికల అగ్నిలో కాలిపోతుంటారు. సాటివారి ప్రేమను, చివరికి తనకన్నా ఎంతో చిన్న వయసులో వున్న పిల్లల అల్లరిని చూచి కూడా ఓర్చుకోలేరు. అందునా ద్వేషానికి ప్రత్యేక ప్రతినిధి అనిపించుకునే స్త్రీ సంగతి ఇక చెప్ప నవసరం లేదు. ఇప్పుడు శాస్త్రి తన పిల్లికి డియరెస్ట్ అని పేరు పెట్టి తనలో మిగిలిపోయిన, తను తన ప్రియుడికి అందించలేకపోయిన, అనేక సంకోచాల మధ్య, దురవగాహనల మధ్య నలిగిపోయిన ప్రేమనంతటినీ ఆనోరు లేని పిల్లి మీద కురిపిస్తోంది. తన కోరికలు తీరకపోతే తనూ మరో పదేళ్ళకు మిస్ శాస్త్రిలాగే ద్వేషిణి అయిపోతుందా? ద్వేషంతో నిండిపోయి వున్న మిస్ శాస్త్రి కళ్ళల్లోకి చూస్తూ అనుకుంది సుషమ. అనారోగ్యంగా ఎదిగి, అపరిపక్వంగా మిగిలిపోయి, వికృతంగా మారిపోయిన చెట్టులా కనిపించింది మిస్ శాస్త్రి.

"మీరు పొయిట్రీ క్లాసులు తీసుకుంటారు కదా. కాళిదాసు, భవభూతి, జయదేవుల రస సిద్ధాంతం, ప్రణయంలోని మాధుర్యం, వాటి రహస్యాలు మీకు తెలిసి వుండాలి" సుషమ సర్ది చెప్పే ధోరణిలో అడిగింది.

"ఈ లెక్కన నువ్వు గొప్ప రసజ్ఞురాలివై వుండాలి. నువ్వు చెప్పేది చరిత్ర పాఠాలు. కానీ పెద్ద రసిక శిఖామణిలా ఉన్నావు నువ్వు" మిస్ శాస్త్రి అదే ద్వేషంలోంచి అనేసింది.

ఈవిడకు చెప్పి ప్రయోజనం లేదనుకుంటూ సుషమ నవ్వేసి ఊరుకుంది. అంతకు ముందు తను ఎంతో కరుణతో మిస్ శాస్త్రి బలహీనతల మీద జాలి కురి

పించింది. కాని, దయకు పాత్రురాలయ్యే అర్హత మిస్ శాస్త్రికి లేదనుకుంది. ఈవిడ కావాలని తన చుట్టూ గోడలు కట్టుకుని, అంతా చెడగొట్టుకుని, బయటి ప్రపంచంలో కొద్దిపాటి ఆనందం అనుభవిస్తున్న వారి మీదకు క్రూరంగా రాళ్ళు రువ్వుతోంది. బాణాలు సంధించి గాయపర్చి ఆనందిస్తోంది.

సాయంత్రం సునంద వచ్చింది. ఆమె మిస్ శాస్త్రి అసహ్యకరమైన ప్రవర్తన గురించి చెప్పింది. ఆవిడ అమ్మాయిలకు వచ్చే ఉత్తరాలన్నీ దొంగచాటుగా చదివేస్తుందనీ, కొందరి ఉత్తరాలు మాయం చేస్తుందనీ, సందర్భం లేకుండానే అమ్మాయిల మీద విరుచుకుపడి తలా తోకాలేని వాదనలు లేవదీస్తుందనీ చెప్పింది. అంతే కాదు ఒక్కోరోజు అమ్మాయిలను దగ్గర కూర్చోబెట్టుకుని టీచర్స్ మీద లేనిపోని కథలు అల్లిచెప్పి వాళ్ళని పిల్లలముందు చులకన చేస్తుందని కూడా చెప్పింది.

"ఇంతకుముందే నువ్వు ఈ విషయాలు నాతో చెప్పవలసింది. ఆవిడ అలాంటిదని తెలిసికూడా గొడవ పెట్టుకోవటం ఏం బావుంది" సుషమ ఒక్క నిమిషం ఆగి మళ్ళీ అడిగింది "ఆవిడ క్యారేజీలో కప్పలు ఎవరు పెట్టారు?"

సునంద చాలా బుద్ధిమంతురాలైన టీచర్. ఎవరి గురించీ పట్టించుకోదు. సుషమ ప్రశ్నతో ఆమె కాస్త తడబడుతూ అంది "దాన్ని గురించి నాకూ తెలియదు సుషమా! కానీ నిన్న రాత్రి సరిత గదిలో పొద్దుపోయేవరకూ అల్లరి నవ్వులు వినిపిస్తుంటే వెళ్ళి వాళ్ళని వారించి వచ్చాను"

సుషమ సరితను పిలిపించింది. తనకు పిలుపు వస్తుందని ముందే తెలుసుకున్న సరిత తన గదికి తాళంవేసి మరొకరి గదిలోకెళ్ళి కూర్చుంది.

సుషమ సందర్భం లేకుండానే భయ మీద విసుక్కుంది. ఆమెను ఒక్కసారి ఒంటరితనం ఆవరించుకున్నట్టు అనిపించింది. ఆరోజే వచ్చిన వార పత్రిక చదువుదామనుకుంది. కాసేపు రేడియోలో పాటలువినే ప్రయత్నం చేసింది. కానీ విసుగు వదలలేదు. వెంటనే లేచి కాలేజీ కాంపౌండ్‌లోనే వుంటున్న మిసెస్ ధర్ దగ్గరకు వెళ్ళి ఆవిడ బాబుతో ఆడుకుంటూ కూచ్చుంది. తరువాత వంటింటి గుమ్మంలో నిలబడి లోపల కాఫీ తయారు చేస్తున్న మిసెస్ ధర్‌ని చూస్తూ నిలబడింది.

"ఇవ్వాళ బయటకు వెళ్ళలేదా సుషమా?" మిసెస్ ధర్ అడిగింది.

"ఉదయంనుండి మిస్‌శాస్త్రి నా బుర్ర పాడుచేసి,నామూడ్‌అంతా నాశనంచేసింది" సుషమ ఆవిడ చేతుల్లోంచి ట్రే అందుకుని టేబుల్‌మీద పెట్టింది. మిసెస్ ధర్ బీరువా తెరిచి బిస్కెట్లు పట్టుకొచ్చింది.

"అంటీ చాక్లెట్ ఏదీ?" అప్పటివరకు ఆడుకుంటున్న మిసెస్ ధర్ కొడుకు హటాత్తుగా అడిగాడు. వాడి వయసు ఓ సంవత్సరం వుంటుంది. పేరు సౌమ్య.

"అరె సౌమ్యా. మర్చేపోయాను. చాలా రోజులైంది నీ కోసం చాక్లెట్లు తెచ్చి. ఈసారి పెద్ద డబ్బా తెచ్చిస్తానులే ఏం" సుషమ వాడి బుగ్గమీద ముద్దుపెట్టి నవ్వేసింది.

మిసెస్ ధర్ నవ్వుతూ అంది "నీ ఆంటీకి అంత తీరిక ఎక్కడుందిరా? చూడు ఎన్ని నెలల తరువాత వచ్చిందో నిన్ను చూడటానికి!"

"ఏంచేయను చెప్పండి. అసలు వీలు




పడటంలేదు"

"అయినా నేను సంగతులన్నీ తెలుసుకుంటూనే వున్నానులే" మిసెస్ ధర్ చెబుతూ జీడి పప్పులున్న పళ్లాన్ని సుషమ ముందుకు నెట్టింది. ఓ నిమిషం ఆగి అంది "సుషమా! ఒకరోజు ఆ మిత్రుడ్ని తెచ్చి నాకు పరిచయం చెయ్యరాదూ! ఆయన గురించి చాలా విన్నాను నేను"

"మీరు కూడా ఇలాంటి మాటలే మాట్లాడుతున్నారా?"

"తప్పు మాట మాట్లాడానా? ఆయన నీ మిత్రుడు కాదా? లేకపోతే నువ్వు కూడా కనిపించిన మగాళ్లందరినీ అన్నలు, తమ్ముళ్ళు అనేసుకుంటూ ప్రేమికుడ్ని అన్నగా పరిచయం చేసే అందరిలాగే..."

మిసెస్ ధర్ ఆగిపోయింది.

"లేదు మిసెస్ ధర్! అలాంటి దుర్గతి నాకెప్పుడూ పట్టదు. మిత్రుణ్ని మిత్రుడిగా ప్రేమికుణ్ని ప్రేమికుడిగా చెప్పగల సాహసం ఇంకా నాలో మిగిలే వుంది. రహస్యాలు, దాచడాలు నాకు తెలియవు. అలాగే మిస్టర్ కాస్యప్ నాకు మంచి క్లోజ్ ఫ్రెండు..."

కాస్యప్ పేరు చెప్పగలిగింది కానీ నీల్ పేరుని ఆవిడ ముందు ఉచ్చరించలేకపోయింది సుషమ. ఎందుకిలా? ఐ లవ్ హిమ్ అని చెప్పేస్తే ఏమౌతుంది?— అతడు బొంబాయి వెళ్ళిపోతే తన కాలమంతా స్తంభించిపోయింది. క్షణమొక యుగంగా భారంగా గడుస్తోంది. సుషమ అనుకుంది 'నీల్ హటాత్తుగా తన జీవితాన్ని వెలుగు వెల్లువగా మార్చిన విద్యుత్ జలపాతం లాంటివాడు. అతడు తాకినప్పుడు తనలో కలిగే సంచలనం, అతడి స్పర్శ శరీరంలోని అణువణువులోను నిండిపోయి వుంది'.

సుషమ సౌమ్యని ఒడిలో కూర్చోబెట్టుకుని వాడి మెత్తటి బుగ్గలు నిమురుతూ కూర్చుంది. మిసెస్ ధర్ హటాత్తుగా అంది "అన్నట్టు సుషమా! కలకత్తాలో వుంటున్న మా వదిన దగ్గర నుంచి మొన్న ఉత్తరం వచ్చింది. స్వాతి పెళ్ళి చేసుకుందట"

"అరె — ఎవరిని?" సుషమ ఉలికిపాటుతో అడిగింది.

"అక్కడే కలకత్తాలో — అతనికి నలభైకి పైనే వయసుందట. కానీ మంచి పోస్టులో వున్నాడట"

సుషమ గతాన్ని వర్తమానంతో జోడిస్తున్నట్టు—

"మరి—స్వాతి — అప్పుడు గర్భవతి కదా - పిల్లాడో పాపో పుట్టి వుండాలి. ఏమైనట్టు?"

"ఏదో చేయించుకుని వుంటుంది" మిసెస్ ధర్ నెమ్మదిగా అంది. సుషమ కళ్ళముందు ఆనాటి సంఘటన...పాలిపోయి ఆత్మహత్యా ప్రయత్నంలో వాడిపోయిన స్వాతిముఖం కదులాడింది. జీవితం ఎంత క్రూరమైనదంటే అది చావుని కూడా చంపేస్తుంది.

"స్వాతి చేయరాని మహాపాతకం ఏదో చేసినట్టు నేను అనుకోవటం లేదనుకో కానీ కొంచెం జాగ్రత్త వహిస్తే ఇలాంటి కాంప్లికేషన్స్, అపవాదులు రావు" మిసెస్ ధర్ కాఫీకప్పు సుషమకు అందిస్తూ అంది.

'ప్రేమించినవాడు మోసం చేస్తాడని ఎవరనుకోగలరు. ప్రేమించినవాడి దగ్గర కూడా జాగ్రత్తలు వహించటం సాధ్యపడే

విషయమేనా?' సుషమ అందామనుకున్న మాటలు లోపలే వుండిపోయాయి.

"అప్పుడప్పుడు అలా జరుగుతుంటుంది" సుషమ అంది.

"స్వాతి ఎర్రచీర కట్టుకుని అగ్ని గుండం చుట్టూ తిరిగి పెళ్ళి చేసుకుని వుంటుంది. అప్పుడామెకు ఆ అజ్ఞాత శిశువు గురించిన ఆలోచన వచ్చి వుండదా ?" మిసెస్ ధర్ అడిగింది.

"జీవితంలో అనేకం జరిగిపోతుంటాయి. అదొక రణరంగం లాంటిది కదా ! అప్పుడప్పుడు గాయాలు, దెబ్బలు తగులుతుంటాయి" సుషమ నిట్టూరుస్తూ అంది.

"సరే సుషమా ! నేను నీతో ఒక పర్సనల్ విషయం మాట్లాడదామనుకుంటున్నాను. నువ్వు నన్ను అపార్థం చేసుకోవనికూడా అనుకుంటున్నాను. నేను నీకన్నా వయసులో పెద్దదాన్ని. నీ సంగతులు అడిగి తెలుసుకునే అధికారం ఆ రకంగా నాకుంది"

"అడగండి" సుషమ కళ్ళలో కుతూహలం నిండిపోయింది. మిసెస్ ధర్‌తో చాలా కాలంగా సుస్నేహ బంధం వుంది

సుషమకు. ఆవిడ కాలేజీలోని అసహ్యాల్లో పాలుపంచుకోదు. తన మానాన తను హాయిగా వుంటుంది.

"నువ్వు పెళ్ళి ఎందుకు చేసుకోకూడదు సుషమా! అందంగా కనిపిస్తావు. మంచి కుటుంబం నుంచి వచ్చినదానివి" ఆవిడ అడిగింది.

సుషమ ప్రశాంతంగా వున్న మిసెస్‌ధర్ ముఖంలోకి చూస్తోంది. సంవత్సరాలుగా తను ఈ ప్రశ్నకు చెబుతున్న అదే పాత సమాధానం నాలుక చివరి వరకు వచ్చి ఆగివుంది. ఆ సమాధానం ఇప్పటికి ఎంత మందితో చెప్పిందో సుషమకే తెలియదు.

"నాకు తెలుసు నీ మీద కుటుంబ బాధ్యతలున్నాయని. కానీ నే నడుగుతున్నది. నీ గురించి నువ్వు ఏం ఆలోచిస్తున్నావు? నీ కోసం నువ్వు, నీ గురించి నువ్వు కొన్ని ఏర్పాట్లు చేసుకోవద్దా?"

"పోనివ్వండి మిసెస్ ధర్ – మీరు కూడా అవే మాటల్ని పట్టుకు వ్రేలాడ్డం నాకు నచ్చలేదు. పెళ్ళి చేసుకుంటే తప్ప సుఖంగా వుండలేమా? నా దగ్గర అన్నీ వున్నాయి. ఆర్థికంగా సర్వస్వతంత్రురాలిని – నాకు ఏది కావాలన్నా అమర్చుకోగలను."

"అంత సుఖంగా వున్నదానివైతే అంత ఉదాసీనంగా ఎందుకు కనిపిస్తావు నువ్వు? మీనాక్షి మొదటి నుంచి ఓ లిటరరీ ఇంటలెక్చువల్‌ని కోరుతోంది. దొరకలేదు. ఇప్పుడు బిజినేస్ మాన్‌ని చేసుకోవటానికి ఎందుకు సిద్ధపడింది? మిస్ శాస్త్రిలో మానసిక రుగ్మతలు ఎందుకు చోటు చేసుకున్నాయి? ప్రతి ఒక్కరిని విమర్శిస్తూ పిల్లిని ప్రేమిస్తూ ఎందుకు వక్రంగా బ్రతుకుతోంది! వీటన్నింటికీ కారణం జీవితం అసంపూర్తిగా మిగిలిపోవటమే! పెళ్ళి లేకుండా జీవితానికి పరిపూర్ణత సిద్ధించదు సుషమా!"

"అలా అనుకుంటే మిసెస్ ప్రసాద్ పెళ్ళి చేసుకుని పడరాని కష్టాలుపడుతోంది. కీచులాడుకుని తన్నుకుని భర్తని వదిలేసింది.అందరి చర్చలకీ కేంద్ర బిందువైపోయింది"

"మిసెస్ ప్రసాద్ జీవితమే అన్ని జీవితాలకు కొలతబద్ద కాదు. నీ వైవాహిక జీవితం కూడా అలాగే అవుతుందనుకుంటే అది నీ పొరపాటు. నా సంగతే చెప్పమంటావా! నా పెళ్ళై ఇప్పటికి పదమూడేళ్ళైంది. అయినా ఆయన్ని చూడకుండా ఒక్క క్షణం ఉండలేను. ఆయన కూడా అంతే. ఇప్పటికి ఆయన ఆఫీసు నుంచి వచ్చి గేటు తెరుచుకుని లోపలికి వస్తుంటే శోభనం రాత్రి నా కోసం నా గదిలోకి వస్తున్న పెళ్ళికొడుకులాగే కనిపిస్తారు. ఆయన లేకపోతే నా కాలం స్థంభించిపోతుంది. నా శ్వాస ఆగిపోతుంది" అంటున్నప్పుడు మిసెస్ ధర్ ముఖం లజ్జా భారంతో కిందకు వంగిపోయింది. ఆమె నవ్వులో సిగ్గు కదులాడింది.

తను కదిలిస్తే ఎన్నెన్ని సంగతులో చెప్పేస్తుంది ఈవిడ. మంచి రసవంతమైన సంగతులే చెబుతోంది. సుషమ విస్మయంగా చూస్తూ కూర్చుంది. కొద్దిసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా ఉండిపోయారు.

సుషమ నవ్వుకుంటూ లేచి నిలబడి అంది "ఇంక నేను వెళ్తాను. ఎందుకంటే మీ ప్రాణనాధులు వచ్చేస్తున్నారు"

మిసెస్ ధర్ గేటు వెపు చూసింది. అప్పుడే గేటు తెరుచుకుని లోపలకు వస్తున్న భర్త శశిధర్ కనిపించాడు.

సుషమ వెళ్ళిపోయింది.




సరితని, మహీంద్రని పిలిచి మొహం వాచిపోయేలా చీవాట్లు పెట్టింది సుషమ అంతకు ముందెప్పుడూ అంతటి కోపాన్ని చూడనివాళ్ళు కంగారు పడిపోతూ కళ్ళ నీళ్ళు పెట్టేసుకున్నారు. సుషమ ఎప్పుడూ ప్రశాంతంగా, సాదాగా, దయగా వుంటుంది. దీనికంతటికీ కారణం అయిన మిస్ శాస్త్రిని శాపనార్థాలు పెట్టుకుంటూ సరిత, మహీంద్ర వెళ్ళిపోయారు. ఆరోజు పబ్లిక్ హాలీడే. ఏదో ప్రోగ్రాం వేసుకున్నారు వాళ్లు. కానీ సుషమ వారం వరకు కాలేజీ ఆవరణదాటి బయటికి వెళ్ళకూడని శిక్ష విధించింది. సుషమ చికాకు, విసుగు నిండిన మనసుతో ఇంట్లోనే వుండిపోయింది. నీల్ కనిపించి చాలా రోజులవటంతో సుషమ మరింత దిగులు పడింది, నీల్ కనీసం ఉత్తరమైనా రాస్తాడనుకుంది. కానీ రాయలేదు. ఎప్పుడు వస్తాడో తెలియదు

ఇంతలో మీనాక్షి మ్యాటనీకి రెండు టిక్కెట్లు రిజర్వు చేయించి సుషమకోసం వచ్చింది. సుషమ ఎటూ వెళ్ళే మూడ్‌లో లేదు. సినిమా చూసి ఎంజాయ్ చేయగల మనసిమితం అనలే లేదు. నీరసంగా ఉదాసీనంగా కూర్చునివున్న సుషమని చూచి మీనాక్షి విసుక్కుంటూ అంది "నువ్వు సన్యాసాశ్రమం స్వీకరిస్తే మంచిది. ఏ సర్దాలూ నీకు రుచించటం లేదీమధ్య. ఎప్పుడు చూసినా మొహం వేలాడేసుకుని ఏమిటిది? ఏమైపోయాడు నీ నీల్ ? ఇద్దరూ పోట్లాడుకున్నారా? అయితే చెప్పు నేను వెళ్ళి బ్రతిమాలి, కాళ్ళు పట్టుకుని అయినా సరే నీ దగ్గరకు తీసుకొస్తాను. కానీ దయచేసి కాస్త నవ్వు. చూడలేక చస్తున్నా నీ సీరియస్‌నెస్‌ని.."

సుషమ చిన్నగా కసురుకుంటూ అంది "నీ ఉపన్యాసం ఇంక ఆపుతల్లీ! నాకు ఒంట్లో బాగులేదంటుంటే ఎందుకలా గొడవ పెట్టేస్తావు?"

"శారీరక కష్టానికైతే ఏదో ఒక మందు వుంది. డాక్టర్లున్నారు. నీ మానసిక ప్రేమరోగాన్ని ఎవరు నయం చేయగలుగుతారు. అతను వచ్చి పిలిస్తే ఒంటికాలిమీద పరుగు పెడతావు. నాతో రావటానికి మాత్రం ఆరోగ్యం బావుండదు. నాతో రావటం ఇష్టం లేకపోతే చెప్పు"

మీనాక్షి వ్యంగ్య పరిహాసాలను భరించలేక "నువ్వు ఎలాంటి దానివంటే.. ఎందుకులే పద వస్తున్నాను" అని లేచి చకచక తయారైంది సుషమ.

మాట్నీ సినిమా చూసి, బయట హోటల్లోనే భోజనం చేసి ఇంటికి తిరిగి వచ్చారు. భైరు వచ్చి అంది "మీరు అటు వెళ్ళిన వెంటనే నీల్‌బాబు వచ్చారు"

ఒక్కసారిగా తనని ఎత్తైన శిఖరం మీద నుంచి ఎవరో కిందకు పడదోసినట్టు అనిపించింది సుషమకు. నిరాశగా అంది "ఏమైనా చెప్పి వెళ్ళారా"

"ఆయన మీరెక్కడికెళ్ళారని అడిగారు. ఏమో నాకు తెలియదు, భోజనం తయారుచేయవద్దని చెప్పి వెళ్ళారు అని

చెప్పాను. ఎప్పుడొస్తారని అడిగారు. నాకు తెలియదన్నాను. మీరు నాతో చెప్పి వెళ్ళలేదుగా!"

సుషమ మరో మాట మాట్లాడక మౌనంగా తనగదిలోకి వెళ్ళిపోయింది. మీనాక్షి మీద పట్టరాని కోపం వచ్చింది. అంతే కోపం నీల్ మీద కూడా వచ్చింది. ఇన్ని రోజుల వరకు ఏమైపోయాడో తెలియదు. తిరిగొచ్చి తను వచ్చినట్టు ఫోన్ కూడా చేయలేదు. మీనాక్షి సుషమ వెనకే వచ్చి ఆమె మంచం మీద కుర్చుంటూ అంది "సారీ సుషమా! పొరపాటు చేశాను, నిన్ను అనవసరంగా నువ్వు రానంటున్నా లాక్కెళ్ళాను"

మీనాక్షి పశ్చాత్తాపపు మాటలతో సుషమ విసుగు మరింత పెచ్చింది. తనని ఒంటరిగా వదిలి పెట్టి వెళ్తుందేమోనని చూస్తుంటే తన కోపాన్ని మరింత అధికం చేస్తోంది అనుకుంది సుషమ.

"ఆయనేదో నా ప్రేమికుడైనట్టు, ఆయన వెనక నేను పిచ్చిదానిలా పరుగు తీస్తున్నట్టు మాట్లాడుతున్నావ్" సుషమ రుసరుసలాడుతూ అంది.

"నీ ప్రేమికుడు కాకపోతే ఆయన ఎవరు మరి? నీ అన్నా లేక తాతా లేక ముతాతా ?" మీనాక్షికి కోపం వచ్చింది.

"మీనాక్షీ ! ప్లీజ్ నన్ను ఒంటరిగా వదిలెయ్" సుషమ స్వరం తీవ్రంగా ధ్వనించింది. తరువాత వాడిపోయిన మీనాక్షి ముఖం చూచి సుషమ కరిగి పోయింది. మీనాక్షి మెడ చుట్టూ చేతులు వేస్తూ అంది సుషమ "మీనూ! ఏమీ అనుకోకు. నేనో పిచ్చిదాన్ని"

ఈలోగా భైరూ వచ్చి అల్మారాను ఆనుకు నిలబడి నాటకీయంగా అంది -

"అమ్మగారూ! నీల్‌బాబు నాతో అన్నారు కదా 'భైరూ! నేను భోజనం ఇక్కడే చేస్తాను. సాయంత్రం మళ్ళీ వస్తాను' అని చెప్పి వెళ్ళారు."

మీనాక్షి తృప్తిగా నవ్వింది. సుషమ దృష్టి గడియారంపై పడగా అదిరిపడి లేచి కూర్చుంటూ అంది. "మొద్దు మొహందానా! మరి ఇంత సేపు ఈ సంగతి ఎందుకు చెప్పలేదేం ?"

"ఇక నేను వెళ్తాను" మీనాక్షి లేచి నిలబడుతూ అంది.

"ఇవ్వాళ నువ్వూ ఇక్కడే భోంచేసి వెళ్ళు మీనూ" సుషమ ఆహ్వానించింది.

"బాబ్బాబు అంత పెద్ద త్యాగం నేను చేయలేను. నేనింకా కొద్దికాలం హాయిగా బ్రతకాలనుకుంటున్నాను. పొద్దున్నించి నిన్ను నా వెంట తిప్పినందుకే నీ నీల్ మండిపడుతూ వుంటాడు. ఆయన వచ్చాక నేను ఇంకా ఇక్కడే కనిపిస్తే నన్ను హత్య చేసేస్తాడు"

సుషమలోని అలసట అంతా ఒక్క సారిగా ఎగిరిపోయింది. హుషారుగా భైరుని కేకేసింది "నా స్నానానికి ఏర్పాట్లు చెయ్" అంది.

భైరు ఆశ్చర్యపోతూ "ఇప్పుడా చలిలో"

"అవును ఇప్పుడే చేస్తాను"

"జబ్బు చేస్తుంది అమ్మగారూ"

"నీకెందుకు? నువ్వెళ్ళి నీళ్లు రెడీ చెయ్" భైరు నీళ్లు వేడిచేయటానికి వంటింట్లోకి నడిచింది. సుషమ బెడ్‌రూం సర్దుతూ క్షణానికోసారి తలుపుల వైపు చూస్తోంది. ఆమె శరీరంలోని రక్తనాళాలు బిగుసుకు పోతున్నాయి. తను చాలా ఆలస్యంగా వచ్చింది. నీల్ మళ్ళీ వచ్చి వెళ్ళలేదుకదా? సుషమ హఠాత్తుగా అనుకుంది. అలా జరిగి వుండదని తనకు తానే నచ్చజెప్ప

కుంటూ విడిగావున్న జుత్తును కొప్పు ముడివేసుకుని బాత్‌రూంలోకి వెళ్తూ భైరాని అడిగింది –

"కాఫీపౌడర్ వుందా ఇంట్లో"

"కొద్దిగా వుంది" భైరు జవాబిచ్చింది. సుషమ తలారా స్నానంచేసి వచ్చి మంచి చీర తీసి కట్టుకుంది. చెవులకి దుద్దులు పెట్టుకుంది. అల్మారా తెరచి 'ఇంటిమేట్' సెంట్ తీసి దిట్టంగా పులుము కొని అద్దంలో ప్రతిబింబాన్ని చూసు కుంది. తన ముఖం తనకే ఎంతో అందంగా కనిపించింది. మరికాస్త పౌడర్ బుగ్గలకు అద్దుకుంటూ మళ్ళీ తన రూపాన్ని మరోసారి అద్దంలో చూసు కుని వచ్చి వరండాలో నిలబడి నీల్ కోసం ఎదురుచూడసాగింది. బయట బాగా చలివేస్తోంది. అయినప్పటికీ అమ్మా యిలు తమకోసం వచ్చే బంధుమిత్రుల కోసం ఎదురుచూస్తూ లాన్‌లో కూర్చుని వున్నారు. మరికొందరు కాంటీన్‌లో కూర్చుని వున్నారు.

"గుడ్ ఈవినింగ్" సుషమ సరిత గొంతుకని గుర్తు పట్టేసింది. ఆ అమ్మాయి ఉదాసీనంగా నడుచుకుంటూ వచ్చింది. మరో రోజునైతే సుషమ ఏవో మాటలు మాట్లాడి వుండేది కానీ ఇవ్వాళ కుదరదు. ఆ రోజు శలవు కావటంతో సరిత ఫ్రెండ్స్ అందరూ బయటికెళ్ళి పోయారు. ఒక్కరూ తిరిగిరాలేదు. మరీ ఒంటరిదైపోయి దిగులు నిండిన కళ్ళతో సుషమవైపు చూసింది. మళ్ళీ గేటులోంచి లోపలకు వస్తున్న నీల్ కారు వైపు చూసింది. సరితకళ్ళు కొంతెతనంతో వెలి గాయి ఆ క్షణం. వెంటనే అక్కడనుంచి చకచక నడుచుకుంటూ హాస్టల్లోకి వెళ్ళి పోయింది. సుషమ లోపలకు నడిచింది.

"అమ్మగారూ పాలులేవు"

"వెళ్ళి పట్టా" అని చెప్పి డ్రాయింగ్ హాంలోకి వచ్చింది. అప్పటికే నీల్ రెండు చేతుల్లోనూ ప్యాకెట్లు పట్టుకుని లోపలికి వచ్చాడు. ప్యాకెట్లను ఖాళీగా వున్న కుర్చీ మీద పడేసాడు. సుషమ పరుగెత్తుకు వచ్చి నీల్ కౌగిట్లో ఒదిగిపోయింది. చాలా సేపటివరకు అలాగేవుండిపోయింది. మళ్ళీ తలను అతడి గుండెలకు ఆన్చుతూ అంది "ఎక్కడికెళ్ళిపోయావు ఇన్నాళ్ళు? నీకు దయలేదు నీల్! నేను నీకోసం చూసి చూసి అలసిపోయాను"

"నువ్వేగా చెప్పావు. ఇంక రావద్దని" నీల్ వెక్కిరిస్తూ అన్నాడు.

తన్మయత్వంలోంచి కళ్ళు పైకెత్తి చూస్తూ సుషమ అంది "ఇంకెప్పుడూ నా మాట వినకు"

"ఇక ముందు రావద్దని చెప్పకు"

"చెప్పను"

నీల్ సుషమని ఒక్కక్షణం సేపు ఒక్క అంగుళం దూరం చేస్తూ ఆమె కళ్ళల్లోకి చూశాడు. తడిగావున్న సుషమ పెదవులు నవ్వటంలేదు. దేనికోసమో నిరీ క్షిస్తున్నాయి.

"నా శరీరం సగం తెగిపోయినట్టు అనిపించింది సుషమా! రాగానే నీకోసం పరుగెత్తుకు వచ్చాను. నువ్వు కనిపించ లేదు. నిరాశపడిపోయాను. పగలల్లా ఏం చేయాలో బొత్తిగా తోచలేదు."

తలుపు చప్పుడైంది. సుషమ దూరంగా జరుగుతూ బహుశా భైరు వచ్చివుంటుం దనుకుంది.

"ఇవన్నీ ఎవరికోసం తెచ్చావు?" ప్యాకెట్ల వైపు చూస్తూ అడిగింది సుషమ.

"నీకోసమే! చూడు–నచ్చుతాయేమో"

నీల్ సుషమ కోసం చాలా బహు

మతులు పట్టుకొచ్చాడు. పర్స్, హ్యాండ్ బ్యాగ్, చీరలు, జరీఅంచులున్న బ్లౌజ్ పీస్ చెవులకు ముత్యాల దుద్దులు వున్నాయి.

"నా అలవాట్లని పాడుచేస్తున్నావు నీల్ నువ్వు. ఇన్నేసి పట్టుకు రావలసిన అవసరం ఏముంది?"

నీల్ అనుకున్నాడు తను ఇన్ని బహుమతులు తేవటం సుషమకు ఇష్టంగానే వుంది. కాని తీసుకోవటానికి మాత్రం ఆత్మాభిమానం అడ్డు వస్తోంది. సుషమని ఏడిపించి ఆనందించాలనే ప్రయత్నం చేస్తూ అన్నాడు నీల్–

"నాకున్నది సుషమ అనే ఒకే ఒక్క సుషమ. నేను ఎక్కడికెళ్ళినా ఏ అందమైన వస్తువు కనిపించినా వెంటనే కొనేసి మా సుషమకు ఇచ్చేయాలని వుంటుంది. కానీ నీ సంగతి వేరు. నీరూ కోసం చీర, సంజయ్ కోసం స్వెటర్, వినయ్ కోసం వేస్ట్‌కోట్, అమ్మకు చీర, నాన్నకోసం మరోటి..ఇలా ఇన్ని పనుల్లో నీల్ అనే వాడు ఒక్కడున్నాడన్న సంగతి కూడా నీకు గుర్తుండదు. గ్లోవ్స్ అల్లిపెడతానన్నావు అదీ మర్చిపోయావు"

సుషమ కింద కార్పెట్ మీద కూర్చుని వుంది. ఆమె నాలుగు వైపులా నీల్ తెచ్చిన బహుమతుల రంగురంగుల కవర్లు పడి వున్నాయి. వాటిని జరిపి తను వచ్చి నీల్ కాళ్ళ దగ్గర కూర్చుని అతడి మోకాళ్ళ మీద తల ఆన్చుతూ అంది "ఊఁ... అలిగావా అప్పుడే! నీకన్నా ఎక్కువ మరొకరు ఎలా అవుతారు? మా తమ్ముళ్ళతో, చెల్లెళ్ళతో ఎందుకు పోల్చుకుంటావు. నేనేం మర్చిపోలేదు. నీ గ్లోవ్స్ అల్లిపెడతాను. సరేనా?"

నీల్ ఇంకా తడి ఆరని సుషమ జుత్తుని తాకుతూ "నువ్వు ఎప్పుడు చూసినా వాళ్ళ గురించే ఆలోచిస్తుంటావు అందుకని"

వంటగదిలోంచి పళ్ళాల చప్పుడు వినిపించింది. సుషమ లేచి నిల్చుంది. భైరూనికేకేస్తూ అంది "భైరూ! టీ ఇక్కడికి పట్టా..భోజనం కొంచెం ఆగి చేస్తాం"

భైరు టీ కప్పులతో వున్న ట్రే తెచ్చి పెడుతూ నీల్ వైపు చూసి ఆత్మీయంగా నవ్వింది.

భైరు వెళ్ళిన తరువాత నీల్ అడిగాడు– "భైరు మనల్ని ఇలా చూసేస్తుంది కదా ఏమనుకుంటుంది?"

"ఇన్నాళ్ళకు గుర్తొచ్చిందా అయ్యగారికి సంగతి" సుషమ కొంటెగా నవ్వుతూ మళ్ళీ అంది "ఆ రోజు కారులో డ్రైవర్ చూస్తున్నాడని నేను గొడవ చేస్తుంటే నువ్వేమన్నావు – 'గంగలో కలవమను. హి కెన్ గో టు హెల్' గుర్తుందా?"

"ఓ దర్జాగా" అని సుషమ కొంగు చివర్ల వ్రేలాడుతున్న పట్టు దారాలను లాగసాగాడు నీల్. సుషమ టీ కప్పు నీల్ చేతికందించి వచ్చి అతడి పక్కన కూర్చుంది.

"సుషమా! చాలా అందంగా వున్నావీ రోజు. అంతేకాదు చూడు. ఆ పువ్వుల్లోంచి వస్తున్న సువాసన మునపటి కన్నా మధురంగా వుంది – ఇంకా..." నీల్ అక్కడితో ఆపేసి సుషమని దగ్గరగా తీసుకున్నాడు.

* * *

నిరుపమని, వినయ్‌ని తీసుకుని అకస్మాత్తుగా వచ్చిన తల్లిని చూచి చకితురాలైంది సుషమ.

"నీకు ఉత్తరం రాసే టైం లేదు.





నిన్న అబ్బాయి తరఫువాళ్ళు దగ్గరనుంచి అమ్మాయిని ఢిల్లీ తీసుకొచ్చి చూపించమంటూ ఉత్తరం వచ్చింది. ఆ అబ్బాయి రైల్వేలో పనిచేస్తున్నాడు. వాళ్ళందరూ బంధువుల ఇంట్లో పెళ్ళికి ఢిల్లీ వచ్చారట" తల్లి వివరించి చెప్పింది. ఆమె సుషమ ఉంటున్న బంగ్లా చూసి ప్రసన్నురాలయింది. సుషమ కాలేజీకి వెళ్ళాక ఆమె వస్తువులన్నింటినీ తిరగదోడి చూచి ఆ తరువాత నిద్రపోయింది. సుషమ తిరిగి వచ్చి బట్టలు మార్చుకున్న వెంటనే ప్రేమగా కాఫీ అందించింది. టిఫిన్ చేయమని బతిమాలింది. నారాయణ భార్యకు, చెల్లికి మధ్య జరిగిన తగాదా, ప్రతిమ మెట్లమీద నుంచి కింద పడటం లగాయితూ కబుర్లన్నీ పూస గుచ్చినట్టు చెప్పుకొచ్చింది. ప్రతిమ కింద పడినప్పుడు కాలో చెయ్యో విరిగిపోలేదు కదా అని తను ఎంత కంగారు పడిందో వివరించి, అదృష్టవశాత్తు అంగ వైకల్యం ప్రాప్తించలేదని నిట్టూర్చింది.

"అయినా దాని మనసు చదువు మీద లేదు. ఊరికే అంటుంది డాక్టర్నవుతానని. అంతతేలికగా డాక్టర్లైతే అందరూ తమ పిల్లల్ని డాక్టర్లని చేసేయ్యరూ" తరువాత తల్లి స్వరం తగ్గించి చుట్టూ ఒకసారి పరికించి చూసి మళ్ళీ అంది. "నీరూ పెళ్ళి వెంటనే చేసేయకపోతే ప్రమాదం ముంచుకొచ్చేలా వుంది. ఎప్పుడూ కిటికీలోంచి ఎదురింట్లో అబ్బాయి వైపు చూస్తుంటుంది. వాడు లేడు...మన ఎదురింట్లో బ్రిజ్ మోహన్...వాడు వట్టి వెధవలా కనిపిస్తున్నాడు...రేపుఏదైనా జరిగిపోతే వంశ మర్యాద బజారులోకొచ్చేస్తుంది."

"బిర్జూ...!" సుషమ ఆశ్చర్యంగా అడిగింది. "అమ్మా! ఆఅబ్బాయిచాలాబుద్ధిమంతుడు. చాలా తెలివైనవాడు. ఎప్పుడూ ఫస్టు మార్కుల్లో ప్యాసయ్యేవాడు. అప్పుడేదో కాంపిటీషన్‌లో పాల్గొన్నాడు ఏమైంది ?"

"ఇంటర్వ్యూలో తప్పాడని చెబుతున్నారు"

సుషమ పరిహాసధోరణిలో అంది "ఒకవేళ అతడు డిప్యూటీ కలెక్టర్ అయ్యాడనుకో నీరూ నిచ్చి పెళ్ళి చేసేస్తావా ?"

తల్లి నోరు తెరుచుకుని చూస్తుండిపోయింది. మళ్ళీ వెంటనే సర్దుకుని అంది "కలెక్టర్ కాదు వాడు కమీషనర్ అయితే మాత్రం నీరూని వాడికివ్వటమా? జరగదు. నా బంధువుల్లో బోలెడుమంది మగపిల్లలున్నారు. ఇలాంటి వెధవకు నా కూతుర్ని ఇచ్చేకర్మ నా కెందుకు?"

బయటినుంచి ఎవరో కాలింగ్ బజర్ నొక్కారు. సుషమ భైరూని కేకేసి ఎవరొచ్చారో చూడమంది. భైరూ వచ్చి నీల్ అని చెప్పబోయేంతలోనే సుషమ బయటి గుమ్మం దగ్గరకొచ్చేసింది. నీల్ ప్యాంట్ జేబుల్లో చేతులు పెట్టుకుని నిలబడి వున్నాడు.

"నీల్..." సుషమ స్వరం ఆనందంగా ధ్వనించింది. వెంటనే కాన్పూర్ నుంచి తల్లి, చెల్లి, తమ్ముడు వచ్చిన వార్త చెప్పింది. అది విని నీల్ ముఖం నిరాశతో వాడిపోయింది.

"నిన్ను సినిమాకు తీసుకెళ్దామని వచ్చాను" నీల్ నెమ్మదిగా అన్నాడు.

"నువ్వు కూర్చో. టీ తెస్తాను. ఇవాళ్ళ అమ్మా వాళ్ళున్నారు. మరో రోజు వెళ్దాం. ఆఫీసునుంచి తిన్నగా ఇటే వస్తున్నావా?"

ఆమె ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే నీల్ హటాత్తుగా అడిగాడు – "ఎన్ని రోజులుంటారు వాళ్ళు?"

"నాకు మాత్రం ఏం తెలుసు. ఎందుకు ?"

"అప్పటివరకు నేను ఎలా వుండగలనా అని" నీల్ చిన్న పిల్లాడిలా మొండికెత్తుతున్నట్టు అన్నాడు.

సుషమ తలుపు వైపు ఓ సారి చూసి నీల్‌కు దగ్గరగా జరిగి అంది "మరి నేను ఎలా వుండాలి. అది మాత్రం నీకు అవసరం లేదూ ?"

నీల్ అలక నిండిన కళ్ళతో చూస్తూ కూర్చుండిపోయాడు. లోపల వున్న తల్లి ఉత్సాహం ఆపుకోలేక కర్టెన్ తొలగించి చూస్తూ అంది "సుషమా ! టీ పంపించమంటావా ?" అనేసి వెంటనే లోపలకు వచ్చేసింది. ఆవిడ్ని చూసి నీల్ రెండు చేతులతో నమస్కారం పెట్టేశాడు. ఆ భంగిమ చూసి సుషమకు నవ్వు ఆగింది కాదు. నీల్ నమస్కారాన్ని అందుకుని తబ్బిబ్బవుతూ ఆమె కాసేపు మాట్లాడలేకపోయింది.

"అమ్మా ! వీళ్ళ స్వంత ఊరు లక్నో. కృష్ణమ్మ పిన్నికి బాగా పరిచయసులు" సుషమకు నీల్‌ని తల్లికి ఎలా పరిచయం చేయాలో అర్థం కాలేదు. తల్లి ముఖం నిండా నవ్వుతూ అంది "అలాగా!

కూర్చో నాయనా. నిలబడ్డావేం ?" తరువాత ఆమెగొప్ప హోదా నిండిన స్వరంతో "భైరూ ఒక కప్పు టీ పట్రా" అని ఆజ్ఞాపించింది. నీల్ సోఫాలో తనకత్యంత ప్రియమైన మూలన కూర్చున్నాడు.

"ఏం పనిచేస్తున్నావు బాబూ!?" తల్లి అడిగింది.

"ఆయన ఫిలిప్స్ కంపెనీలో పనిచేస్తున్నారు" సుషమ వెంటనే జవాబు చెప్పింది. వెంటనే తల్లికి ఈ విధమైన పరిచయాలు నచ్చవన్న సంగతి గుర్తు చేసుకుంది సుషమ.

తల్లి నిస్సంకోచంగా నీల్ కుటుంబ సంగతులు, అతడి ఉద్యోగం, జీతం, అన్నీ వివరాలు అడిగి తెలుసుకుని ఆఖరున అంది—

"నీకు సంబంధాలు వస్తున్నాయనుకుంటా ?"

"వస్తున్నాయి!" నీల్ అన్నాడు.

"మరి పెళ్ళి ఎప్పుడు చేసుకుందామనుకుంటున్నావు ? అందమైన అమ్మాయి కావాలి కదా ?"

రెండో మాట విన్న తరువాత నీల్ సుషమవైపు చూస్తూ చిరునవ్వు నవ్వాడు. సుషమ కంగారు పడిపోయింది. హటాత్తుగా తననావరించుకున్న సిగ్గు బారి నుంచి రక్షించుకో జూస్తూ సుషమ అంది "అయినా అమ్మా అవన్నీ నీకెందుకు ? వాళ్ళ అక్క మొన్న వచ్చినప్పుడు ఆయన పెళ్ళి చాలా త్వరలోనే అయిపోతుందని చెప్పి వెళ్ళింది"

తల్లి చిన్నగా నిట్టూర్చింది "ఎందుకు కాదు?
మంచి మగ పిల్లలు అలా వుండిపోతారా? వున్నా వుండనిస్తారా?" అని వెంటనే ఏదో గుర్తుకొచ్చినదానిలా నీరూని గదిలోకి పిల్చి తన పక్కనకూర్చోబెట్టుకుంది. నీరూ జంకుతూ వచ్చి ఆమె పక్కన కూర్చుంది. నీల్‌ని తనని చూడటానికి వచ్చిన అబ్బాయిఅనుకొని అప్పుడప్పుడూ దొంగచాటుగా నీల్ వైపు చూస్తోంది నీరు. సుషమ గమనించింది. నీరూ తన కన్నా చాలా అందంగా వుంటుందన్న సంగతి గుర్తుకొచ్చి సుషమకి ఒకలాంటి దిగులు ఆవరించుకుంది పైగా మంచి వయసులో, యవ్వనంలో వుంది. ఎన్ని అందమైన కలలున్నాయో నీరూ కనురెప్పల కింద– ఆ క్షణంలో. అందరిలో వుండి కూడా సుషమ ఒంటరిదైపోయింది. మరి నీల్– సుషమ కళ్ళు విశాలం చేసుకుని నీల్ వైపు చూసింది. విశాలమైన నుదురు. అమాయకమైన ముఖం, సోఫా మీద సున్నితంగా ఆనుకుని వున్న చేతులు అన్నీ ఆమె దృష్టిలోకి వచ్చాయి. అతడికి కొంచెం దూరంలో కూర్చుని వున్న తల్లి, చెల్లి, తమ్ముడు ముగ్గురూ పిశాచాల్లా నల్లగా కనిపించారు.

నీల్ సుషమనే గమనిస్తున్నాడు. సుషమ నవ్వే ప్రయత్నం చేయబోయింది. ఇంతలో నీల్ లేచి నిలబడుతూ అన్నాడు "నాకింక శలవు ఇప్పించండి. సుషమ కూడా కాలేజీ నుంచి అలసిపోయి వచ్చి వుంటుంది"

నీల్ వెళ్ళిపోయాడు. తన శరీరంలోని శక్తినంతటినీ పోగొట్టుకున్నదానిలా సుషమ అక్కడే నేల మీద కూర్చుంది. షాల్ తీసి కాళ్ళ మీద కప్పుకుంది. సుషమ కళ్ళ ముందు అలిగిన నీల్ ముఖం, అల్లరి చేసే కళ్ళు కనిపించసాగాయి. తను కనుపించగానే నీల్ ముఖం విద్యుద్దీపంలా ఒక్కసారిగా




వెలగిపోతుంది.

"చాలా అలసిపోయినట్టున్నావు తల్లీ పద మంచమ్మీద పడుకుందువు గాని" తల్లి ప్రేమనంతటినీ సుషమ మీద ఒలక బోస్తూ అంది.

సుషమ లేచి వెళ్ళి మంచమ్మీద పడు కుండిపోయింది. చాలా సేపటి తరువాత తల్లి మళ్ళీ వచ్చింది.

''నిద్రపోయావా?" ఆమె అడిగింది.

"లేదు" కంబళి గుండెల మీదకు లాక్కుంటూ అంది సుషమ. ఎంత సేప ట్నించో ప్రయత్నిస్తున్నా నిద్ర రావటం లేదు. ఒక్క క్షణం కునుకు పట్టినా నీరూ ముఖ బింబాలు గజిబిజిగా కనిపించి మెలకువ వచ్చేస్తోంది. తల్లి మళ్ళీ వచ్చిన సంగతి తెలుసుకుందామని అంది సుషమ.

"ఏమిటి?"

"రేపు వాళ్ళు వస్తున్నారు. ఏర్పాట్లన్నీ ఎలా అవుతాయా అని ఆలోచిస్తున్నాను" తల్లి చింతాక్రాంతమైన స్వరంతో అంది.

"అన్ని ఏర్పాట్లు సవ్యంగా అవు తాయి. నువ్వేం కంగారు పడకు. వాళ్ళు రేపు సాయంత్రం వస్తారు. ఈలోగా నేను అన్నీ చేయించేస్తాను" సుషమ తల్లికి వివరించింది.

"అమ్మాయి నచ్చకపోవటం అంటూ వుండదు" తల్లి స్వగతంలో అనుకుంది. ఒక్క క్షణం ఆగిమళ్ళీ అంది. "వాళ్ళకు అమ్మాయి నచ్చితే ఇచ్చిపుచ్చుకోవడాలు వుంటాయి. డబ్బు ఏర్పాటు కూడా చేస్తే మంచిది. పెళ్ళి ఫిబ్రవరిలోగా నేను జరి పించేస్తాను.''

"సమయం వచ్చినప్పుడు ఆలోచిద్దాం అమ్మా! ఇంక నువ్వెళ్ళి పడుకో"

సుషమ స్వరంలో ధ్వనించిన విశ్వా సాన్ని గమనించి తల్లి అంది "నువ్వు లేకపోతే నేను పిచ్చిదాన్ని అయిపోవలసి వస్తుంది తల్లీ"

సుషమ చీకట్లో నవ్వి అంది "నేనేం పారిపోవటం లేదుగా ఇంకెందుకు కంగారు పడతావు?''

తల్లి కాసేపు మౌనంగా వుండిపోయి మళ్ళీ అంది ''సుషమా నీకు తెలిసే వుంటుంది. అయినా చెబుతున్నాను. భటనాగర్ గారి అమ్మాయి రేణు గురించి నలుగురూ నాలుగు రకాలుగా అనుకుంటూ నవ్వు కుంటున్నారు"

"ఏం? ఎందుకు?"

"వాళ్లబ్బాయి పెళ్లిచేసుకుని వేరే కాపురం పెట్టేసుకున్నాడు. రేణు ఉద్యోగం చేస్తుందని కొంతకాలం వరకు అందరితో చెప్పారు. తరువాత తెలిసింది. ఆ పిల్ల ఎవరితోనో..." తల్లి ఒక్క క్షణం తడబడి మళ్ళీ సర్దుకుని పూర్తిచేసింది. "స్నేహం కుదిరిందట. అతని దగ్గర నుంచే డబ్బులుతెచ్చి ఇంట్లో ఇచ్చేస్తుంది"

"అలాగా!" సుషమ స్వరం నిరు త్సాహంగా ధ్వనించింది.

"రేణు బాబాయి ఇది తెలుసుకుని మంచి పడ్డాడు. భట్ నాగర్ గారు విని మౌనంగా వుండిపోయాడు. అంతకన్నా ఏం చేయ గలుగుతాడు? ప్లీడరీ పూర్తిగా పడి పోయింది. కుటుంబంగడిచే మార్గంలేదు"

సుషమ ఓ పక్కకు ఒత్తిగిలుతూ అంది "రేపు డబ్బు సంగతి గుర్తుచెయ్యి. లేకపోతే బ్యాంక్‌లోంచి డ్రా చెయ్యటం మర్చిపోతాను" ఆమె తల్లితో అంది.

తెల్లవారగానే ఇంట్లో హడావుడి మొద లైంది. భైరు హాస్టల్లోని మరో పనిమనిషిని తెచ్చి ఇల్లు శుభ్రంచేసి రకరకాల వంట

కాలు చేయటంలో నిమగ్నమైంది. తల్లి దగ్గరవుండి అన్నీ చేయిస్తోంది. వంట కార్యక్రమం ముగిసిన తరువాత నీరూకు ఏ చీర సింగారించాలన్న చర్చ ప్రారంభించింది తల్లి. సుషమ ఆలోచించి ఏదో చెప్పబోయేంతలో చ ప్రా సి వచ్చి హాస్టల్లో వుంటున్న ఓ స్టూ డెం ట్ తాలూకు తల్లి దండ్రులు తనకోసం ఎదురుచూస్తున్నారని చెప్పి వెళ్లాడు. సుషమ వాళ్లతో కలిసి మాట్లాడి రావటానికి వెంటనే అక్కడనుంచి లేచి వెళ్లింది. ప్రతి చిన్న విషయానికి ఇలా తర్జన భర్జనలు చేసే తల్లి అలవాటు సుషమకు నచ్చేదికాదు. ఉదయంనుంచీ ఇంట్లో ఏర్పాట్లు, కాలేజీ పనులుచేసి తలనొప్పిగా వుంది. దీనికి తగ్గట్టు తల్లి మాటలు నొప్పిని పరాకాష్ఠకు చేర్చాయి.

"అమ్మా నీరూకి ఈ చీర ఎవరిచ్చారు?" నీల్ ప్రజంట్ చేసిన చీర నీరూ ఒంటి మీద చూసి ఉండబట్టలేక అడిగేసింది సుషమ.

"నేనే ఇచ్చాను. ఏం? ఏమైంది?"

"రెండు వందల యాభై రూపాయల చీర అది. దానికేం తెలుసు. కాఫీనో టీనో ఒలకపోస్తే పాడైపోతుంది"

"నీ చెల్లెలేనా? లేకపోతే పరాయిదా?" తల్లి తీవ్రంగా అంది.

"తనవాళ్ళు, పరాయివాళ్ళు అన్న భేదం ఎందుకు? నేను సాధారణమైన సంగతి చెబుతున్నాను. బీ రు వా లో బోలెడు చీరలు వుండగా అదే దొరికిందా నీకు?"

"అవ్వ! అయితే ఏమైందే ఇప్పుడు. పాడైపోయినప్పుడు లాగేసుకుందువుగానిలే"

సుషమ కోపాన్ని అణగదొక్కుకుని ఆ రోజల్లా అలాగే వుంది. ఒక చౌకబారు చీర కట్టుకుంది. తల కూడా సరిగ్గా దువ్వుకోలేదు. తల్లి బతిమాలింది. కానీ సుషమ మొండిపట్టు వదల్లేదు.

"ఇదేం బుద్ధి నీకు అన్ని రోజుల్లో దర్జా, పండుగనాడు పస్తు అన్నట్టు? ఆ వచ్చినవాళ్ళు ఏమనుకుంటారు?ఒక మంచి చీర కట్టుకుందామన్న ఆలోచనైనా లేదా నీకు?"

"అపు అమ్మా! వాళ్ళు వస్తున్నది నన్ను చూడటానికి కాదు" సుషమ తీక్షణంగా అంది.

తల్లి రు స రు స లా డు తూ లోపలికెళ్ళిపోయింది. ఏకాగ్ర చిత్తంతో వంట పని చేస్తున్న భైరూని ఆమె అడిగింది "ఏం భైరూ! మీ అమ్మగారు రోజూ ఇలాగే వుంటుందా ఈసురోమంటూ?"

"లేదమ్మా మంచి మంచి బట్టలు కట్టుకుంటారు. బొమ్మలా అలంకరించుకుంటారు. ఆ మధ్య నీల్‌బాబుగారు చాలా చీరలు తెచ్చి ఇచ్చారు"

"అది సరే ఈ నీల్‌బాబు ఎవరు?"

తల్లి ప్రశ్నవిని భైరు కంగారుపడింది.

"నిన్న వచ్చారు కదా ఆయన!"

"తరచు వస్తుంటాడా?"

భైరు జవాబు చెప్పలేదు

"రోజూ వస్తుంటాడా?" తల్లి రెట్టించి అడిగింది. "లేదు. అప్పుడప్పుడు వచ్చి సంగతులు తెలుసుకుని వెళ్తుంటారు" భైరు అనేసి ఎలాగో ఆమె దృష్టి నుంచి తప్పించుకోజూచింది. తల్లి మరేమీ అడగలేదు.

పెళ్ళి సంబంధంవాళ్ళు వచ్చారు. అప్పటివరకు సుషమ మీద కోపంతో ఉడికిపోతున్న తల్లి సుషమ సహాధ్యాయినులు వచ్చి చేస్తున్న సహాయ కార్యక్రమాలు చూసి ప్రశాంతంగా మారి

పోయింది. మిసెస్‌ధర్ స్వయంగా నీరూని తయారుచేసి వాళ్ళముందు కూర్చోబెట్ట టమే కాక వాళ్ళతో పెళ్ళి కబుర్లు, లావా దేవీలు ఇచ్చుపుచ్చుకోవడాల గురించి మాట్లాడసాగింది. ఒక క్రమబద్ధంగా, అందంగా అలంకరించి వున్న సుషమ బంగ్లా, నౌకర్లు, చప్రాసీలు, లజ్జాభరితమై ముగ్ధమనోహరంగా వున్న నిరుపమ ముఖం చూసి వచ్చినవారు విపరీతంగా ప్రభా వితులయ్యారు.

కానీ నీరూ కంగారు పడుతూ కూచ్చుంది. వరుసగా వాళ్లు వేస్తున్న ప్రశ్నల పరంపర ఆ కంగారుని మరింత చేసింది.

ఒక ప్రశ్నకు జవాబు చెప్పలేదు. తల్లి కళ్ళతోనే కూతుర్ని గద్దించింది. టీ తాగు తున్నప్పుడు సుషమ, మీనాక్షి ఇద్దరూ బయటకు వచ్చారు. తల్లి "నా పెద్ద కూతురు" సుషమని గర్వంగా పరిచయం చేసింది. "ఈ బంగ్లా ఈ సంపద అంతా తనదే" తన తల్లి మాటలు విని అలసి పోయిన నవ్వు ఒకటి నవ్వి ఊరుకుంది సుషమ. ఈ సంపద ఎంత గొప్పదో-అంతే భయంకరమైనది. టీ కలిపి అందరి కిస్తూ ఆలోచించింది సుషమ. తన తల్లి, చెల్లెళ్ళు, తమ్ముళ్ళు అందరూ కలిసి తనకు చిన్నచిన్న సుఖాలు కూడా దక్క కుండా చేస్తున్నారు. చలికాలపు ఆ అంద మైన సాయంత్రం, గది నిండా పువ్వుల పరీమళం.. అది నీల్ వుండవలసిన స్థలం. వీళ్ళు ఇక్కడ వుంటే ఎవరికి ప్రయో జనం?

సుషమ ఒక కప్పులో టీ నింపి నీరూ చేతికి అందించింది. వణుకుతున్న చేతులతో నీరూ కప్పు అందుకోబోయింది. కానీ కప్పు జారిపోయింది. టీ మొత్తం చీర మీద ఒలికి పడింది. కప్పు, సాసర్ కింద పడి ముక్కలై పోయాయి.

నీరూ తడిసిన చీరను పట్టుకుని లేచి నిలబడింది. తల్లి నిశ్చేష్టురాలై చూస్తుండి పోయింది.మిసెస్ ధర్ నీరూని గదిలోంచి అవతలకుతీసుకెళ్లాక నవ్వలేక నవ్వేవిఫల ప్రయత్నం చేస్తూ ఆమె అంది "అమ్మా యికి సిగ్గు కొంచెం ఎక్కువ. పెద్దవాళ్ళ ముందు కూర్చోటానికి కంగారు పడు తోంది"

గదినిండా సంకోచం నిండిన నిశ్శబ్దం అలముకుంది. తల్లి మనసు ఏదో భయానికి లోనైంది.భోజనాలు ముగించుకు వెళ్తున్న అతిథుల్ని "మీరేం నిశ్చయిం చారు?" అడిగింది ఆమె.

"రేపు కబురు చేస్తాం?" పెళ్ళి కొడుకు తల్లి అంది.

తల్లి విహ్వలమైపోతూ వాళ్ళ ముఖ ముద్రల్నిబట్టి భావాన్ని తెలుసుకునే ప్రయత్నం చేసింది. మళ్లీ చిన్నగా నవ్వుతూ అంది "నీరూలాంటి పిల్లలు చాలా తక్కువమంది వుంటారు"

"అందంతోపాటు స్మార్ట్‌నెస్ కూడా వుండాలి" పెళ్ళి కొడుకు వదిన ధడాలున అనేసింది.

తల్లి నిరాశపడిపోయింది. ఆ నిరాశ సుషమ మీద కోపంగా మారింది వెంటనే.

"నువ్వు చీర దగ్గర నానా హంగామా చేసి నీరూ మూడ్ పాడుచేసేసావ్. వాళ్ళు నిన్ను చూసి ఏమనుకునివుంటారు? చేతులు, చెవులు ఖాళీ. చౌకబారు చీర కట్టుకుని కూర్చున్నావు. నీ హోదా కూడా చూపించి వుండవలసింది.ఇలాంటి సందర్భాల్లో అందరూ అరువు తెచ్చుకుని మరి తొడుక్కుంటారు. కానీ నువ్వు

మూర్ఖంగా వున్నవాటిని కూడా ధరించ లేదు. ఎవరిని ఉద్ధరించేసావు ఇలాచేసి

సుషమకు కోపం ఆగలేదు "నువ్వే నాకు ప్రపంచంలో వున్న అందాలన్నీ కొనిపెట్టావు. ఇహ నేను తొడుక్కోలేదు. నువ్వు ధరించావు మెళ్ళో ఇంత లావు సంకెల. వాళ్ళు చూసి ఆనందించి వుంటారు. చాలు" అంటున్నప్పుడు సుషమ కంఠం రుద్ధమైంది. కళ్ళ నిండుగా నీళ్ళు కమ్ముకుని రెండు పెద్ద పెద్ద బొట్లు చెంపలమీదుగా జారి ఒళ్ళో పడి ఇంకిపోయాయి.

తల్లి రెండు రోజులుగా ఉదాసీనంగా, మౌనంగా ఒక మూలన ముడుచుకుని వుండిపోయింది. నీరూ, సుషమా ఆమె నుంచి తప్పించుకుని తిరగసాగారు. తల్లికి నీరూ అందమ్మీద చాలా నమ్మకముంది. కేవలం ఇచ్చి పుచ్చుకోవడాల దగ్గర ఇద్దరికీ కుదరలేదు. దాన్ని భరించలేకుండా వుందామె.

సుషమ హాస్టల్ తాలూకు పుస్తకాలు చూస్తూ కూర్చుని వుంది. తల్లి లేచి వచ్చి అంది "నేను నీ దగ్గర ఎన్నాళ్ళ నుంచో నీరూ పెళ్ళి గురించి మొత్తుకుంటు న్నాను.నువ్వెప్పుడూ ఆ సంగతి పట్టించు కున్న పాపాన పోలేదు. ఇవాళ నా దగ్గర పది వేలుంటే నీరూ పెళ్ళి నిమి పాలమీద జరిపించి వుండేదాన్ని"

సుషమ మాట్లాడకుండా తన పనిలో నిమగ్నమైపోయి వుండటం చూసి పెద్ద నిట్టూర్పు విడుస్తూ మళ్ళీ అందామె "భగ వంతుడా! ఈ ఆడపిల్లల్ని గట్టెక్కించే దారి ఏది లేదా? ఎలాంటి శని ఘడియల్లో పుట్టుకొచ్చారో వీళ్ళు"

సుషమ పుస్తకం పేజీ తిప్పుతూ అంది "నువ్వు ఏడుస్తూ కూర్చుంటే ఏమిటి ప్రయోజనం? చెప్పాను కదా సమయం వచ్చి నీరూ పెళ్ళి దానంతట అదే అయిపోతుంది. ఇవ్వాళ కాకుంటే రేపు"

కొంగుతో కన్నీళ్ళు తుడుచుకుంటూ తల్లి మళ్ళీ అందుకుంది "నీకంటే అన్నీ వున్నాయి. ఉద్యోగం, బంగ్లా, హోదా, కానీ వాళ్ళు...వాళ్ళిద్దరూ ఒకింటి వాళ్ళై సుఖంగా జీవితాలు గడుపుకుంటే నా దుఃఖం తీరుతుంది"

సుషమ గొంతు అంతటా ఒకేసారి చేదు నిండిపోయింది. "ఇప్పుడు పడరాని కష్టాలెవరు పడిపోతున్నారని? పస్తులుం డటం లేదు. చింకి పాతలు కట్టుకోవటం లేదు. నేను అవివాహితగా ఎలాగూ మిగిలిపోవలసిందే. నేను అలావుండిపోయి నంత మాత్రాన కొంపలంటుకుపోవు. కానీ వాళ్ళిద్దరినీ అలా వుంచను?"

తల్లి స్వరం మళ్ళీ రుద్ధమైంది. "అంటే నీ గురించి నేను ఆలోచించటం లేదనేగా నువ్వు మాత్రం నా కూతురివి కావా? నీకన్నీ వున్నాయి. వాళ్ళకు ఏదీలేదు అనే నా బాధ. నా బాధ నీతో కాక మరెవరితో చెప్పుకోవాలి?"

"ఒక్కసారి నీ అంతరంగంలోకి చూడు. నాగురించి ఏనాడైనా ఆలో చించావా నువ్వు. నేను హాయిగా వున్నా చూచి ఓర్చుకోలేవు నువ్వు. నీరూ పెళ్ళి ఖాయపచ్చు. నేను నా బట్టలు, నగలు, సామానులు అన్నీ ఇచ్చేస్తాను: అదేకదా నువ్వు కోరుకునేది."

"నీకు..." తల్లి ఏడ్చేస్తూ అంది. "నీకు ఏమైనా అనే అధికారం వుంది. నీ తల్లి తండ్రి,అసమర్థులుగా మిగిలిపోయాం. నీకోసం ఏదీ చేయలేకపోయాం."

సుషమ భిన్నురాలై అక్కడనుంచి లేచి కాలేజీకి వెళ్ళటానికి తయారైంది. తను చాలా కఠినంగా తల్లిని బాధ పెట్టింది. తనూ వివశత్వంలో వుంది. ఇంకేం చేస్తుంది. తమ ఇద్దరి మధ్య పరస్పరం ప్రేమ లేక కాదు.

సుషమకు ఊబిలోకి దిగబడిపోతున్నట్టు అనిపించింది. బయట పడదామని చూస్తోంది. కానీ రోజు రోజుకీ మరీ లోపలకు వెళ్ళిపోతోంది. సుషమ అలా లోలోపల కాలిపోతూ అలంకరణ మొదలు పెట్టింది. అవతల కాలేజీ టైం అయిపోతోంది. చకచక కొప్పు సరిచేసుకుని పిన్నులు గుచ్చబోయి ఒక పిన్ను చేతిలో గుచ్చుకుంది. ఆ ఆత్మ హింసతో సుషమకు ఒక రకమైన సాంత్వనం లభించింది. అప్పుడే కర్టెన్ తొలగించుకుని నీరూ లోపలకు తొంగి చూచింది.

"అక్కా ! భైరు భోంచేయకుండా బయటకు వెళ్ళవద్దని నీతో చెప్పమన్నది" కర్టెన్ పట్టుకుని నిలబడి అమాయకంగా తనవైపే చూస్తున్న చెల్లెల్ని చూసి సుషమ కరిగిపోయింది. ఆమె హృదయంలో అంతవరకున్న ద్వేషం పోయి హటాత్తుగా మమకారంతో నిండిపోయింది. నీరూని దగ్గరకు తీసుకుని గుండెలకేసి హత్తుకుందామనిపించింది. "పిచ్చిపిల్లా! నువ్వెందుకు భయపడతావు. నీ భవిష్యత్తు గురించి పూర్తి బాధ్యత నేను స్వీకరిస్తాను. నీ జీవితాన్ని స్వర్గంగా తీర్చిదిద్దుతాను. దిగులుపడకు" అని చెప్పాలనిపించింది.

సుషమ మరో వైపుకు తిరిగి హాండ్ బ్యాగ్ సర్దుకుంటూ "నీరూ! నువ్వెళ్ళి భోజనం రడీ చేయమంటున్నానని చెప్పు. నేనిప్పుడే వస్తాను" అంది.

సాయంత్రం సుషమ కాలేజీ నుంచి తిరిగొచ్చే వేళకి తల్లి కొంచెం ప్రశాంతంగానే కూర్చుని కనిపించింది. బట్టలు మార్చుకుని బయటకు వచ్చిన సుషమతో ఆమె "నువ్వు వెళ్ళిన కాసేపటికి మిసెస్ ధర్ వచ్చి చాలా సేపు కూర్చుని వెళ్ళింది" అని చెప్పింది.

"అలాగా"

కొద్ది క్షణాలు ఆలోచించిన మీదట అసలు విషయం ఎత్తుకుంది తల్లి. "ఆ రోజు నీ కోసం వచ్చిన అబ్బాయితో నీరూ పెళ్ళి జరిగే అవకాశం వుంటుందా?" ఆమె సుషమ ముఖంలో వస్తున్న మార్పుల్ని గమనిస్తూ అందామె-

"ఇంకా ఆ అబ్బాయి పెళ్ళి నిశ్చయం కాలేదు కదా?"

"నాకేం తెలుసు అమ్మా"

"నువ్వు అడిగిచూడు"

"నేనెలా అడగగలను" సుషమ బాధను అణుచుకుంటూ "నీల్! నా చెల్లినట పెళ్ళి చేసుకుంటావా?" తన గుండెల్లో ప్రతిష్టించుకుని వున్న నీల్‌తో అడిగింది. తల్లి వెంటనే కాగితం, కలం తీసుకుని కృష్ణమ్మ పేర ఉత్తరం రాయసాగింది. కాగితం కవర్లో వుంచి అతికిస్తూ ఆమె భైరూని కేకేసింది. సుషమ చేతిలో పుస్తకం తెరుచుకుని వుంది. కానీ ఒక్క వాక్యం కూడా చదివే స్థితిలో లేదు. భైరూ గదిలోకి వచ్చింది. తల్లి ఉత్తరం భైరూకి అందిస్తుండగా సుషమ హటాత్తు ముందుకొచ్చి "నా కివ్వు నేను పోస్ట్ చేస్తాను" అని తల్లి చేతిలోంచి ఉత్తరం అందుకుని బయటకు వెళ్ళిపోయింది.

ఆమె ఆఫీసుకొచ్చాక అనేకసార్లు ఉత్తరాన్ని అటు, ఇటు తిప్పి చూచింది. వెంటనే దాన్ని ముక్కలు ముక్కలుగా చించి కిటికీలోంచి బయటకు విసిరి కొట్టింది.

*     *     *

వేసవికాలపు మధ్యాహ్నం. ఎండ ఉదాసీనంగా వుంది. ఉండి ఉండి వీచే గాలి విసురుకి రోడ్డు మీది దుమ్ము తాడెత్తున లేచి పడుతోంది. బస్టాండ్ దగ్గర నిలబడి కొందరు స్టూడెంట్లువిగ్గరగా కబుర్లు చెప్పుకుంటున్నారు. స్టాఫ్‌రూంలో ముగ్గురు టీచర్స్ కూచ్చుని వున్నారు. మధ్యలో ఒక అవర్ లేకపోవటంతో పిచ్చాపాటీ మాట్లాడేసుకుంటున్నారు.

మిసెస్ రాయ్ చౌదరి పత్రిక పేజీలు తిరగేస్తూ అంది "బూనీ పెళ్ళి అయి నప్పటి నుంచి ఇల్లు మరీ బావురు మంటోంది. అంత పెద్ద ఇంట్లో ఒక్క దాన్నే వుండాలంటే బోర్‌గా వుంది."

"మీరు అనవసరంగా అక్కడ వుంటు న్నారు. ఆ ఇల్లు అద్దెకిచ్చి ఇక్కడికి వచ్చేయండి" మిస్ శాస్త్రి అంది.

"ఇక్కడకెలా రాగలను? ఒక్క క్వార్టర్ కూడా ఖాళీగా లేదు" మిసెస్ రాయ్ చౌదరి అమాయకంగా అనేసింది.

"మిమ్మల్ని క్వార్టర్స్‌లో వుండమని ఎవరంటున్నారు. వార్డెన్ బంగ్లాలో దిగండి" మిస్ శాస్త్రి అదోరకంగా నవ్వుతూ అంది.



"మరి సుషమ...?" మిసెస్ రాయ్ చౌదరి అడిగింది. మిస్ శాస్త్రి ఒక కొత్త విషయానికి నాంది వాచకం పలికింది. రోమా డేవిడ్ ఇదేం పట్టించుకోనట్టు కాలేజీ నోట్స్ రాసుకుంటోంది. మళ్ళీ ఏమనుకుందో తల ఎత్తి చూస్తూ అంది. "సుషమ వార్డెన్‌షిప్‌లో ఇంకో రెండేళ్ళ వరకు ఉంటుంది"

"రెండేళ్ళ సర్వీస్‌ని రెండు రోజుల్లోకి కుదించగలను నేను" మిస్ శాస్త్రి చిటికెలు వేస్తూ అంది "ప్రిన్స్‌పాల్ దగ్గరకు ఒక రిపోర్ట్ పంపితే చాలు. ఉద్యోగం తీయించటం కష్టంకాదు. వార్డెన్‌షిప్ ఏముంది అవిశ్వాస తీర్మానం మీద తొలగించేయవచ్చు"

"అలాంటి పనులు చేయటం నావల్ల కాదు" మిసెస్ రాయ్ చౌదరి నిశ్చయంగా అంది.

'మీరూ, మేము ఏం చేయనవసరం లేకుండానే అంతా జరిపించేయవచ్చు. ఓ నలుగురు స్టూడెంట్ల చేత నాలుగు రిపోర్టులు 'సుషమ వార్డెన్ పదవికి అనర్హురాలు. ఆమె నైతిక ప్రవర్తన ఏమంత బాగు లేదు' అని రాయించి పంపిస్తే సరి. అప్పుడు అవి చూసుకుని ప్రిన్స్‌పాల్ మనల్ని పిలిచి మీటింగ్ వేస్తుంది. ఎందుకంటే మనమూ ఇక్కడే వుంటున్నాం గనుక. అప్పుడు మనం చెప్పేద్దాం, అబద్ధమేమీ కాదు చూసిందే చెబుతాం"

గాలి విసురుకి ఎండుటాకులు గలగలమని శబ్దం చేస్తూ పక్షుల్లా పైకి లేచాయి. మిసెస్ రాయ్ చౌదరి విధవరాలు. ఉన్న ఒక్క కూతురు 'బూనీ' పెళ్ళి చేసి ఈమధ్య మరీ ఒంటరిదైపోయింది. ఆమె మనసులో లెక్కలు వేసుకుంటూ ఆలోచిస్తోంది. ఇల్లు అద్దెకిచ్చేస్తే కనీసం వంద రూపాయలు వస్తాయి. తను ఇక్కడికి వచ్చేస్తే ఇంటితో పాటు వంద రూపాయలు అదనంగా అలవెన్సు ఇస్తారు. భోజనం తనే చేసుకుంటుంది. చిల్లర పనులుంటే ఇక్కడి పనిమనుషులు, ప్యూన్లు, ప్రాసీలు చేసి పెడతారు. కాబట్టి అన్ని రకాలుగా ఇక్కడికి వచ్చేయటమే లాభదాయకంగా కనిపించింది.

మిస్ శాస్త్రి మరో రకంగా ఆలోచిస్తోంది. ఈరకంగానైనా సుషమ మీద తన పగ తీర్చుకోవచ్చు. ముందీవిషయం సుషమకు తెలుస్తుంది. తరువాత కేస్ గవర్నింగ్ బాడీ వరకు వెళుతుంది. నలుగురిలో సుషమ పరువుపోయి తీరుతుంది. తను ఇంత సహాయం చేసినందుకు రాయ్‌చౌదరి తనకు తప్పకుండా లొంగి వుంటుంది. వీలైతే తనూ మిసెస్ చౌదరితో పాటు వార్డెన్ బంగ్లాలోకి మకాం మార్చేస్తుంది. ఆవిడ ఒక్కతే వుంటుంది కాబట్టి పెద్దగా ఇబ్బంది వుండదు.

"కానీ నేను ఎప్పుడూ చూడలేదు" రోమా అంది. "నువ్వా రసిక శిఖామణివే కదా. అంత తీరిక నీకు ఎక్కడనుంచి వస్తుంది" మిస్ శాస్త్రి లోలోపల అనేసుకుని పైకి మాత్రం "నువ్వు ఎప్పుడు చూడదల్చుకుంటే అప్పుడు చూపిస్తాను. అతడు రోజూ వస్తుంటాడు. నిన్నటివరకు తల్లి ఉంది కాబట్టి రాలేదు. ఉదయమే ఆవిడ వెళ్ళిపోయింది. ఈ రోజు రాత్రికి రానే వస్తాడు 'రాజకుమారుడు'. చూడాలనే కుతూహలం వుంటే నాతో రా చూపిస్తాను"

అవుననాలో, కాదనాలో తెలియక సంకోచిస్తూ మాట్లాడలేకపోయింది రోమా.

అప్పుడే మిసెస్ పూరి తన భారీ శరీరాన్ని మోసుకుంటూ లోపలకు వచ్చింది. "ఏదో చర్చ జరుగుతున్నట్లుందే?" అడిగింది

"అదే సుషమ విషయం రోమా... సుషమ తన పనిమనిషికి ఎంత ట్రైనింగిచ్చిందంటే వెధవది మనం ఎంత గింజుకున్నా నోరు విప్పదు. ఇహ మీనాక్షి సుషమ పేరు ఎత్తితే చాలు ఉగ్రరూపం దాల్చేస్తుంది."

"కానీ ఆ అబ్బాయి చాలా మంచివాడట. అందరూ చెప్పుకుంటున్నారు'' మిసెస్ పూరి అంది.

''ఫ్రీగా సినిమాలు చూపించేవాడు, కావలసినవన్నీ కొని పెట్టేవాడు, కార్లలో షికార్లు తిప్పేవాడు ఎలాంటివాడైనా మంచిగానే కనిపిస్తాడు" మిస్ శాస్త్రి చేదు స్వరంతో అంది.

బెల్లు మోగింది. కాసేపట్లో స్టాఫ్ రూం టీచర్స్‌తో నిండిపోయింది. ఎవరో అడిగారు "మీ డియరెస్ట్ కులాసాగా ఉందా మిస్ శాస్త్రి."

"నిన్న రాత్రంతా ఎటుపోయిందో మరి పొద్దునే వచ్చింది. కట్టిపడేశాను. జలుబు చేసి ముక్కుల్లోంచి ఊరికే నీళ్ళు కార్చుకుంటోంది'' మిస్ శాస్త్రి చెప్పింది.

"పిల్లులకు కూడా జలుబు చేస్తుందా?" ఆశ్చర్యంగా అడిగింది ఓ టీచర్. మీనాక్షి రిజిష్టరు టేబుల్ మీద వుంచుతూ బేరర్ని కేకేసి కాఫీ తెమ్మని చెప్పింది. వెంటనే అందరి వైపు చూస్తూ పరిహాసంగా అంది "కప్పలకే పడిసెం పడుతుండగా లేనిది డియరెస్ట్‌కు జలుబు చేస్తే ఆశ్చర్యం ఏముంది? మిస్ దుర్గా శాస్త్రీ! నా మాట విని దానికో పెగ్గు బ్రాందీ పట్టించండి"

మిస్‌శాస్త్రి ఉడుక్కుంటూ కోపంగా అంది ''వేళాపాళా లేని పరాచకాలు నాకు గిట్టవు మీనాక్షి! కాస్త గంభీరంగా మాట్లాడ్డం నేర్చుకో!"

మిసెస్ ధర్ మధ్యలో కల్పించుకుంటూ అంది "పోనివ్వండి ఇంత చిన్న చిన్న విషయాల దగ్గర గొడవలెందుకు''

మిస్ శాస్త్రి మీనాక్షి వైపు గుర్రుగా చూస్తుండిపోయింది. మళ్ళీ తన వంకర బుద్ధిని అదుపులో పెట్టుకోలేక ''ఆవిడా, ఆవిడ ఫ్రెండు ఎవరినీ ఖాతర్ చేసే స్థితిలో లేరులెండి'' అన్నది.

"చూడండి మిస్ శాస్త్రీ! ఇక్కడ తీరిగ్గా కూర్చుని ప్రతి ఒక్కరినీ విమర్శించే అధికారం ఎవరిచ్చారు మీకు?" మీనాక్షి తీవ్రంగా అంది.

అప్పుడే సుషమ హడావుడిగా స్టాఫ్ రూంలోకొచ్చి తన బీరువాలో దేనికోసమో వెదకసాగింది. పుస్తకాల బండిల్ తీసుకుని వెనుతిరిగి ఒక్క క్షణం అక్కడే నిలబడి అంది "నిన్న రాత్రల్లా డియరెస్ట్ నా సోఫామీద పడుకుని అలాగే వుండిపోయింది. మా అమ్మ బయటకు తోలబోతుంటే నేనే వారించాను. మీ దగ్గరకు చేరింది కదా ఉదయం?"

"వచ్చింది" మిస్ శాస్త్రి వంకరగానే సమాధానమిచ్చింది. మీనాక్షి కాఫీ వచ్చేవరకు ఆగలేదు. సుషమ వెంట బయటికి వెళ్ళిపోయింది.

తన కొలీగ్స్ తన వెనుక రచిస్తున్న పద్మవ్యూహాన్ని గురించి సుషమకు తెలియదు. తల్లి వెళ్ళిపోయిన తరువాత ఆమె నిస్సత్తువగా మారిపోయింది. కనీసం బట్టలు మార్చుకునే ఓపిక కూడా లేక అలాగే మంచమ్మీద పడివుంది. మాటిమాటికీ

తల్లి వెళ్తూ వెళ్తూ చెప్పి వెళ్ళిన మాటలు చెవుల్లో గింగురుమంటున్నాయి. "సుషమా నువ్వు చిన్నపిల్లవు కాదు. నీ గురించి మరొకరు ఏదో అనేసుకునే అవకాశం ఎప్పుడూ కల్గించకు. నీ పరువుతోపాటు మా అందరి పరువు కూడా నీ మీదే ఆధారపడి వుంది..." తల్లి నీల్ పేరు ఎత్తలేదు కానీ ఆవిడ ఇవన్నీ నీల్‌ని దృష్టిలో పెట్టుకునే చెప్పిందని స్పష్టంగా తెలిసిపోతోంది. నీల్ గురించి ఆవిడకేం తెలుసు? ఎంత మంచివాడు నీల్?

అలా ఆలోచిస్తూ ఎంతసేపు పడుకుని వుందో సుషమకు అంచనా లేదు. ఇంతలో భైరు వచ్చి నీల్ బాబుగారు వచ్చారని చెప్పింది. సుషమ ఉలిక్కిపడి లేచి కూర్చుంది. డ్రెస్సింగ్ టేబుల్ అద్దంలో తన ప్రతిబింబాన్ని ఒక్కసారి చూసుకుంది. వాడిపోయి చిన్నదైపోయిన ముఖం, విపరీతంగా నలిగిపోయి వున్న కాటన్ బ్లౌజ్, చీర; చిందర వందరగా చెదిరిపోయి వున్న జుత్తు పిశాచంలా వున్నాననుకుంది సుషమ. ఈ రూపంలో తనని చూసి నీల్ కంగారు పడిపోతాడు అనుకుంటూ బాత్‌రూంలో కెళ్దామనుకుంటూ పాదాలను గబుక్కున స్లిప్పర్స్‌లోకి దూర్చుకో సాగింది. కానీ అంతలోనే నీల్ బయట నుంచి 'నేను వస్తున్నాను' అంటూ కర్టెన్ తొలగించుకుని లోపలకు రాబోతూ గుమ్మంలోనే ఆగిపోయాడు.

"సుషమా! ఒంట్లో బాగోలేదా? ఏమిటలా వున్నావు?" కంగారు పడుతూ అడిగాడు.

"లేదు నీల్! అలసటగా వుంటే నిద్రపోయాను. నువ్వు కూర్చో ఇప్పుడే వస్తాను" అని చెప్పి సుషమ టవల్ అందుకుని బాత్‌రూంవైపు వెళ్ళిపోయింది.

పది నిమిషాలు గడిచాయి. భైరుని టీ తెమ్మని కేకేసి సుషమ లోపలకు వచ్చింది. క్షణం క్రితం నలిగి వాడిపోయిన పువ్వులా వున్న సుషమ ఇప్పుడు అప్పుడే వికసించిన గులాబీలా కనిపించింది. నీల్ అలాగే చూస్తూ అన్నాడు "ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా కనిపిస్తావు సుషమా"

వదులుగా వున్న జుత్తులోంచి చెంపల మీదికి జారిన పాయను సరిచేసుకుంటూ నవ్వేసింది సుషమ. భైరు కాఫీ తెచ్చి ఇద్దరికీ అందించింది. సుషమ కాఫీ తాగేసి కప్పు టేబుల్ మీద పెట్టి వచ్చి నీల్ పక్కన కూర్చుంది. నీల్ ఆమె మెడలో వేలాడుతున్న బారాటి చైన్‌లో తలదూర్చే ప్రయత్నం చేయసాగాడు. సుషమ వారిస్తున్నా నీల్ వినలేదు.

సుషమ ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు నీల్ "సుషమా ఎందుకీరోజు చాలా ఉదాసీనంగా కనిపిస్తున్నావు?" ఆమె కనురెప్పలు చేపపిల్లలా టప టప కొట్టుకున్నాయి.

"అప్పుడప్పుడు నాకు తెలియకుండానే మనసు దానంతట అదే ఉదాసీనమైపోతుంది" సుషమ చిన్నగా నవ్వుతూ అంది.

కాసేపట్లో నీల్ వెళ్ళిపోతాడు. మళ్ళీ తను ఒంటరిదైపోతుందన్న సంగతి ఓ పక్క గుచ్చుకుంటున్నా సుషమ ఆ క్షణం అన్నీ మార్చిపోయి నీల్ స్పర్శలో మునిగిపోయే ప్రయత్నం చేయసాగింది. నీల్ ఒక కవచంలా ఆమెను అనేక నిత్యజీవిత సమస్యల, దుఃఖాల, హింసల నుంచి కాపాడుతున్నాడు. నీల్ వున్నంత




సేపు జీవితం పరిపూర్ణంగా, నిండుగా కనిపిస్తుంది. సుషమ నీల్ కౌగిల్లోకి ఇంకా దగరగా ఒదిగిపోతూ అనుకుంది.

గదిలో కేవలం బెడ్‌లైట్ వెలుగుతోంది. సుషమ అపూర్వమైన తన్మయత్వంలో కొట్టుకుపోతోంది. కళ్ళ ముందు ఓ అద్భుతమైన జీవిత చిత్రం పరుచుకుని వుంది. సుషమ నీల్ చెయ్యి పట్టుకుని నడుస్తూ తన భవిష్యత్ జీవితపు అందచందాల్ని చూసి తనే మురిసిపోతోంది.

"అమ్మగారు... అమ్మగారు..." దగ్గరగా వేసివున్న కిటికీ తలుపులమీద చిన్నగా శబ్దం చేస్తూ భైరు కంగారుగా సుషమని పిలిచింది. సుషమ ఉలికిపాటుతో నీల్ నుంచి దూరంగా జరిగింది. ఎవరో తనని ఆనంద సాగరంలోంచి నిర్దయగా ఈడ్చి నేలకు విసిరికొట్టినట్టు అనిపించింది. సుషమ వెంటనే లేచి నిలబడింది.

"ఏమైంది భైరూ? లోపలకురా!" ఆమె భారమైన కంఠంతో అంది. దభాలున తలుపు తెరుచుకుంది. భైరు లోపలకువచ్చి ఏమిటో చెప్పకుండా దొడ్డి గుమ్మం వైపున్న తలుపులవైపు సంజ్ఞ చేసింది. అటునుంచి మిస్ శాస్త్రి లోపలకు వస్తూ కనిపించింది. ఆవిడ వెనకే మరి కొందరు కొలీగ్స్ వున్నారు. వాళ్ళని చూసి సుషమ నిలబడ్డ చోటనే గడ్డకట్టుకుని పోయినట్టు హతాశురాలై పోయింది. అటు వెంటనే స్పృహలోకి వస్తూ "అరె మీరా ఇలా దొడ్డిగుమ్మంలోంచి వచ్చే శ్రమ ఎందుకు? ముందు తలుపుల్లోంచి రావచ్చుగా?" సుషమ వాళ్ళని లోపలకు ఆహ్వానిస్తూ అంది.

"ముందు తలుపులు మూసివున్నాయి వెనక నుంచి వెళ్తే ఏమౌతుందని వచ్చేసాం" మిసెస్ అగర్‌వాల్ వెకిలిగా నవ్వుతూ అంది.

అందరూ లోపలకు వచ్చారు. అందరి దృష్టి ఒకేసారి నీల్ మీద పడింది. నీల్ సోఫాలో కూర్చుని ఏదో పత్రిక పేజీలు తిరగవేస్తున్నాడు.

"వీరు నీల్" సుషమ తన శరీరం, మనసు ఒక్కసారిగా విద్యుత్ ఘాతానికి లోనైనట్టు కంపిస్తూ అంది. "నీల్! వీళ్లు నా కొలీగ్స్ మిసెస్ రాయ్‌చౌదరి, మిసెస్ అగర్‌వాల్, మిస్ శాస్త్రి...!" నీల్ వాళ్ళకు నమస్కరించాడు.

"ఇక నేను వెళ్తాను...సుషమా" చేతిలో వున్న పత్రిక మూసి లేచి నిలబడ్డాడు నీల్.

"మేం రాగానే మీరు వెళ్ళిపోతే సుషమ మమ్మల్ని క్షమించదు" రోమా నీల్‌తో అంది. కానీ నీల్ కుర్చీమీద పడివున్న కోటు అందుకుని అందరికీ మరోసారి నమస్కరిస్తూ వెళ్ళిపోయాడు. వెళ్తూ, వెళ్తూ ఒక్కక్షణం సుషమవైపు చూశాడు. ఇద్దరి చూపులు కలుసుకున్నాయి. ఆ ఒక్క చూపు సుషమకు వేయి ఏనుగుల బలాన్నిచ్చింది. సుషమ వచ్చి వాళ్ళ దగ్గర కూర్చోబోతుండగా రోమా అంది "ఇవాళ చాలా డల్‌గా వున్నట్టున్నారు. మేం వచ్చి డిస్టర్బ్ చేసామా?"

సుషమ లోపల చెలరేగుతున్న బాధను అణచుకుంటూ స్వరాన్ని మామూలుగా మార్చుకునే ప్రయత్నం చేస్తూ అంది "నా గురించి అంత చింతవున్నవారైతే ముందే కబురు చేసి కనుక్కుని రావలసింది. వచ్చేశారు ఇక కాసేపు హాయిగా

కూర్చోండి"

"ఈ నీల్ మీ బంధువా ?" మిసెస్ అగర్వాల్ అడిగింది. సుషమ తలమీద పిడుగు పడినట్టు అనిపించింది. వాళ్లు ఆ సమయంలో హటాత్తుగా దొడ్డిగుమ్మం లోంచి ఎందుకొచ్చారో అర్థమైంది.

"కాదు?"

"ఏదో కలసి వెళ్దామని వచ్చిన ఫ్రెండ్ అయివుంటారు" మిసెస్ అగర్వాల్ అంది.

"అవును"

"ఏం చేస్తున్నారు ?"

"ఏదో ఒకటి చేస్తుండేవుంటాడు"

వాతావరణంలోని టెన్షన్‌ని తగ్గించా ననుకుంటూ ఒక పెద్ద కృత్రిమమైన నవ్వుని బరస్ట్ చేసి అంది "ఎవరేం చేసుకుంటే మనకెందుకు నాకు ఒక్క కూతురు వుండేది. దాని పెళ్ళి అయ్యే పోయింది. సుషమా ! నీ బంగ్లా మాకు చూపించరాదు ఒక్కసారి. అంపరూ చాలా మెచ్చుకుంటూవుంటారు చాలా బావుందని"

"రండి" సుషమ లేచి నిలబడింది. "ఇది నా బెడ్‌రూం, ఇది డైనింగ్ రూం, ఇది డ్రాయింగ్ రూం..."

సుషమ మంచమ్మీద గులాబీరంగు బెడ్ షీట్ పరిచింది. అదే రంగులోవున్న టేబులు క్లాత్ తీసి టేబులు మీద పరిచింది. డ్రెసింగ్ టేబుల్‌పై భాగాన ఎలక్ట్రిక్ బల్బు అమర్చివుంది. వెండి పౌడర్ కేస్, క్రీం సీసాలు పెట్టి వున్నాయి. ఇల్లు సాధ్యమైనంత నీట్‌గా అందంగా కనిపించింది.

భైరు డైనింగ్ టేబుల్ మీద టిఫిన్, టీ ఫ్లాస్క్ తెచ్చి పెట్టింది. వాళ్ళని చూసి భైరు హృదయం మండింది. తను నీల్ కోసం భోజనం చేసి వుంచింది. వీళ్ళు శనిగ్రహాల్లా అడ్డు పడ్డారు. కేవలం ఒక కప్పు కాఫీ మాత్రమే తాగివెళ్ళాడు నీల్.

సుషమ పెదవులు నవ్వుతున్నాయి. కళ్ళు కర్కశంగా వున్నాయి.

"నీ చీర చాలా అందంగా వుంది" రోమా అడిగింది "కొత్తదా?"

"అవును. ఉదయం కట్టుకున్నాను. నలిగిపోయింది. అమ్మ వెళ్ళాక బట్టలు మార్చుకునే ఓపికకూడా నాలో మిగల్లేదు. మార్చుకోలేదు అందుకే" సుషమ తన అస్తవ్యస్థమైన బట్టలగురించికూడా వీళ్ళకు సంజాయిషీ చెప్పుకోవలసి వచ్చేట్టుంది అనుకుని ఉగ్గురాలైంది. లేకపోతే తను అదే చీర కట్టుకుని కాలేజీలో వుండగా రోమా చూసింది. కానీ ఇప్పుడేచూచినట్టు అడుగుతోంది. సుషమ పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

ఇంట్లోని ప్రతి వస్తువుని గుచ్చి గుచ్చి చూసి, ఒక్కో దాన్ని గురించి వందల ప్రశ్నలు వేసి ఆరాలు కూపీలు లాగి వాళ్ళు వెళ్ళిపోయాక సుషమ నిర్జీవంగా మంచమ్మీద కూలిపోయింది.

* * *

సుషమ కనిపించగానే తాగుతున్న సిగరెట్ దూరంగా విసిరేసాడు నీల్. తను కనిపించగానే పాలపుంతలా వెలిగిపోయిన నీల్ ముఖం చూచి సుషమ హృదయం తేలిక పడింది. అదే రోజు క్రాఫ్ చేయించుకున్నట్టున్నాడు మరీ చిన్న పిల్లాడిలా కనిపించాడు. సినిమా హాలు దగ్గర జనం రష్‌గా వున్నారు. టిక్కట్ల కోసం కుమ్ములాడుకుంటున్నారు. అందరినీ గమనిస్తూ పరిచయస్తులు ఎవరైనా కనిపిస్తారేమోనని సుషమ కంగారు పడసాగింది. ఎందుకో ఆరోజు నీల్ వెంట

వుండాలన్నా సంకోచంగా అనిపించింది. సెల్ఫ్ కాన్షస్‌నెస్ అధికమైంది.

న్యూస్‌రీల్ నడుస్తోంది. ఇద్దరూ వెళ్ళి లోపల కూర్చున్నారు. నీల్ కొద్దిగా సుషమ మీదకు ఒంగుతూ అడిగాడు "ఆ ముసలి గద్దలు నిన్ను చాలా హింసించి వుంటారు అవునా?"

"లేదులే"

"నామూలంగా నువ్వు వాళ్ళకి సంజాయిషీ చెప్పుకుని సిగ్గుపడవలసి వచ్చింది" నీల్ స్వరంలో భారీ పశ్చాత్తాపం కనిపించింది. సుషమ కళ్ళు హఠాత్తుగా కన్నీళ్ళతో నిండిపోయాయి. నీల్ పెద్దగా నిట్టూర్చాడు. సుషమ నీల్‌కు కనిపించకుండా కళ్ళు తుడిచేసుకుంది. నీల్ ముఖం గంభీరంగా మారిపోతుండగా అన్నాడు "సుషమా! నువ్వు వద్దని వారిస్తున్నా నేను వచ్చి నిన్ను ఇబ్బంది పెట్టి నలుగురి ముందు అవమానపడేలా చేస్తున్నాను. నీమీద అభాండ పర్వతాలు బద్దలవటానికి కారణం నేనే. ఈ దోషిని క్షమించు"

సుషమకు నీల్ మానసిక స్థితి అర్థమైంది. ఆమె చీకట్లోనే నీల్ కళ్ళల్లోకి చూస్తూ అంది "పిచ్చి పిల్లాడిలా ఎందుకు మాట్లాడతావు? దోషం నీ ఒక్కడిదే ఎలా అవుతుంది?" తరువాత సుషమ మాట్లాడలేకపోయింది. ఎందుకంటే మధ్యలోనే ఆమె స్వరం రుద్ధమవబోతున్నట్టు కనిపించి ఆగిపోయింది.

ఇద్దరూ ఏకాగ్రతతో సినిమాచూడటం లేదు. కళ్ళు తెరమీద వున్నాయి. మనసు ఎక్కడో తిరుగుతోంది.

"సినిమా ఎలా వుంది నీకు?" నీల్ విసుగ్గా అడిగాడు.

"చెత్త. ఇంటర్వెల్ అవగానే వెళ్ళిపోదాం".

కాసేపట్లో బెల్లుతో పాటు హాల్లో లైట్లు వెలిగాయి. సుషమ సినిమా హాల్లోంచి బయటకు చూస్తూ చుట్టూ గమనించి చూచింది. మెట్లు దిగుతుండగా చెప్పింది "ఇద్దరు స్టూడెంట్లు పర్మిషన్ లేకుండానే పిక్చర్ చూసేస్తున్నారు"

"అలాగా— దొంగలు దొరికిపోయారన్నమాట పాపం" నీల్ అన్నాడు.

"మళ్ళీ పాపం ఎందుకు!" సుషమ అంది.

ఇద్దరు రోడ్డు మీదకు వచ్చేసారు. కొట్లు మూసేస్తున్నారు. రోడ్డుకు రెండు చివళ్ళ నియాన్ లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. అప్పుడే మూతపడబోతున్న కొట్లోంచి నీల్ పూలుకొని సుషమకు ఇచ్చాడు.

ఇద్దరూ అలా నడుచుకుంటూ ఓ మారుమూల రోడ్డు మీదకు వచ్చేసారు. అంతా నిర్మానుష్యంగా వుంది. చుట్టూ సరుగుడు చెట్లు గుంపుగా పెరిగి వున్నాయి. గాలి చల్లగా వీస్తోంది. సుషమ షాల్ భుజాల నిండుగా కప్పుకుంది. ఇద్దరూ నడుస్తున్నారు.




లైబ్రరీలోకి కొత్త పుస్తకాలొచ్చాయి. సుషమ ప్రతిరోజు వెళ్దామనుకుంటూనే వీలుపడక మానేసేది. అ

రోజు మధ్యాహ్నం ఎండ తీవ్రంగా వుంది. వడగాల్పులు ఈడ్చిఈడ్చికొడుతున్నాయి. ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టక సుషమ లైబ్రరీకి వచ్చింది. బారాటి బీరువాల్లో సర్ది వున్న పుస్తకాల పేర్లు చదువుతూ నిలబడింది.

అవతలి వరుసలోంచి తన పేరు వినిపించి సుషమ అక్కడే ఆగిపోయింది. అక్కడ ఇద్దరు ముగ్గురు అమ్మాయిలు నిలబడి మాట్లాడుకుంటున్నారు. సుషమ వాళ్ళ గొంతు గుర్తుపట్టేసింది.



"పెద్ద నీతిమంతురాలిలా మన మీద పెత్తనం చెలాయించేస్తుంది. ఆ రోజు సినిమాకు చెప్పకుండా వెళ్ళామని ఫైన్ వేసింది. మనం చూస్తే ఫైన్, తను చూస్తే మాత్రం అదేంలేదు"

"ఏమైంది? సంగతేమిటి?" రెండో అమ్మాయి అడిగింది.

"నాకు అన్నీ తెలుసు. అర్ధ రాత్రులప్పుడు ఇంటికొస్తుంది. షికార్లు కొడుతుంది. ప్రేమాయణం నడిపేస్తుంది?"

"లేదు. నేను నమ్మను. ఆవిడ అలా చేయదు? చాలా సింపుల్‌గా, హుందాగా వుంటుంది ఎప్పుడు"

"నమ్మకపోతే మానెయ్. మిస్ డేవిడ్ కళ్ళారా చూచింది. మిస్ శాస్త్రికి అంతా తెలుసు. హాస్టల్‌లోని అమ్మాయిలందరూ కిటికీలోంచి చాలాసార్లు చూసేశారు"

"ఏం చూశారు?" ప్రశ్నలు వేస్తున్న అమ్మాయి స్వరం తగ్గిపోయింది.

వెంటనే నవ్వులు వినిపించాయి.

"పూర్తిగా చెప్పవే" యాచన

"నీకింకా అర్థం కాలేదా?" అల్లరి నిండిన నవ్వు.

"ప్లీజ్ చెప్పవే? అర్థం కాలేదు"

ఒక రోజు వాళ్ళ గది కిటికీ తలుపులు తెరిచి వున్నాయి. ముందు మహీంద్ర తొంగిచూచింది. తోటమాలి మంచాన్ని లాక్కొచ్చి అందరూ ఎక్కి చూచారు. శృంగార దృశ్యం"

"అమ్మో ఎంత ధైర్యం. ఆవిద చూసేస్తే?"

"ఎలా చూస్తుంది? ఆమె లోపల వుంది. బయట చీకటిగా వుంది. చాలా రోజులుగా మేమందరం చూద్దామని ఆరాట పడుతున్నాం. ఆ రోజు అతడి కాచు వచ్చింది. మిస్ సుషమ ఇంట్లోనే వుంది. మాకు తెలిసిపోయింది"

"ఏం చూశారు మీరంతా?"

మళ్ళీ నవ్వు "ఉండవే సిగ్గువేస్తోంది"

"అతను సోఫాలో కూర్చుని వున్నాడు. సుషమ కింద అతని కాళ్ళ దగ్గర కూర్చుని అతని మోకాళ్ళ మీద తల ఆన్చి ఏదో చెబుతోంది. ఆవిడ జుట్టంతా విడిపోయి వీపు మీద పడివుంది. తరువాత..."

మళ్ళీ నిశ్శబ్దం. చిన్నగా భావగర్భితమైన నవ్వు.

"ఎవరెవరు చూశారు?"

"అందరూ-మహీంద్ర, సరిత, శుభ, అందరూ వున్నారు"

"అవ్వ"

"అవును. ఈసారి పెత్తనం చెలాయిద్దామని చూసిందంటే ప్రిన్స్‌పాల్‌తో చెప్పేస్తాను...!"

సుషమ రెండు చేతులతో బీరువాని గట్టిగా పట్టుకుని తల వంచుకుని నిలబడి పోయింది. చేతులు, కాళ్ళు గజగజ వణుకుతున్నాయి. ఒక్కసారిగా నేలలో కూరుకుపోతే, అక్కడే గుండె ఆగి చచ్చిపోతే బావుండుననిపించింది. లోకం కళ్ళల్లో తన ప్రేమ ఎంత చీప్, హాస్యాస్పదంగా మారిపోయిందో! ప్రపంచం ఎంత క్రూరమైనదో తెలిసివచ్చింది. ఆమెలో పలాయన వాద ప్రవృత్తి ఆ అమ్మాయిల దగ్గరకు వెళ్ళనివ్వలేదు. ఎంతోసేపు అలాగే స్తంభించి నిలబడిపోయింది. అమ్మాయిలు వెళ్ళిపోయినట్టు అడుగుల శబ్దం వినిపించింది. అవతల ఠంగున కాలేజీలో బెల్లు మ్రోగింది. బయట ఎండ నిప్పులు చెరుగుతోంది.

సుషమ రెండు చేతులతో ముఖాన్ని కప్పుకుంటూ అక్కడే కుప్పకూలిపోయింది.

అప్పుడే చప్రాసి, ప ని మ ని షి, కొంచెము విద్యార్థినులు, మిసెస్ ధర్ అందరూ వచ్చారు.

"సుషమా...ఏమైంది?" మిసెస్ ధర్ పరుగెత్తుకువచ్చింది. చప్రాసీ గ్లాసుతో నీళ్లు తెచ్చాడు. జేబురుమాలు నీళ్ళల్లో తడిపి సుషమ ముఖం తుడిచింది మిసెస్ ధర్ సుషమ కళ్లుతెరచి చూసింది.

"సుషమా ఏమైంది?"

"కళ్ళు తిరిగాయి" సుషమ అంది.

"ఆఁ"మిసెస్ ధర్ చూపులో ఒకేసారి వచ్చిన మార్పుచూచి సు ష మ కొరడా దెబ్బ తిన్నట్టు కళ్ళు వాల్చుకుంది. ఒక రోజు స్వాతి కళ్లుతిరిగి పడిపోయింది. ఎవరో అన్నమాటలు గుర్తుకొచ్చాయి.

"లేదు...లేదు... మి సె స్ ధ ర్" సు ష మ గొంతుచించుకుని అరవాలనుకుంది. కానీ ఏడ్పు ముంచుకొచ్చి మిసెస్

ధర్‌ని వాటేసుకుని బావురుమంది. మిసెస్ ధర్ స్తబ్దురాలైపోయింది.

"వెళ్ళి భైరుని పిల్చుకురా" ఆమె చప్రాసీని ఆజ్ఞాపించింది. మిసెస్ ధర్ సుషమ తల నిమురుతూ కూర్చుంది. సుషమ తన ఆత్మీయులెవరో మరణించి నట్టు ఏడుస్తూనేవుంది. ఒక కన్నీళ్ళతో తయారైన శిల్పంలా ఏడ్చి ఏడ్చి అక్కడే కరిగిపోతుందేమో అన్నట్టుగా వుంది సుషమ దుఃఖపరిస్థితి.

భైరు వచ్చాక సుషమని ఇంటికి చేర్చి మంచమ్మీద పడుకోబెట్టి, నిండుగా దుప్పటి కప్పి చాలాసేపు కూర్చుని వెళ్ళి పోయింది మిసెస్ ధర్. భైరు సుషమ కాళ్ళదగ్గర కూర్చుని దీనికంతటి కారణం "ఆ ముసలిముండ మిస్‌శాస్త్రి అని తిట్టు కుంటూ– "ఎప్పుడో దాని పీక దాని పిల్లి పీక పిసికి చంపేస్తాను"అనుకుంది భైరు!

సుషమ కళ్ళుమూసుకుని మంచమ్మీద అచేతనంగా పడివుంది. కానీ లోపల అంతర్మధనం జరుగుతోంది.

"నీల్ నన్ను చూచి లోకం నవ్వు తోంది. నా స్టూడెంట్లు నాగురించి వెకిలిగా మాట్లాడుకుంటున్నారు... మన ప్రేమ నవ్వులపాలైపోతోంది. సుష తను రాసిన వాక్యాలను పదేపదే చదువుతోంది. మళ్ళీ వెంటనే ఆ కాగితాన్ని ముక్కలుగా చింపి పారేసి భైరుని పిలిచింది. "భైరు ఇది నీల్ ఫోన్ నెంబరు. ఫోను చేసి నేను సాయంత్రం రమ్మంటున్నానని చెప్పు" అంటూ ఫోన్‌నెంబర్ వేసివున్న చిన్న స్లిప్ ఇచ్చింది.

ఆరోజు సాయంత్రం సుషమ తయారై వరండాలో నిలబడి ఎవరికోసమో ఎదురుచూద్దాం కొందరు అమ్మాయిలు చూదాదు. వాళ్ళతోపాటు పిల్లిని గుండె లకు హత్తుకుని అటుగావచ్చిన మిస్ శాస్త్రి చూసింది. సుషమ రోజుటికన్నా ఆరోజు చాలా అందంగా కనిపించింది.

నీల్ కారు ఆగకముందే సుషమ చక చక మెట్లు దిగి కారుదగ్గరకు పరుగెత్తింది.

"ఎక్కడకు వెళ్ళాలి?" నీల్ అడి గాడు. కారు డోర్ తెరచి లోపల కూర్చుంటూ "ముందు బయటకు పోనీ" సుషమ అంది.

విశాలంగావున్న రోడ్డుమీదకు వచ్చాక నీల్ అడిగాడు – "ఎక్కడకు వెళ్ళాలి సుషమా?"

"ఎక్కడికైనా సరే–నీయిష్టం వచ్చిన చోటుకు తీసుకెళ్ళు. ఇక్కడి నుంచి దూరంగా వెళ్ళగలిగితే చాలు. ఈ వాతా వరణంలో నా ప్రాణం రక్తపు మడు గులో గిజగిజా తన్నుకుంటోంది."

"ఏం? ఏమైంది?"

జవాబు చెప్పలేక సుషమ పెదవులు వణుకుతున్నాయి. తన మీద ఎలాంటి పర్వతాలు కూలిపడుతున్నాయో మాటల్లో ఎలా వివరించగలుగుతుంది? కానీ నీల్ దగ్గర ఏదీ దాచలేకపోయింది.

"నేను వీళ్ళెవరినీ లెక్క చెయ్యను. నాకు..." ఆమె స్వరం గాద్గదికమైంది. "నా బాధ ఏమిటంటే నీల్! నేను ఈ అమ్మాయిలకోసం ఏం చేయలేదు? ఎంత కష్టపడ్డాను వీళ్ళ కోసం. అత్యవసరం కానిదే ఎవరినీ దండించను. ప్రేమతో వ్యవహరిస్తాను. ప్రేమ పూర్వకంగా చెబుతాను. వాళ్ళ కష్ట సుఖాలు అడిగి తెలుసుకుంటాను. అలాంటి నాగురించి వాళ్ళు...నా గదిలోకి దొంగ చాటుగా తొంగి చూచి.."

"ఎప్పుడు?"

"ఆరోజు నువ్వు బొంబాయి నుంచి వచ్చావు. నేను నీ కాళ్ళ దగ్గర కూర్చున్నాను"

సుషమ హ్యాండ్ కర్చీఫ్ తీసి కళ్లు తుడుచుకుంది. నీల్ గంభీరంగా మారిపోయాడు.

"నన్నెక్కడికి తీసుకెళ్తున్నావు?"

"ఇంటికి"

"ఇంటికా?"

"అవును. అక్క కౌసల్యని చూచావు కదా. అక్కడే కాసేపు కూర్చుందాం!"

కానీ నీల్ ఇంటికొచ్చి చూస్తే కౌసల్యగారు లేరు. క్లబ్‌కు వెళ్ళారని తెలిసింది. అతడు సుషమని డ్రాయింగ్ రూంలో కూర్చోబెట్టి డ్రస్ ఛేంజ్ చేసుకోవటానికి వెళ్లిపోయాడు. ఈలోగా సుషమ దుఃఖ తీవ్రతని అదుపులోకి తెచ్చుకుంది. హాండ్‌కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుని చీర కుచ్చెళ్ళు సరిచూసుకుంటూ కూర్చుంది. పది నిముషాల తరువాత నీల్ వచ్చాడు. అప్పటికి సుషమ ముఖం మీద చిరునవ్వు ఆడుకుంటోంది.

"సుషమా! నీకు వడగాడ్పు తగులుతుంది" అంటూ నీల్ కిటికీలు మూసి కర్టెన్లు లాగేసాడు.

"కౌసల్య ఆంటీ గదిని అద్భుతంగా అలంకరించి వుంచారు" సుషమ అంది.

"కానీ నాకు నీ గదే బావుంటుంది. నాజూకైన వస్తువులతో సుకుమారంగా వుంటుంది. ఇదేముంది చాలా ఫార్మల్‌గా వుంది. నాకు రోజూ వచ్చే స్వప్నాల నిండా నీ గదే నిండి వుంటుంది. నువ్వుంటావు, తరువాత బైట". సుషమ చిన్నగా నవ్వింది. నీల్ ఆమె రెండు చేతులు అందుకుని చెంపలకు తాకించుకుంటూ మళ్ళీ అన్నాడు "ఆ గది నా పాలిటి స్వర్గంలాంటిది. ఆ స్వప్న సౌధంలోనే నేను నిన్ను ప్రత్యక్షం చేసుకోగలిగాను. పొందాను. నాకు అప్పుడప్పుడూ చాలా ఆశ్చర్యం వేస్తుంది. ఎందుకో తెలుసా! నీలాంటి అమ్మాయి చేత నేను ఎలా ప్రేమించబడ్డానా అని"

"నా దగ్గర ఏదీ మిగల్లేదు నీ కివ్వటానికి. ఆ రోజు నేను ఇంకా అందంగా లేనందుకు, పదహారేళ్ళ నవ యవ్వన ప్రాయంలో లేనందుకు చాలా బాధ పడ్డాను నీల్."

"ఏమో అవన్నీ నాకు తోచవు. నేను చూసినప్పుడల్లా నువ్వు నాకు కొత్తగానే కనిపిస్తావు. అప్పుడే నవయవ్వన ప్రాంగణంలోకి అడుగుపెట్టిన సౌందర్య దేవతలా నన్ను ఉక్కిరి బిక్కిరి చేసేస్తావు. ఇంకా నాకేమనిపిస్తుందంటే- నీతో నాకు పరిచయమే లేనట్టు. అప్పుడే మొదటిసారి కనిపించిన నీ కోసం ఆరాటపడుతున్నట్టు వుంటుంది. ఇప్పుడు సైతం నిన్ను ఒక్కసారి తాకితే చాలు నిన్ను సంపూర్ణంగా నాలో కలిపేసుకోవాలన్న మహా చైతన్యం, గొప్ప లాలస, ఆకాంక్ష నాలోంచి పొంగి పొర్లుతుంది."

"అయితే నువ్వు చాలా ప్రమాదకరమైన వాడివన్న మాట. అమ్మో!" సుషమ చేతిని లాగేసుకుంది దూరంగా. నీల్ తన చూపుడు వేలుని ఆమె పెదవులకు ఆనించి వాటి స్పందనని అనుభవిస్తున్నాడు. ఆమె బారాటి కనురెప్పల నీడలు కపోలాల మీద కదులాడుతున్నాయి.

"నీల్! నీ ఎదురుగా కూర్చుంటే ఎందుకిలా వివశురాలినైపోతాను నేను? అంతకు ముందు పడిన కష్టాలు, ఇప్పుడు అనుభవిస్తున్న కష్టాలు ఏవీ గుర్తుండవు.




నువ్వు తప్ప మరో ఆలోచనే మిగలదు."

పక్క గదిలో ఫోన్ మోగింది. సుషమ తన్మయత్వంలోంచి కళ్లు తెరచి చూసింది.

"ఈ ప్రపంచం నుంచి, ఈ మనుషుల నుంచి దూరంగా, ఎవరికీ కనిపించనంత దూరంగా పారిపోదాం రమ్మంటుంది నా హృదయం. చాలా అలసి పోయాను నీల్"

"నాతో వచ్చెయ్ సుషమా! ఇదిగో ఇప్పుడే నా చెయ్యి అందుకో. వెంట నడు"

"ఎక్కడికి తీసుకెళ్తావు నన్ను"

"ఎవరికీ తెలియని ఒక అందమైన, ఆనందమయమైన అజ్ఞాత ప్రపంచంలోకి, వీళ్ళందరికీ దూరంగా..."

"తీసికెళ్ళు. నేను సర్వం సహా సిద్ధంగా వున్నాను"

"నిన్ను ఒక గదిలో రహస్యంగా బంధించి వుంచుతాను. ఎవరి దృష్టీ నీ మీద పడకూడదు. నిన్ను నా నుంచి దూరం చేసేస్తారేమో? లాక్కుని పోతారేమో వీళ్ళు? భయమేస్తోంది సుషమా చాలా భయం –"

"నీకా! నీకు భయమేస్తోందా? భయపడవలసింది నేను, నువ్వు కాదు నీల్. ఏ పదహారు, పదిహేడేళ్ళ అమ్మాయో నిన్ను నాకు కాకుండా చేసేస్తుందేమో?"

"పిచ్చి పిల్ల" నీల్ అన్నాడు. మళ్లీ కుర్చీలో జేరగిలబడుతూ అన్నాడు "మా కంపెనీ వాళ్ళు నన్ను హాలెండు పంపుదామని చూస్తున్నారు. వెళ్తే నిన్ను వెంట తీసికెళ్ళిపోతాను"

"నేను రానంటే?" సుషమ అడిగింది. ఆమె చెవులనున్న ముత్యాల దుద్దుల్లో వున్న చిన్న చిన్న మువ్వలు సున్నితంగా మోగాయి. నీల్ సుషమను అప్పుడే మొదటిసారి చూస్తున్నట్టు అదే ముగ్ధ మనోహరమైన దృష్టితో చూసాడు.

నీల్ సుషమని దగ్గరగా తీసుకున్నాడు.

"ఎందుకు రానంటావు?"

నీల్ కళ్ళల్లోకి ఒక్కసారి చూసి, సుషమ కనురెప్పలు వాటంతట అవే వాలిపోయాయి భారంగా.

"లేదు నీల్ లేదు" – సుషమ మాటలు బిగి కౌగిలిలో అదృశ్యమై పోయాయి.

* * *

నీల్ తన కోసం అందమైన లోకాన్ని నిర్మిస్తున్నాడు. కాదు నిర్మించేసాడు. తలుపులు బార్లా తెరిచేసి తనని ఏనాడో ఆహ్వానించాడు. కానీ తనే పూర్తిగా ప్రవేశించలేదు. సుషమ మంచమ్మీద పడుకుని వుంది. కళ్ళు సగం తెరచి గదిలో కదులాడుతున్న వెలుగు నీడల వైపు చూస్తూ నీల్ గురించి ఆలోచిస్తోంది. నీల్ కుటుంబ సభ్యులందరూ నీల్ కోసం ఓ అందాలరాశిని, నవ యవ్వన రతిని వెదికే ప్రయత్నంలో మునిగి వున్నారు. కానీ పెళ్ళి మాట ఎత్తగానే నీల్ నవ్వి కాదనేస్తున్నాడు. సుషమ కోసం ఎదురు చూస్తూ తన ఆలోచనలను, ఆకాంక్షలను సుషమ మానసిక స్థితికి అనుగుణంగా మల్చుకుని నిలబడ్డాడు. నీల్‌తో తన స్వప్నం నిజమౌతుందా? విశ్వసించలేకపోతోంది సుషమ.

ప్రతిసారీ నీల్ తనకన్నా ఎంతో పెద్దవాడైనట్టు తనను మరీ పసిపాపగా భావిస్తూ ఒళ్ళోకి లాగేసుకుంటాడు. సుషమ అలాగే మౌనంగా వుండిపోతుంది.

నీల్ తల నిమురుతూ కూర్చుంటాడు గంటల తరబడి. వెంటనే తను ఒక్కసారి నవ్వుతూ చూస్తే అప్పటివరకు నీల్ కళ్ళల్లో కనిపించే పెద్దరికం, గంభీరత మాయమైపోయి వాటి స్థానే అల్లరి మేల్కొంటుంది. చంచల పవనంలా చుట్టు ముట్టేస్తాడు.

ఒంటరిగా పడుకుని ఆలోచిస్తున్న సుషమకు హఠాత్తుగా మీనాక్షి గుర్తు కొచ్చింది. ఈ మధ్య తన దగ్గరకు రావటమేలేదు మీనాక్షి. ఎందుకని? సుషమ హఠాత్తుగా లేచి బట్టలు మార్చుకుని మీనాక్షి ఇంటికెళ్ళింది. సుషమని చూసి మీనాక్షి ఆశ్చర్యపోతూ అడిగింది. "ఎలా వచ్చేవు?"

"వెళ్ళిపొమ్మంటావా తిరిగి?"

సుషమ చెయ్యి పట్టుకుని లాగి తన పక్కన కూర్చో బెట్టుకుని అంది "మహారాణిగారూ! మరీ అంత కోపమైతే ఎలా? భరించగలదా ఈ..."

"నువ్వు చాలా రోజులై రాలేదు, నన్ను పూర్తిగా మర్చిపోయావు" సుషమ స్వరంలో తీవ్రత...

"ఎవరు ఎవర్ని మర్చిపోయారన్నది నీకూ తెలుసు, నాకూ తెలుసు. ఇదే కారణం కాదనుకో. బిజీగా వుండి రాలేక పోయాను" మీనాక్షి మోకాళ్ళ చుట్టూ చేతులు బిగించి కూర్చుంటూ మళ్ళీ అంది "త్వరలో నీ పెళ్ళి అవుతుందని ఎవరో చెప్పగా విన్నాను"

"నా పెళ్ళా!"

"అవును నీదే! స్టూడెంట్లు నా దగ్గరకు వచ్చి మిస్ శర్మ పెళ్ళట కదా మీకు తెలుసా? అని నన్నడుగుతున్నారు."

"అమ్మాయిలు...వాళ్ళకేం. అవునూ నీ పెళ్ళి తారీఖు ఫిక్స్ అయిందా?"

"మార్చిలో చేసుకుందాం అంటు న్నారు"

"అంత అర్జంటుగానా? ఏర్పాట్లు జరుగుతున్నట్టే లేదు"

"నీకు కావలసిన బట్టలవీ నువ్వే కొనుక్కో మిగతావి నేను చూస్తాను అంటోంది మా అమ్మ! కానీ నేను ఒక్కదాన్నే ఎలా కొనగలను? నీకూ టైం లేదు"

"టైం వుంటుందిలే. ఎప్పుడు వెళ్దా మంటావో చెప్పు" సుషమ అంది.

"జూలైలో. నేను మళ్ళీరాను" మీనాక్షి అప్రయత్నంగా అనేసింది.

"ఏం? ఉద్యోగం వదిలేస్తావా?"

"దినేష్ అదే అంటున్నారు. సుషమా! నేను కూడా సంవత్సరాలుగా ఈఉద్యోగం చేసి చేసి అలసిపోయాను. విసిగిపోయాను ఇంకా ఉద్యోగం చేయాలనిపించటం లేదు"

సుషమ మాట్లాడలేదు.

"సుషమా?"

"ఊఁ"

"నువ్వు కూడా పెళ్ళి చేసుకో"

"నీకు దొరికినట్టు ధనిక పెళ్ళికొడుకు నాకెక్కడ దొరుకుతాడు" సుషమ నవ్వి అంది.

"ధనికుడి అవసరం నీకేముంది? అన్ని ధనాలకు మించిన ప్రేమధనాన్ని పొందిన భాగ్యశాలివి. నాకూ నీల్ లాంటి ప్రేమికుడు లభించివుంటే అప్పుడు చూపించేదాన్ని..."

"అప్పు చేసిన డబ్బుతో ఎవ్వరూ సుఖంగా వుండలేరు" సుషమ ఎటో ఆలోచిస్తూ అంది.

"ఎందుకు?"

"నేను నీల్ని పెళ్ళి చేసుకోలేను

అతనికన్నా నేను ఆరు సంవత్సరాలు పెద్దదాన్ని"

సుషమ స్థిరంగా చూస్తూ నిశ్చయంగా అంది. మీనాక్షి ఆశ్చర్యపోయింది "ఇది కూడా ఒక సమస్యేనా? ఆ సంగతి ఆయనకు కూడా తెలుసు. అయినా వయోభేదాలు దివాలాకోరు మానసిక స్థితి ఉన్న భార్య భర్తలకి కాని ప్రేమికులకు వర్తించవు. నువ్వు ప్రేయసిగా వుంటానికి వెళ్తున్నావు. పెళ్ళాంగా కాదు''

"నిజమే! ప్రేయసికి, పెళ్ళానికి మధ్యా చాలా తేడా వుంటుంది. కానీ నీల్ మనసులో తాను తప్పు చేశానన్న ఆలోచన ఎప్పుడైనా వస్తే దాన్ని నేను భరించలేను. ఇలా అవివాహితగా మిగిలిపోవటానికే ఇష్టపడతాను. ఇదిలా వుంచితే అటు కుటుంబం అంతా నా మీద ఆధారపడి వుంది. నాన్నగారు మొన్ననే ఉత్తరం రాశారు నీరూ పెళ్ళి గురించి. త్వరలో నీరూ పెళ్ళి అయిపోతుంది. ప్రతిమ వుంటుంది. త్వరలో దాని పెళ్ళి కూడా చేసేస్తే బావుంటుంది. కానీ అది ప్రస్తుతానికి డాక్టరు కావాలని కలలు కంటోంది. ఇంక తమ్ముళ్ళు వున్నారు –"

"కానీ ఇలా ఎంత కాలం – ఎంత వరకు..? నీ గురించి కూడా ఆలోచించు"

"నేను ఈ బరువుల నుంచి విముక్తిని పొందే ఆశ లేదు. ఆస్కారమూ లేదు. నలభైఏదేళ్ళు వచ్చాక నేనూ మిస్ శాస్త్రిలాగే ఒక పిల్లినో, కుక్క పిల్లనో పెంచుతూ దాన్ని గుండెలకేసి హత్తుకుని దాన్ని ప్రేమిస్తూ తిరుగుతాను. పర్వాలేదు. అసలు సంగతేమిటంటే మీనాక్షీ! నేను ఏదైతే అనుభవించానో అది నా చెల్లెళ్ల అనుభవించకూడదు. ఆ రోజుల్లో నేను దుఃఖాన్ని పళ్ళ బిగువున అణిచి పెట్టుకుని వుండేదాన్ని. ఆ రోజుల్లో రెండు మూడు కాటన్ చీరలు మాత్రమే ఉండేవి. వాటినే ఉతుక్కుని కాలేజీకి వెళ్ళేదాన్ని. ఆనాటి నా కలలు.. వద్దులే చెప్పను. ఇప్పుడు ప్రతిమ అరవింద్‌ని పెళ్ళి చేసుకోదల్చుకుంటే దాన్ని సంభవంగా మార్చేస్తాను. ప్రతిమ తన అక్కలా రాత్రులు నోట్లో పమిట కుక్కుకుని ఏడ్వకూడదు. అలాంటి అవసరం దానికి రాకూడదు. రానివ్వను"

" మరి నీల్? " మీనాక్షి స్వరం గదంతా కలయదిరగసాగింది.

"పెళ్ళి చేసుకుంటాడు.భార్యా పిల్లలతో సుఖంగా వుంటాడు. అతడి జీవితంలో నేనో చేదు జ్ఞాపకంలా మిగిలిపోతాను."

"నీకు నిజంగా మతి భ్రమించింది. పిచ్చిదానిలా మాట్లాడుతున్నావు. చేతులారా నిండు జీవితాన్ని నాశనం చేసుకునేవారిని ఇంతవరకు చూడలేదు. ఈ రకంగా నిన్ను నువ్వు హింసించుకోవటంలో ఎవరికి ప్రయోజనం? అద్భుతమైన ప్రేమ ఆయాచితంగా లభిస్తుంటే స్వీకరించవేమిటి?"

"దాన్ని స్వీకరించగల సాహసం నాలో లేదేమో బహుశా " సుషమ బాధాగ్రస్తంగా నవ్వింది "మరో పదహారేళ్ళ తరువాత నువ్వు నీ కూతుర్ని తీసుకుని ఇక్కడికి వస్తే నన్నిక్కడే చూస్తావు నువ్వు. ఈ కాలేజీ స్తంభాల్లా స్థిరంగా శిలాప్రాయంగా"

అ తరువాత గది నిండా ఉదాసీనత ఆవరించుకుంది. సుషమ లేచి వచ్చింది. శ్మశాన నిశ్శబ్దం అలుముకుని వున్న తన

బంగ్లాలో పచార్లు చేస్తుండిపోయింది.

* * *

"నీల్! దయచేసి నన్నర్థం చేసుకో" సుషమ అంది. నీల్ అలాగే చూస్తుండిపోయాడు. రక్తం లేనట్లు పాలిపోయి వున్న సుషమ ముఖం, కళ్ళల్లో జీరాడుతున్న విషాద ఛాయలు. హాండ్ కర్చీఫ్ ని కళ్ళకు చుట్టుకుంటూ కూర్చుని వుంది సుషమ.

"నీల్ నీకు అర్థం కావటం లేదు" సుషమ మళ్ళీ రెట్టిస్తూ అంది.

"అవును నాకు అర్థం కాదు" నీల్ హఠాత్తుగా కఠినంగా మారిపోయాడు. "నీ తర్కం నాకు అర్థం కాదు".

సుషమ అసహాయంగా చూస్తుండిపోయింది. వెంటనే తల వంచేసుకుని చీర డిజైన్‌లోకి కళ్ళు దూర్చేసింది. మళ్ళీ తల ఎత్తి నీల్ వైపు చూసే సాహసం ఆమెలో లేదు. ఐదు నిముషాలు చావు నిశ్శబ్దంలో గడిచిపోయాయి. సుషమలో మళ్ళీ వెనకటి జంకు, ముఖాన్ని ఒక మూలన దాచేసి పలాయనవాదిలా బ్రతికేద్దామన్న ప్రవృత్తి మేల్కొన్నాయి. ప్రిన్స్‌పాల్ సుషమని పిలిచి నిర్మొగమాటంగా "నీ గురించి ఇలా వినవలసి రావటం నేను ఊహించని సంగతి" అనేసింది. ఆవిడ మాట్లాడిన మాటలు భరించలేక అక్కడికక్కడే రాజీనామా ఇచ్చేద్దామనుకుంది సుషమ. అంతలోనే కళ్ళ ముందు కుటుంబసభ్యుల



ముఖాలు ఒకటొకటిగా వచ్చి నిలిచాయి. తన తలమీద వున్న బరువుని తల్చు కుంటూ సుషమ తలవంచుకుని బయటకు వచ్చేసింది. సుషమ గురించి రక రకాలుగా ప్రిన్స్‌పాల్‌తో చెప్పారు అందరూ. ఇందులో ఆవిడ తప్పు కూడా లేదు.

కానీ పరిస్థితి క్షణకాలంలో తలకిందులై పోతుందని సుషమకేం తెలుసు? అప్పుడే ఎంత కాలం గడిచింది గనుక? ఇంకాతను చెప్పదలుచుకున్న మాటలు నీల్‌తో పూర్తిగా చెప్పనే లేదు. ఎన్ని కోరికలు-ఎన్ని కలలు, ఎన్ని తియ్యటి కబుర్లు క్యూలోబడి వున్నాయి హృదయంలో-అవన్నీ చెప్పనేలేదు. చెప్పే లోపునే ధ్వంసం అయిపోయాయి.

''లేదు-నేను ఇంక ఏడ్వను" సుషమ కంపిస్తున్న స్వరంతో అంది. నేను ఇక్కడ నుంచి వెళ్ళిపోతాను. మరోచోట ఉద్యోగం వెదుక్కుంటాను. కానీ నీల్ లేకుండా నేను బ్రతకను.

పైకి బిగ్గరగా అందామనుకున్న మాటలు లోపలే సుళ్ళు తిరుగుతున్నాయి. కళ్ళు వర్షించటానికి సిద్ధంగా వున్నాయి. ఒక పెద్ద కన్నీటిబొట్టు జారిపడింది.

తననితాను అదుపులో పెట్టుకునేందుకు సుషమ చేస్తున్న ప్రయత్నాన్ని గమనించ కుండా దెబ్బతిన్న పసివాడిలా చూస్తున్నాడు నీల్. అలా చూస్తున్న నీల్‌ని చూసిన సుషమ వెంటనే వెళ్ళి అతడి కౌగిలిలో ఒదిగిపోవాలనిపించింది. దుఃఖంతో చల్లబడి వున్న తన శరీరాన్ని అతడి వెచ్చటి స్పర్శతో ఆరబెట్టుకుందా మనిపించింది. నన్ని క్కడ్నించి దూరంగా తీసుకెళ్ళిపో - వీళ్ళు మనద్దరినీ కలసి బ్రతకనివ్వరు పద' అందామనుకుంది. కానీ-

"ప్రిన్స్‌పాల్ నా రాజీనామా అడుగు తోంది" సుషమ అంది.

"దానికోసమేనా ఇంత కంగారు పడి పోతున్నావు? నువ్వు ఉద్యోగం వదిలి వేయవలసి వుంది" నీల్ అన్నాడు.

"ఎందుకు? ఉద్యోగం వదిలేసి ఏం చేస్తాను?" సుషమకు అర్థమైనా, అర్థం కానట్టు అడిగింది.

"పెళ్ళి తరువాత నిన్ను ఉద్యోగం చేయిస్తానని నువ్వు అనుకుంటున్నావా?" నీల్ స్వరం మధురంగా వుంది.

"ఓహ్-నీల్" లోతైన లోయలోంచి మాట్లాడినట్టు వుంది సుషమ స్వరం.

"ఏం" నీల్ ఆమె భుజాలమీద చేతులు వేస్తూ అడిగాడు. సుషమ ఆ స్పర్శలోని మాధుర్యాన్ని మర్చిపోదామను కుంది.

"నేను ... నేను ... ఐ కాంట్ మ్యారీయు-నీకు తెలుసా నీల్?" సుషమ తడబడుతూ అంది.

ఒక్కసారిగా నీల్ ముఖం చిన్నదై పోయింది. హతాశుడైపోయి చూస్తున్నాడు. భరించలేని తనంలో సుషమ మళ్ళీ గొంతు విప్పింది "నా మీద చాలా బాధ్యతల బరువులున్నాయి నీల్! నీకు తెలుసు. పక్షవాతంతో మంచాన పడివున్న నాన్న, ఇద్దరు చెల్లెళ్ళు, ఇద్దరు తమ్ముళ్ళు, అమ్మ అందరి అవసరాలు నేనే తీర్చాలి. అందరి బాధ్యతలు నేనే మొయ్యాలి"

సుషమ భుజమ్మీద చెయ్యివేస్తూ నెమ్మదిగా అన్నాడు నీల్ "నీ బాధ్య తలు నావి కూడా అవుతాయి. వాళ్ళ కోసం అన్నీ అమర్చి పెడదాం. నేను లేనా నీతో"




సుషమ దృఢంగా, గంభీరంగావున్న అతడి మాటలు వింటూ అతడి ముఖంలోకి చూస్తోంది. నీల్‌పట్ల మరో వినూత్నమైన గౌరవం ఒకటి ఆమె హృదయంలో అలజడి లేవదీసింది. ఇంతటి బరువుని ఒకే సారి అతడి తలమీద నెట్టేయటం ఏం న్యాయం? ఆ పని తను ఎలా చేయగల్గుతుంది?

"నువ్వు భావావేశంలో చేస్తున్న ఈ పని ఆ తరువాత నీలో పశ్చాత్తాపం పుట్టిస్తే..?" సుషమ గదిలో పచార్లు చేస్తూ అంది.

"ఇప్పుడు నీకేపాటి వయసుందని? నేను నీకన్నా చాలా పెద్దదాన్ని నీల్! మన వైవాహిక జీవితాన్ని ఈ వయోభేదం ఫలవంతం కానీయదు. ఎప్పుడో ఎక్కడో ఎవరో పదహారేళ్ళ అందమైన అమ్మాయి నిన్ను నానుంచి దూరం చేస్తుందన్న భయం నన్ను నిత్యం వెంటాడుతుంది"

"అంటే–నేను నీకు అంతటి చంచల మనస్కుడిలా కనిపిస్తున్నానా?"

"లేదు....నీల్...లేదు" సుషమ పిడికిళ్ళతో వక్ష స్థలాన్ని అదుముకుంటూ అంది. "ఈ కాటేజి ఈ ఎర్ర గోడలు,ఈ లావాటి శిలా స్తంభాలు, ఈ చీకటి ఇదే నా ప్రపంచం. నేను ఇలా బ్రతకటానికి పుట్టాను. నన్ను వదిలెయ్ నీల్"

నీల్ చాలా సేపటివరకు మౌనంగా వుండిపోయాడు. "అయితే నన్నేం చేద్దామనుకుంటున్నావు?"

"నువ్వు వెళ్ళు నీల్. నువ్వు నా ఎదురుగా వుంటే నేను మరో విషయాన్ని గురించి ఆలోచించలేను.ఏపని చేయలేను. నువ్వు నాదగ్గరగా వస్తే నా స్థిర నిశ్చయాలన్నీ గాలికి ఎగిరిపోతాయి ... నువ్వు వెళ్ళు నీల్...వెళ్ళు..." అంటూ సుషమ స్వరం విపరీతంగా అలసిపోయినట్టు కూర్చుండిపోయింది.

"సుషమా! నువ్వు నాపట్ల ఇలాచేయటం భరించలేను" నీల్ నుదురు మీద రక్తనాళాలు పొంగి వచ్చాయి.

"నా బలహీనతల్ని, అశక్తతల్ని అర్థం చేసుకోవా?" సుషమ తల వంచుకుని, వేలి ఉంగరాన్ని కసిగా చుట్టూ తిప్పుతూ అంది.

"అంత పెద్ద బలహీనతలు,అశక్తతలు వున్నాయా నీకు?" నీల్ కోపంతో ప్రజ్వరిల్లిపోతూ అన్నాడు. సుషమ కళ్లుపెద్దవి చేసుకుని చూసింది.

"నాకన్నా గొప్పవాడి కోసం, నీ జీవితాన్ని నువ్వు అనుకుంటున్న విధంగా తీర్చిదిద్దే వాడికోసం ఎదురు చూస్తున్నట్టున్నావు. నేను నీకు తగిన వాడ్నికాదు. నీతో సరితూగగల సామర్థ్యం నాలో లేదు అంతేనా?"

"అలాంటి మాటలు ఎందుకంటావు నీల్?"

"సరే అయితే నువ్విక్కడే వుండు. ఈ నాలుగు గోడల మధ్య, ఈ స్థంభాల మధ్య, ఈ అంధకారంలో ఖైదీ లా వుండిపో! నేనే అనవసరంగా నీ కోసం తాపత్రయపడి గాయపడ్డాను. నేనే నీ సర్వస్వం అనుకున్నాను. నా కోసం నువ్వు ఏమైనా చేసేస్తావని భ్రమపడ్డాను. కానీ అందమైన ముఖంతో పాటు నీదగ్గర చాలా ప్రాపంచికమైన లౌక్యం, జీవన వ్యాపారాత్మకత కూడా వున్నాయని తెలుసుకోలేకపోయాను"

సుషమ చెయ్యి ముందుకు చాపుతూ ఆర్ద్ర స్వరంతో అంది "నీల్...ప్లీజ్.."

నీల్ ఒక్క ఉదుటన లేచి నిల

అన్నాడు. గిరుక్కున వెనుదిరిగి బయటకు వెళ్ళిపోయాడు. క్రోధంతో అతడి అడుగుల శబ్దం, ధడాలున మూసుకున్న కారు డోర్ శబ్దం సుషమకు వినిపించాయి.

నీల్ వెళ్ళిపోయాడు.

నిశ్శబ్దం మిగిలింది. కేవలం ఒంటరి నిశ్శబ్దం మిగిలింది.




పార్టీ ఆనందంగా ముగిసింది. బేరర్స్ ఖాళీ ప్లేటులు, గ్లాసులు ఎత్తుతున్నారు. వచ్చిన అతిథులు ఒకరొకరే నవవధువై సిగ్గుతో ముడుచుకు పోయివున్న నీరూని అభినందించి, ఆశీర్వదించి వెళ్ళి పోతున్నారు. సుషమ బంగ్లా విద్యుద్దీపాలతో దేదీప్యమానంగా వెలిగిపోతోంది. ఉన్నంతలో పెళ్ళి ఘనంగా జరిపించేసింది సుషమ. నీరూ పెళ్ళి జరిగి పోయినందుకు తల్లి అవధుల్లేని ఆనందంలో మునిగి వుంది.

"అయితే మీ అమ్మ ఒక కూతురు గొంతు కోసి మరో కూతుర్ని పల్లకీ ఎక్కించిందన్నమాట!" వెళ్తూ వెళ్తూ సుషమని నిలేసి అడిగింది ఓ ముత్తైదువ.

సుషమ బలవంతంగా నవ్వి ఊరుకుంది.

"ఎంత అప్పు చేశావు. పెళ్ళికి" కృష్ణమ్మ అడిగింది.

"ఆరు వేలు"

"ఎలా తీరుస్తావు?"

"నెల నెలా కొంత చెల్లవేస్తాను"

"ఇంకేం జీవితాంతం అప్పులుతీరుస్తూ కూర్చో" ఒక మూల నిలబడి వున్న సుషమ పెళ్ళిలో జరిగిన చర్చలు ఒకటొకటిగా గుర్తుకొస్తున్నాయి. ఏది ఏమైనా నీరూ పెళ్ళి జరిగిపోయింది. ఒక బాధ్యత తీరిపోయింది అనుకుంది సుషమ.

ఇంతలో మిసెస్ సూరి వచ్చి ఆత్మీయంగా సుషమ భుజంమీద చెయ్యి వేస్తూ అంది- "నీ చెల్లి, పెళ్ళి కొడుకు జంట బాగా కుదిరింది. చాలా సంతోషంగా వుంది సుషమా"

సుషమ సమాధానంగా చిరునవ్వు నవ్వింది. ఆమె కళ్ళు చుట్టూ తిరిగి నిరాశగా వెనుతిరిగి వచ్చాయి. మిస్ శాస్త్రి, మిసెస్ అగర్‌వాల్, రోమా, నీరూ, నీరూ భర్త సుభాష్ అందరూ వున్నారు. ఇంకెందరో బంధువులున్నారు. కానీ నీల్ ఎక్కడా లేడు. వివాహ సందర్భంగా పార్టీ ఇస్తూ అందరినీ ఆహ్వానించింది సుషమ.

కానీ నీల్ రాలేదు.

వచ్చిన అతిథులు, కొలీగ్స్ అందరూ సుషమ నీల్‌తో తెగతెంపులు చేసుకుని చాలా మంచిపని చేసిందని మెచ్చుకున్నారు. ఈ వయసులో ఇంకా రొమాన్స్ ఎందుకు? చాలా బాధ్యతలున్న అమ్మాయి అన్నారు. సుషమ తన ప్రావిడెంట్ ఫండులోంచి లోను తీసుకుని చెల్లెలి పెళ్ళి జరిపించినందుకు అభినందించారు.

అందరూ వెళ్ళిపోయాక సుషమ మీనాక్షి గదికి వెళ్ళింది. కొత్త జంట ఢిల్లీ చూడాలనే కుతూహలంకొద్దీ అక్కడ

వుండిపోయారు. తను ఇంట్లో వుంటే నీరు సంకోచిస్తూ తిరుగుతుందనుకుని సుషమ ఎక్కువ సమయాన్ని బయట గడిపేస్తోంది. అధికంగా మీనాక్షి దగ్గరకు వెళ్తోంది. లేకుంటే తలుపు మూసేసుకుని గదిలో మంచమ్మీద ఒంటరిగా, నిర్జీవంగా పడివుంటుంది. ఆరోజు నుంచి నీల్ మళ్ళీ రాలేదు. ఒకరోజు సుషమ ప్రిన్స్‌పాల్ దగ్గరకు వెళ్ళి నీల్ అక్కడకు రావటం అభ్యంతరమైతే రానివ్వనని చెప్పి వచ్చింది. అందరి దృష్టిలో నీల్ చులకన అయిపోవటం మంచిది కాదనుకుంది.

కానీ దీనికంతటికీ కారణం ముఖ్యంగా తన కొలీగ్స్. అందరూ కలిసికట్టుగా పగ సాధించారు. సుషమ ఎన్నడూ ఎవరి గురించి చాడీలు చెప్పి ఎరుగదు. ద్రోహ చింతన అంతకన్నా తెలియదు. కానీ అందరూ కలిసి సుషమని అవినీతి పరురాలిగా చిత్రీకరించారు.

"నీల్‌ని నా మనసులోంచి తీసి దూరంగా పారేసాను. అదొక పిచ్చితనం. కేవలం మాడ్‌నెస్".

మీనాక్షి వంగి సుషమ భుజమ్మీద చెయ్యి వేస్తూ అంది.

"రాణీ...ఎందుకివ్వాళ నీ మాటల్లో తీసి పారేసాను అనే శబ్దం ఎక్కువగా వినిపిస్తోంది"

సుషమ అరచేతులతో కనుపాపలను అదుముతూ కూర్చునివుంది-

"కొంతకాలం పోయాక నువ్వు నాకో ధనిక ఆసామిని చూస్తే పెళ్ళి కూడా చేసుకుంటాను. పచ్చతోరణాలు కట్టి, విద్యుద్దీపాలతో అలంకరింపజేసి, పెళ్ళి బొట్టు పెట్టి, అగ్నిచుట్టూ తిప్పి పెళ్ళి జరిపించెయ్-స్వాతిలా"

"సుషమా!" మీనాక్షి ఆమె భుజాలు పట్టుకుని బలంగా కుదిపింది. సుషమ పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"ఒకసారి నేను మిసెస్ ధర్‌తో అన్నాను. జీవితంలో అనేకం జరిగిపోతుంటాయని-ఆరోజు నేను నిజమే చెప్పాను. చూడు ఎన్నిరోజులైందో నీల్ వచ్చి. కనీసం నేను ఎలా వున్నానో చూచి వెళ్ళటానికైనా రాలేదు. ఇప్పుడు అందరి కళ్ళుచల్లబడి వుంటాయి. మిస్‌శాస్త్రి మనసు మరీ ఆనందపడిపోయి రోజూ హాయిగా నిద్రపోతూ వుండివుంటుంది".

"సుషమా కొన్నిరోజుల పాటు శలవు పెట్టి ఎటైనా వెళ్ళరాదూ! ఒక్కదానివే ఇక్కడ ఈ వాతావరణంలో ఎంతకని విలపిస్తుంటావు?"

"మర్చిపోవటానికి ఏదైనా మందుంటే చెప్పు దయచేసి. నేను అన్నీ మర్చిపోవాలనుకుంటాను. ప్రతి క్షణం అదే ముఖం, అవే సంఘటనలు కళ్ళ ముందు ప్రత్యక్ష మవుతున్నాయి. ఇంక నాకు శాంతి ఎలా లభిస్తుంది?"

"నీల్‌ని రావద్దని నువ్వేగా చెప్పావు-ఫోన్ చేసి పిలిపించనా?" మీనాక్షి అడిగింది.

"వద్దు మీనూ" సుషమ మౌనంగా కూర్చుంది. పాలిపోయిన ఆమె తెల్లటి ముఖమ్మీద వ్యథ స్పష్టంగా కనిపిస్తోంది. కళ్ళు నల్లటి జెండాల్లా వాలిపోయి వున్నాయి.

రోజూ క్లాసులో సుషమ లెక్చర్లు జావుంటున్నాయి. కానీవాటిల్లో ఇదివరకటిలాజీవంవుండంలేదు. ఈతేడాని ఎవరూ గమనించటం లేదు. సుషమని నీల్‌నుంచి విడగొట్టి అందరూ ఆనందిస్తున్నట్టుగా వుంది. కానీ నీల్ లేకుండా సుషమ

వుండదు. వున్నా జీవచ్ఛవంలా మిగిలి పోతుంది. మరుభూమిలో దారితప్పి తిరుగుతున్నట్టు సమాధులను మైలు రాళ్ళుగా భావిస్తూ అక్కడక్కడే తిరిగే పిచ్చిదాని నీడలా మిగిలిపోతుంది.

* * *

ఆరోజు కాలేజికి శలవు. సుషమ ఇంట్లో వుండలేక బయట నిర్జనంగా వుండే ప్రదేశాలు పట్టుకు తిరిగి తిరిగి అలసిపోయి తిరుగుముఖం పట్టింది. ఎంత దూరం నడిచినా కాలేజీ గేటు రావటంలేదు. అప్పుడు తెలిసింది. సుషమకు తను ఎంత దూరం అనాలోచితంగా నడిచేసిందో! కాళ్ళూ, చేతులు నీరసంగా వ్రేలాడబడి పోతున్నాయి. కాలేజీ గేటు దగ్గరకు వచ్చి సుషమ ఒక్క క్షణం ఆగిపోయింది. అక్కడ నీల్ కారు ఆగివుంది. నీల్ ఇంట్లోకూర్చుని సిగరెట్ కాలుస్తున్నాడు. అతడు సుషమని చూడలేదు. సిగరెట్ ఆఖరు దమ్ములాగి బయటకు విసిరి కొట్టాడు. సిగరెట్ బయట నీళ్ళునిండి వున్న చిన్న గుంటలో పడి ఆరిపోయింది

"ఎలా వచ్చావు?" సుషమ నిసత్రాహంగా అడిగింది. నీల్ ఏ భావములేని సుషమలోకి కాసేపు చూసి అపరాధిలా అన్నాడు. "చాలా రోజులైపోయింది!..." అతడి అసంపూర్తి వాక్యం ఇద్దరిమధ్యా వ్రేలాడుతుంచే శ్వాస బలంగా పీల్చుకుంటూ అంది. "అవును చాలా రోజులైంది. నువ్వు బావున్నావు కదూ!"

నీల్ కలలో కనిపించే ఆకృతిలా అవాస్తవికంగా కనిపిస్తున్నాడు సుషమకు.ఆమె చేయిచాపి అతడిభుజాన్ని తాకుతూ అంది." నువ్వు ఇంక రావను కున్నాను" ఆమె స్వరం తెగిపోయింది.

నీల్ చిరునవ్వు సుషమ కళ్ళలోంచి పొంగి పొర్లుతున్న కన్నీటిలో కొట్టుకు పోయింది.

"నువ్వేగా ప్రతిసారి రావద్దు... రావద్దు... అని ఆంక్షలు విధిస్తావు?"

"నువ్వు ఎన్నిసార్లు విన్నావు గనుక నా మాటని? ఈసారి నా ఆంక్ష మాత్రం నువ్వు అంగీకరించావా ?"

'నీల్ నెమ్మదిగా అన్నాడు' తప్పు అయిపోయింది. ఒప్పుకుంటున్నాను. కనీసం ఇకనైనా నన్ను రావద్దని చెప్పకు ఆ తరువాత నన్ను దోషిగా నిలబెట్టకు?"

సుషమ చుట్టూ తిరిగివచ్చి కారు డోరు తెరుచుకుని లోపల కూర్చుంది. తనూ వచ్చి కార్లో కూర్చుని డోర్ మూస్తూ అడిగాడు నీల్ "ఎటువెళ్దాం?"

"ఎక్కడికైనా సరే"

నీల్ కారు నిర్మానుష్యంగావున్న రోడ్డు వెంట పోనిస్తున్నాడు. చాలా దూరం వచ్చాక ఒక శిథిలమైపోయివున్న పాత కట్టడం దగ్గర కారు ఆపి ఇద్దరు దిగి పచ్చటి గడ్డివున్న నేల మీద కూర్చున్నారు. ఇద్దరూ మౌనంగా వున్నారు. ఆ మౌనాన్ని బద్దలు చేద్దామనే ప్రయత్నం ఇద్దరికీ లేదు. ఆక్షణంలో తనకు దొరుకుతున్న సంవేదనని పూర్తిగా గుండెల్లోకి దించేసుకునే ప్రయత్నం చేస్తోంది సుషమ. పచ్చటి గడ్డి తాలూకు చల్లటి స్పర్శ, నెమ్మదిగా వీస్తున్న వసంతాగమన పవనాలు, విశాలంగా తెరుచుకుని ఆకాశం, చిన్న చిన్న చుక్కలు పక్కనే నీల్.

"సుషమా నన్నెందుకిలా హింసిస్తున్నావు?" వ్యాకుల స్వరంతో అడిగాడు నీల్.

సుషమ జవాబు చెప్పలేకపోయింది.

దూరంగా కనిపిస్తున్న ఆకాశ దీపాలవైపు చూస్తుండిపోయింది.

"నా వైపు చూడు సుషమా! అప్పుడప్పుడు నువ్వు నాకు అతిదగ్గరగా వుండి కూడా ఎంతో దూరంగా వున్నట్టు అనిపిస్తావు. ఏదన్నా మాట్లాడు - ఏదో ఒకటి చెప్పు"

సుషమ నిర్జీవమైన కళ్ళతో నీల్ వైపు చూసింది.

"ఏం చెప్పను?"

"ఇంక నాకు చెప్పటానికి ఏ కబురు మిగల్లేదా నీలో?"

"ఇంతవరకు నేను నీతో ఏదీ పూర్తిగా చెప్పనే లేదు" సుషమ నవ్వు ముక్కలై శూన్యంలో కలిసిపోయింది.

"ఆ మాటలు వదిలెయ్యి నీల్. ఏదో పిచ్చాపాటి ప్రపంచం గురించి మాట్లాడుకుందాం. రా నీకు తెలుసా త్వరలో మీనాక్షి పెళ్ళి అయిపోతుంది. తరువాత మిస్ శాస్త్రి డియరెస్ట్ ఎటో తప్పిపోయింది. అయినా రోజూ ఉదయం సాయంత్రం దాని కప్పులో పాలుపోసి వుంచుతుంది. మిస్ శాస్త్రి. అది తప్పకుండా తిరిగి వస్తుందని ఆవిడ నమ్మకం. దాన్ని గురించి మాట్లాడేటప్పుడు ఆవిడ కళ్ళల్లో నీళ్ళు నిలుస్తాయి. కేవలం నాకు మాత్రమే తెలుసు డియరెస్ట్ ఇంక తిరిగి రాదని. భైరీ మొగుడు మిలటరీ నుంచి వచ్చాడు. అతను డియరెస్ట్ని చంపి ఎటో పారేసాడు"

"సుషమా! నా గురించిన ఆలోచనే నీకు లేదా? నా పట్ల ఇంత క్రూరంగా ఎందుకు వ్యవహరిస్తున్నావ్?"

పైన ఒక విమానం ఎగురుకుంటూ ఎయిర్‌పోర్ట్ దిశగా వెళ్ళిపోయింది. సుషమ దాని ఎర్రటి లైట్ల వైపు చూస్తూ కూర్చుంది.

"ఒక గులాబీ పువ్వు రెక్కల్ని త్రుంచేస్తే పువ్వు కెలా వుంటుందో ఇప్పుడు నాకు పూర్తిగా అనుభవంలోకి వచ్చింది. అలా త్రుంచేసిన రెక్కల మీదే ఇప్పుడు నేను కూర్చుని వున్నాను."

నీల్ కంపించిపోతూ సుషమ వైపు చూశాడు. ఏదో చెప్పబోయి ఆగిపోయాడు. సుషమ గమనించింది.

"అయితే నీ నిర్ణయం మారదన్న మాట?" నీల్ అడిగాడు. సుషమ తలాడించి, గడ్డి తెంపుతూ కూర్చుంది. ఆ సమయంలో ఉన్మాద కెరటాలు కొన్ని తనని తీరానికేసి విసిరికొట్టినట్టు, తను ముక్కలు, ముక్కలుగా విరిగి ఇసుక దిబ్బల్లో కలిసిపోయి అదృశ్యమైనట్టు అనిపించింది. ఆమె తన చెయ్యిచాచి నీల్ చేతిని పట్టుకుందామనుకుంది. కానీ చెయ్యలేదు. తనని మర్చిపొమ్మని నీల్‌తో చెబుదామనుకుంది చెప్పలేదు. కాలం అన్నింటినీ మరిపింప జేస్తుంది. నీల్ నుంచి తను ఏమిటి పొందింది తన నుంచి నీల్ ఏమిటి పొందాడు? లెక్కలు దేనికి? మర్చిపోవడం అనే మాట ఏమిటి అసలు? ఎక్కడ నుంచి పుట్టుకొచ్చింది? మరుపులు, జ్ఞాపకాలు అన్నీ మనసు మీద ఆధారపడి వుంటాయి! దైనందిన జీవితంతో విసిగిపోయి మనుషులు ఈ బంధాలను ఏర్పరుచుకుంటారు తెంచుకుంటారు. ఏదో దృశ్యం కనిపిస్తుంది. ఏదో గుచ్చు కొచ్చేస్తుంది. అందరిదీ ఒకటేదారి - ఆ దారిన నిప్పులు గప్పిన నిప్పులున్నా, పువ్వుల కప్పిన ముళ్ళున్నా, పచ్చగడ్డి కింద అగాధాలు పొంచివున్నా నడవ వలసిందే! తప్పదు.

కారు మలుపు తిరిగింది. దూరంగా

కాలేజీ బిల్డింగ్! వెలుగుతున్న వందల విద్యుద్దీపాలు కనిపించాయి. ఒక్కో స్థంభానికి ఒక్కో దీపం అమర్చి వుంది.

"ఇదిగో వచ్చేసింది నీ జైలు" నీల్ అన్నాడు. సుషమ కారు బగుటనే ఆప మని చెప్పింది. కాని నీల్ లోపలకు తెచ్చేసాడు. సుషమ దిగి ఇంటి తాళం తీసింది. వెను దిరిగి నీల్ వైపు చూసింది.

"నన్ను లోపలికి పిలవనా?" అతడి స్వరం అతడి కళ్ళలాగే సుషమ శరీర మ్మీద పాకింది.

''వద్దు నీల్—ఇక నువ్వు వెళ్ళు" తన స్వరం తనకే వ్యర్థంగా ధ్వనించింది. ఆమె తన కాళ్ళ కిందపడి గిలగిల తన్నుకుంటున్న నీల్ స్పర్శలోని బాధని అనుభవిస్తోంది.

"వెళ్ళు నీల్ వెళ్ళు" సుషమ లోపపలకెళ్ళి తలుపులు మూసుకుంది. ఆఖరి సారిగా నీల్ చూచిన చూపు బల్లెంలా ఆమె హృదయంలో గుచ్చుకుంది. "వెళ్లు నీల్ వెళ్లు'' అదే మాటి ఆమెలో మార్మోగి, వెంటనే ఉబికి వచ్చిన కన్నీళ్ళలో తడిసి, చివికిపోయింది. ఆఖరున మిగిలిన చిన్న పోగు మళ్ళీ మేల్కొంది.

ఎందుకు వెళ్ళిపోయావు నీల్ ఎందుకు బలవంత పెట్టలేదు నన్ను? ఎందుకు మొండికెత్తలేదు వెళ్ళనని? ప్రతి చిన్న విషయం దగ్గర చిన్న పిల్లాడిలా మొండిగా నిలబడే నీ స్వభావం

ఏమై పోయింది?

* * *

"నువ్వింకా తయారు కానేలేదా?"

మీనాక్షి గొంతు విని సుషమ ఉలిక్కిపడి తల ఎత్తి చూస్తూ అంది. "ఇదిగో ఇప్పుడే వచ్చేస్తాను. నువ్వు కూర్చో" సుషమ బట్టలు మార్చుకుని తల దువ్వుకోసాగింది. మీనాక్షి పత్రిక పేజీలు తిరగవేస్తూ కూర్చుంది.

పది నిమషాల తరువాత ఇద్దరూ బయటికి వచ్చారు. కాలేజీ గోడమీద మాధవీ లత నిండా మొగ్గలతో కళకళలాడుతోంది. నిమ్మ పూల వాసన ఆవరణను చుట్టుకుని ఉక్కిరి బిక్కిరి చేస్తోంది. అక్కడక్కడా గుల్ మొహర్ పూల గుచ్ఛాలున్నాయి. మరి కొద్ది రోజుల్లో కాలేజీ మూసేస్తారు. ఆ సంవత్సరపు ఆఖరి పనిరోజులు అందరికీ రాత్రులూ, పగళ్లూ బారైనట్టు అనిపిస్తున్నాయి. మళ్లీ జూలై నెలలో కొత్త స్టూడెంట్లు, కొత్త టీచర్స్‌తో వాతావరణం పూర్తిగా మారిపోతుంది. ఈ మధ్య కాలంలో సుషమని మరో కొత్త రకమైన ఉదాసీనత ఆవరించుకుంది.

ఆఖరి రోజుల్లో జరుగబోయే సెషన్స్ గురించి, వార్డెన్ ఎన్నిక గురించి సుషమకు అంత ఆసక్తిగా లేదు. వచ్చే ఏడాదికి తను వార్డెన్‌షిప్ వదిలేసి ఓ మారు మూల గదిలో వుండిపోదామనుకుంది సుషమ. రెండో రోజు కాలేజీలో ఫంక్షన్ జరగబోతోంది. స్టూడెంట్లకు బహుమతి ప్రదాన కార్యక్రమం వుంటుంది. వాటి తాలూకు వస్తువులు కొందామని బయలుదేరారు ఇద్దరూ. సుషమ యూనివర్శిటీ నుంచి హిస్టరీ ప్రొఫెసర్‌ని ఆహ్వానించింది. ఫంక్షన్‌లో ఉపన్యాసం తరువాత అల్పాహార విందు తరువాత బహుమతుల కార్యక్రమం చూడవలసి వుంది.

బజారు వెళ్ళాక ముందుగా కొన్ని పుస్తకాలు కొని, తరువాత ఇద్దరూ పెద్ద బట్టల దుకాణంలోకి వెళ్ళారు. మీనాక్షి బట్టలు చూస్తోంది. రెండు చేతుల్లో పుస్తకాలు పట్టుకుని సుషమ పరిసరాలను గమనిస్తూంది. ఫుట్‌పాత్ మీద పూలమ్మే వాళ్ళు గొంతు చించుకుంటూ మాలలు అమ్ముతున్నారు. చాలా మంది కొనేసుకుంటున్నారు. సుషమ చేత్తో సంజ్ఞ చేసి ఓ పూలబుట్టవాణ్ణి పిలిచింది.

ఒక బారాటి మాల కొనేసింది.

"సుషమా!" ఎవరిదో పిలుపు విని తల తిప్పి చూసింది. కౌసల్యగార్ని పోల్చుకోవటానికి సుషమకు ఓ క్షణకాలం పట్టింది. ఆమె కళ్ళు చుట్టు పక్కల నీల్ కోసం వెదికాయి.

"మీరు ఇక్కడికి ఎప్పుడొచ్చారు?" సుషమ అడిగింది.

"ఇవ్వాళ ఉదయమే వచ్చాను. కృష్ణమ్మ నీకోసం మరో రెండు చీరలు పంపింది"

"అలాగా" సుషమ అంది.

"మీరు ఒకసారి మా ఇంటికి రండి" సుషమ ఆహ్వానించింది.

"నేను ఎల్లుండి మళ్ళీ ఊరుకెళ్ళవలసి వుంది. నీల్‌ని చూద్దామని వచ్చాను. రేపు వెళ్ళిపోతున్నాడుగా అందుకని".

"ఎక్కడికి?" సుషమ ఉలికిపాటుతో అడిగింది.

"నీకు తెలియదా?" కౌసల్య ఆశ్చర్యంగా అడిగింది. "నీల్ హాలెండ్ వెళ్తున్నాడు. కంపెనీవాళ్ళు పంపి





స్తున్నారు. రేపు రాత్రి ఫ్లైట్‌లో వెళ్ళి పోతాడు. మేమందరం వీడ్కోలు ఇవ్వ డానికి వచ్చాం. మీరు నీల్ అమ్మగారు"

సుషమ వాళ్ళ పక్కనే నిలబడివున్న నడి వయసు ఆవిడకి నమస్కారం పెట్టింది. వాళ్ళకు కాస్త దూరంలో నిల బడ కుతూహలంగా తననే చూస్తున్న మరో అమ్మాయి - బహుశా నీల్ చెల్లెలు అయివుంటుందనుకుంది.

"చాలా రోజులకు గాని తిరిగిరాడా?"

"ఏమో తెలియదు. నాలుగైదు ఏళ్ళు పట్టవచ్చునేమో!" సుషమ తనలో రగులు కుంటున్న ఆత్రుతని చూసి తనే ఆశ్చర్య పోతోంది" అవును ఒకసారి వెళ్ళాక అంతా తిరిగి చూసిన తరువాతే వస్తారు ఎవరైనా.

"నీల్ ఏదీ చెప్పడు. ఎప్పుడొస్తాడో మరి" కౌసల్య అంది "సరే సుషమా! మేం వెళ్తాం. నువ్వు చప్రాసీని పంపి చీరలు తెప్పించుకో"

సుషమ వాళ్ళకు నమస్కరించింది. వాళ్ళందరూ వెళ్ళిన తరువాత కూడా పూలమాలను చేతిలో పట్టుకుని అక్కడే నిలబడింది. మీనాక్షి దుకాణం లోంచి బయటకు వచ్చింది. తనకు పూలమాల అందిస్తూ అంది సుషమ "తీసుకో ఇవి నీవి"

"థాంక్యూ డార్లింగ్" మీ నా క్షి నవ్వింది. "నీచేతులతో అలంకరిస్తే సంతో షిస్తాను." "సుషమ మాల జడపాయల మధ్య అలంకరిస్తూ చెప్పింది. "మీనూ! ఇప్పుడే కౌసల్యగారు కలిశారు. నీల్ రేపు హాలండ్ వెళ్తున్నాడని చెప్పింది. రేపు రాత్రి ఫ్లైట్‌లో ప్రయాణం"

మీనాక్షి సుషమ వైపు తిరిగి ఆమె ముఖం చూస్తుండిపోయింది.

"ఏమిటలా చూస్తున్నావు?" సుషమ నవ్వింది. మీనాక్షి మాట్లాడకుండా తన చేతిని సుషమ భుజమ్మీద వేసింది.

"పద వెళ్దాం" మీనాక్షి అంది. పూల వాళ్ళ కేకలు, మీనాక్షి జడలో పువ్వుల పరిమళం, చుట్టూ మనుషుల కోలాహలం, దుకాణంలో ఆకుపచ్చటి వెలుగు, పక్కనే వెళ్తున్న పిల్లాడి నవ్వు,-ఇవన్నీ ఒక్క సారిగా అసహ్యంగా తయారైనట్టు అని పించింది సుషమకు. మీనాక్షి టాక్సీ కేకేసింది. ఇద్దరూ ఎక్కి కూర్చున్నారు. సుషమ కిటికీలోంచి బయటకు చూస్తూ కాలేజీకి వచ్చే వరకు మౌనంగానే వుండి పోయింది.

భైరు తలుపు తెరవగానే సుషమ అడి గింది.

"ఎవరైనా వచ్చారా?"

"లేదు" భైరు అంది.

"పోనీ ఫోను" భైరు లేదన్నట్టు తలా డించింది. మర్నాడు ఉదయం ప్రతి ఉదయంలాగే తాజాగా వుంది. మాలి వచ్చి పూలు ఇచ్చి వెళ్ళాడు. హిస్టరీ అసోసియేషన్ సెక్రటరీ వచ్చి సభ ముగిసాక ధన్యవాదాలు ఎలా చెబితే బావుంటుందో అడిగి తెలుసుకుని వెళ్ళింది. రాత్రికి హాస్టల్లో ఫంక్షన్ జరుగుతోంది. సాంస్కృతిక కార్యక్రమాలు కూడా వున్నాయి.

సుషమ ఈ పనులన్నిటిలో మునిగి పోయి బిజీగా వుంది. తనే స్వయంగా పనులన్నీ చేయించింది. "మీకెందుకొచ్చిన శ్రమ? ఈ పనులన్నీ నేను చూసుకుం టాను. మీరు వెళ్ళి రెస్టుతీసుకోండి. లేక పోతే అలసిపోగలరు" అంటూ గంట కోసారి సెక్రటరీ గుర్తు చేస్తోంది.

ఆ కోలాహలం, హడావుడిలోనే

మీనాక్షి హటాత్తుగా అడిగింది "నువ్వు ఎయిర్‌పోర్టుకి వెళ్ళవా?"

సుషమ జవాబు చెప్పలేదు. బహు మతులు లిస్టు ప్రకారం సరిపోతాయో లేదోనని చూసుకుంటోంది. మీనాక్షి మౌనం వహించింది.

అన్ని పనులు సక్రమంగా జరిగి పోయాయి. ఉపన్యాసం వింటున్నప్పుడు ఎవరూ గొడవ చేయలేదు. ఇండ్లకు త్వరగా వెళ్ళిపోదామని ఎవరూ హడా వుడి ప్రదర్శించలేదు.

కానీ ఈ మధ్య కాలంలో క్షణానికో సారి కౌసల్య మాటలు ప్రతిధ్వనించాయి సుషమ చెవుల్లో, మనసులో. అన్ని పనుల్లో మునిగిపోయి వుండీ సుషమ నీల్ ఆ రాత్రికి వెళ్ళిపోతున్నాడన్న విషయం మర్చిపోలేదు.

సాయంత్రం హాస్టల్ డిన్నర్‌కోసం వచ్చింది సుషమ. మీనాక్షివచ్చి పక్కనే కూర్చుంటూ అంది "నేను ఫోను చేసి కనుక్కున్నాను. ఫ్లైట్ రాత్రి పది గంట లకు బయలు దేరుతుందట"

హాస్టల్ డైనింగ్ హాల్లో గడియారం తొమ్మిది గంటలు కొట్టింది. సుషమ అల్ల కల్లోలమైపోతూ లేచి నిలబడింది "నేను అర్జంటుగా వెళ్ళవలసివుంది" ఆమె ప్రిన్సిపాల్ తదితర అతిథులను క్షమించ మని అడిగింది.

సుషమ పరుగెత్తుకుంటూ బయటకు వచ్చింది. మీనాక్షి కూడా తన వెనకే రావటం గమనించింది.

"మీనూ ఒక టాక్సీకోసం ఫోన్ చెయ్యి" సుషమ అనునయంగా అంది. ఆమె బీరువా తెరిచి డబ్బు పర్సులో పెట్టింది. తీవ్రంగా జ్వరక్రాంతుడైన రోగిలా సుషమ వణికిపోయింది. డ్రస్సింగ్ టేబుల దగ్గర నిలబడి ఆమె లిప్‌స్టిక్ పూసుకుంది. కానీ పెదవులు ఎండి బిగు సుకుపోయి కనిపించాయి.

మీనాక్షి టాక్సీకోసం ఫోన్ చేసింది. ఆమె లోపలకు వచ్చి సుషమనే గమ నిస్తూ బాధను లోనాతూ నిలబడింది. సుషమ హేండ్‌బాగ్ టేబుల్ మీద పడి వుంది. బయలుదేరటానికి సిద్ధంగా వుంది సుషమ. గేటులోంచి లోనికి వస్తున్న టాక్సీ హెడ్ లైట్ల వెల్తురు తీక్షణంగా వుంది. సుషమ లేచి నిలబడింది. హాండ్ బ్యాగ్ అందుకుంది రెండు క్షణాలపాటు ఉద్విగ్నురాలైపోయి హాండ్‌బ్యాగ్ జిప్ తెరుస్తూ మూస్తూ వుండిపోయింది. ఆమె చేతులు, శరీరం, మెదడు, మనసు, ఆత్మ అన్నీ కంపించిపోతున్నాయి.

ఆ మరుక్షణమే సుషమ ప్రశాంతంగా మారిపోయింది. ఆమె మనసులోని వ్యాకులత ఒక అగాధ స్తబ్దతలో అదృ శ్యమైపోయింది. భయంకరమైన తుఫాను వచ్చి పెద్ద లోయలోకి పడదోసినట్టు అంతా మాయమైపోయింది.

"సుషమా టాక్సీ వచ్చింది" మీనాక్షి నెమ్మదిగా సుషమ వీపుమీద చేత్తో నిమురుతూ అంది. ఆ స్పర్శతో సుషమ ఉలిక్కిపడింది. ఆమె మీనాక్షి కళ్ళల్లోకి దీర్ఘంగా చూస్తూండిపోయింది. ఒక్క క్షణం గడిచింది. సుషమ చేతిలోని హాండ్ బ్యాగ్ జారి కిందపడింది. ఆమె అంది—

"మీనాక్షి టాక్సీని వెనక్కు పంపిం చెయ్. నేను వెళ్ళదల్చుకోవటంలేదు"

మీనాక్షి మారు మాట్లాడకుండా బయ టకు నడిచింది. సుషమ అరచేతులతో కనుపాపలనుఅదుముకుంటూ కూర్చుంది. ఆమె కళ్ళల్లోంచి ప్రవాహంలా కన్నీళ్లు కింద జారుతున్నాయి. ★




# దేవుడి మేక




పిల్లల్ని కనకుండా పాలిచ్చే మేకలున్నాయా? ఉన్నాయి సార్! ఆశ్చర్యపడకండి. నల్ల మేకలు, తెల్ల మేకలు, ఎర్ర మేకలు ఉన్నట్టే ప్రత్యేక తెగకి చెందిన ఈ రకం మేకలు కూడా వున్నాయి. వీటిని 'పత్తిని మేక'లంటారు. వీట్ని కూడా తెల్ల మేకల కోవలోకే చేర్చుకోవచ్చు.

ఇవి లక్షల్లో ఒకటిగా, ప్రత్యేకంగా పుడతాయి. మిగిలిన మేకల్లాగే ఆకులూ, గడ్డీ, గాదం తిని బతుకుతాయి.

కానీ –

విచిత్రమైన విషయమేమంటే వీటికి మగవాసన ... అంటే మేకపోతులంటే గిట్టదు. ఇవి పెరిగి పెద్దవై జతకట్టే వయసువచ్చినా ఏ మాత్రం మగ వాసన తగల్నియ్యవు. వీటిచుట్టూ ప్రదక్షిణలు చేసి, పోజులుకొట్టి ఫలితంలేక మేకపోతులు తోక దించుకుని పారిపోవల్సిందే.

ఇలా ఇవి 'పోతు ద్వేషిణులుగా'నే జీవితాంతం బ్రహ్మచారిణులుగా గడిపినా కనకుండానే పాలివ్వగలవు. ఒక్కోమేక లీటరు పాలదాకా ఇవ్వగలదు.

కసాయివాళ్ళు కూడా వీట్ని చంపడానికిష్టపడరు. పొరపాట్న వాట్ని సఫాచేస్తే తమ కుటుంబానికో, వ్యాపారానికో నష్టం సంభవిస్తుందని వాళ్ళ నమ్మకం. వీట్ని దేవుడి మేకలుగా భావిస్తారు. జీవితాంతం ఇలా గడిపి సహజంగానే మరణిస్తాయవి. ఆవులు, కుక్కలు వంటి ఇతర చతుష్పాద జంతువుల్లో కూడా ఇటువంటి ప్రత్యేక తరహా తెగ వుందని వినికిడి.



# చదరంగం

చదరంగంలో పడితే ఒళ్ళు తెలీకుండా గంటలగ్గంటలు ఖుషల్లా బాహ్య ప్రపంచాన్ని మఱచిపోయే వాళ్ళని మనం చూస్తుంటాం.

రష్యా చదరంగంలో పేరుపొందిన దేశం. ప్రపంచంలోని 130 మంది ప్రముఖ ఆటగాళ్లలోనూ 46 మంది రష్యాలోనే వున్నారు అంటే మూడింట



ఒక వంతు రష్యన్లేనన్న మాట. నిజానికీ ఆట మన దేశంలోనే పుట్టినా, మన వాళ్ళకన్నా రష్యావాళ్ళే చదరంగంలో నిపుణత సంపాదించారు.

ఇటీవలే మద్రాసు వచ్చిన ప్రముఖ రష్యన్ చదరంగపు ఆటగాడు బఖిరోవ్ ముప్ఫైమందితో చదరంగమాడి ఇరవై ముగ్గుర్ని ఓడించేడు. ఏడు గేములు డ్రా అయ్యాయి. బఖిరోవ్ పత్రికా విలేకరుల సమావేశంలో మాట్లాడుతూ భారత దేశం ఈ విషయంలో తగినంత శ్రద్ధ చూపడం లేదనీ, చదరంగం నేర్పేందుకు అవసరమైన శిక్షణనిచ్చే పాఠశాలలు నెలకొల్పడం లేదనీ అన్నాడు. రష్యాలో ప్రతి జిల్లాలో చదరంగం నేర్పేందుకు పాఠశాలలు, శిక్షణ ఇచ్చేందుకు ప్రముఖులైన ఆటగాళ్లు వున్నారని చెప్పేడు. చిన్న వయసునుంచే ఈ ఆట మీద పిల్లలకి అభిలాష కలిగించాలని, అప్పుడే ప్రముఖ ఆటగాళ్ళు తయారవుతారనీ చెప్పేడు.

చదరంగంలోకి రాక ముందు బఖిరోవ్ ఒక రష్యన్ సంస్థలో ఇంజనీర్‌గా పనిచేసేవాడు. మూడుసార్లు ప్రపంచ ఛాంపియన్‌గా చిన్న వయసులోనే ఎన్నిక కావడంతో ఇంజనీరుద్యోగానికి గుడ్‌బై కొట్టి చదరంగానికి అంకితమై పోయాడు. ప్రస్తుతం రష్యాలో భావిపౌరుల్ని ప్రముఖ ఆటగాళ్లుగా చేయాలని కంకణం కట్టుకొని వారికి చదరంగం పాఠాలు చెప్తున్నాడు.

# చిత్రానువాదం

సినిమా వినోదమే కాదు, పెద్ద వ్యాపారం కూడ! ఈ వ్యాపారాన్ని చేస్తూ కొందరు లక్షల్లక్షలు సంపాదిస్తే మరికొందరు చేతులు కాల్చుకొంటున్నారు.

మద్రాసులోని ఏ. వి. యమ్. సంస్థ

అధినేత ఏ.వి. మెయ్యప్పన్ చలన చిత్ర రంగంలో అనేక మార్పులు సాధించారు. భారత దేశంలో మొదటిసారిగా



'డబ్బింగ్'ను ప్రవేశ పెట్టిందీయనే! 1943 నాటి 'హరిశ్చంద్ర' అనే కన్నడ చిత్రాన్ని ముందుగా తమిళంలో 'డబ్' చేశారీయన. తర్వాత అనేక హిందీ చిత్రాల్ని దక్షిణ భారతీయ భాషల్లోకి డబ్ చేశారు. అదే శిక్షణని తండ్రి నుంచి పుణికి పుచ్చుకొన్నాడు మెయ్యప్పన్ కొడుకుసరవణన్.ఇతనిప్పుడుమాగ్నటిక్ ఎలక్ట్రానిక్ కంప్యూటర్‌డబ్బింగ్‌సిస్టమ్‌ను ప్రవేశపెట్టాడు. సినీ ప్రొజక్టర్‌లో కన్నా ఈ డబ్బింగ్ ప్రొజక్టర్‌లో ఫిలిమ్ ఆరు రెట్లు వేగంగా నడుస్తుంది. బొంబాయిలో బి.ఆర్. చోప్రా దగ్గర కూడ ఇటువంటి ప్రొజక్టరే వున్నా అది మామూలు ప్రొజక్టర్ కన్నా ఒకటిన్నర రెట్లు మాత్రమే అధికంగా నడుస్తుంది.

ఈ డబ్బింగ్ కార్యక్రమం 150 స్పీకర్స్, 18 థియేటర్స్, 50 మంది టెక్నీషియన్స్, ముప్పై మంది రచయితలతో విరాజిల్లుతూంది. 2,348 తమిళ చిత్రాల నుండి ఇప్పటికి 441 చిత్రాలను ఇతర భాషల్లోనికి 'డబ్' చేసిన ఘనత ఈ సంస్థకే దక్కింది.

## పిరమిడ్ ఇల్లు

పెళ్ళిచేసి చూడు, ఇల్లుకట్టి చూడు అని మనవాళ్ళు ఓ పక్కనుంచి హెచ్చరిస్తుంటే ఆగ్నేయ అమెరికాకు చెందిన టెడ్ టోలెట్ అనే యువకుడు సకల సదుపాయాలు గల ఇంటిని ఏ నమూనాలో కట్టాలా అని ఆలోచించి ఆలోచించి ఆఖరికి పిరమిడ్ ఆకారాన్ని ఎన్నుకున్నాడు.

ఆరు విశాలమైన గదులు, లోతు ఎక్కువలేని ఓ చిన్న సరస్సు, వేడి నీటి తొట్టి, లైబ్రరీ, సూర్యస్నానాలకి వీలుగా ఓపన్‌డెక్‌తో బాటు చిన్న జలపాతం కూడా అమర్చుకోవాలని అతని తాపత్రయం.

చదువు నిమిత్తం ఆగ్నేయ అమెరికా వచ్చిన టెడ్ సైకాలజీలో పట్టభద్రుడు. ఎడ్యుకేషనల్ రీసెర్చిలో పోస్ట్ గ్రాడ్యుయేషన్ సంపాదించి స్టేట్ యూత్ సర్వీస్‌లో పనిచేస్తూ ఓ శుభ ముహూర్తాన పిరమిడ్ ఇంటి నమూనా కళ్ళముందు మెదిలి డాక్టర్ మాక్ క్రగీన్ ఫీల్డ్ అనే అతనితో భాగస్వామ్యం కలుపుకుని పథకం ప్రకారం

ఇల్లు కట్టేందుకు ఇప్పటి వరకు 60 వేల డాలర్లు ఖర్చు పెట్టారు.

దాదాపు రెండున్నర సంవత్సరాల పిరమిడ్ భవంతిని గురించిన ఆలోచన వారి మనసుల్లో వుంది. అందరికీ అనువుగా వుండే విధంగా సంగీత, సాహిత్య, కళా రంగాలకు కూడా ప్రాముఖ్యతనిస్తూ వాటి కోసం ప్రత్యేకించి పెద్దపెద్ద గదులను నిర్మించాలన్న అభిప్రాయంతో ఆయా రంగాలలో నిష్ణాతులైనవారిని సమావేశ పరిచి వారి అభిప్రాయాలను కూడా సేకరించి, ఆలోచనలకు తుది రూపాన్నిచ్చి భవన నిర్మాణం మొదలెట్టారు.

మొత్తం 30అడుగుల ఎత్తువుండే పిరమిడ్ భవనం కోసం ప్రత్యేకించి ఉక్కు, నైరుగాజు, చెక్కతోబాటు పైపూతగా ఫైరస్ సిమెంటును కూడా ఉపయోగిస్తున్నారు.

వేడి నీటి సరస్సు ఈ భవంతికి ఒక ప్రత్యేక ఆకర్షణ అయితే సౌరశక్తి వల్ల నీరు వేడెక్కే హాట్ టబ్ మరో ఆకర్షణ. బుర్రంటూ వుండాలే గానీ ఎన్ని పథకాలైనా వేయచ్చు. ఎన్ని ఆలోచనలనయినా అమల్లో పెట్టచ్చు. అంతేకదండీ మరి!

## బొద్దింకల వేట

వంటింట్లో, చీకటి గదుల్లో, ట్రంకు పెట్టెల్లో స్వైర విహారం చేసే బొద్దింకల్ని రూపుమాపేందుకు ఓ కొత్త రకం సాధనం కనుగొన్నారు. ఇది ఒక పెట్టెలా చిన్న టైపురైటరు మోడల్లో వుంటుంది. బొద్దింకలొచ్చేచోట అంటే చీకటి గదుల మూలల్లో వీట్ని పెట్టాలట. ఆ పెట్టె లోపల బొద్దింకలనాకర్షించే పదార్థాలతో తడిపిన స్పాంజిని వుంచుతారు. కాస్సేపటికి ఆసువాసనలకాకర్షింపబడి బొద్దెంకలు వస్తుంటాయందులోకి. ప్రతి 22 నిమిషాలకి పెట్టెలోకి 250 ఓల్టుల విద్యుత్ పంపుతారు. దాంతో ఆ షాక్ తిని హరీమంటాయవి. లోపలేవున్న ఓ గొయ్యిలాంటి అరలో సమాధి చేసే ఏర్పాట్లు కూడా వున్నాయి. గొయ్యి నిండగానే ఆష్ట్రేలో బూడిద పారేసినట్టు వాట్నవతల పారేసి మళ్ళీ యధాప్రకారం బొద్దెంకల వేట మొదలెట్టొచ్చు. ఎక్స్టెర్మినేటర్‌గా పిలువబడే యీ పెట్టెలు గత డిసెంబరునుంచి సుమారు వెయ్యిదాక అమ్ముడు పోయాయంటున్నారు. దీని ఖరీదు 200 పౌండ్లు మాత్రమేనట. అంటే సుమారుగా మూడున్నర వేలరూపాయలన్నమాట. ఏటా 50,000 ఎక్స్టెర్మినేటర్లు వుత్పత్తి చేయాలని అవి తయారుచేసే కంపెనీ వారి ఆశయం. అయినా ఇంతఖరీదువి మనకెందుకండీ! మనకామాత్రం చేతగాదు గనుకనా!



# ముద్దుల పోటీ

అమెరికాలోని ఓ టి.వి. కంపెనీ ముద్దుల పోటీని నిర్వహించింది. గిన్నెస్ బుక్ ఆఫ్ రికార్డ్స్ ప్రకారం ఓ అమెరికన్ జంట గత సంవత్సరం 130 గంటల 2 నిముషాల సేపు ముద్దు పెట్టుకుని రికార్డుని స్థాపించింది దాన్ని అధిగమించడానికి 23 జంటల లోంచి 8 జంటలని ఎన్నుకున్నారు. ఓ జంట జపాను దేశస్తులు. మిగతా జంటలు ఆస్ట్రేలియా, జర్మనీ దేశాలకి చెందిన వాళ్ళు. ప్రతీ గంటలో 5 నిముషాలు విరామం ఇస్తారు వాళ్ళకి. గెలచిన జపనీస్ జంటని వుచితంగా యూరప్ దర్శించడానికి పంపారు. ఆ జంటలలో ఎవరికీ వివాహం కాలేదు !

# కంప్యూటర్ కవిత్వం

కంప్యూటర్ మానవ మేధస్సు తాలూకు అపూర్వ సృష్టి. ఇవాళ లెక్కలు, వాతావరణ వివరాలు వంటి అనేకం కంప్యూటర్ ద్వారానే జరిపిస్తున్నారు. మనిషి మెదడు చేయగల్గిన పనులు దాదాపుగా అన్నింటినీ కంప్యూటర్ చెయ్యగలదు. ప్రస్తుతం ఆఫీసుల్లో ఉద్యోగుల జీతాల వివరాలు, పట్టికలు, బాంకు అకౌంట్లు, విమానాల్లో రిజర్వేషన్ ఛార్టులు తయారు చెయ్యటం, రసాయనిక ఫార్ములాలని పరిష్కరించటం, పైలట్ లేని విమానం నడపటం, ట్రాఫిక్ సిగ్నల్స్ మార్చటం, కంపోజిటర్ల అవసరం లేకుండా ప్రెస్సుల్లో పని తేలిక చెయ్యటం మొదలైన అన్ని రంగాల్లో కంప్యూటర్ జోక్యం వుంది.

కానీ, చిన్న చిన్న లెక్కల్ని మాత్రం కంప్యూటర్ మనుషులకన్న ఎక్కువ సమయం తీసుకుని చేస్తుందట. ఉదాహరణకి ఎనిమిది నాలుగులెంతరా అని ఏ ఐదోక్లాసు వాణ్ని అడిగినా తకాలున చెప్తాడు. అదే కంప్యూటరైతే ఎనిమిదిని వరుసగా నాలుగుసార్లు కూడి అప్పుడుగాని సరైన సమాధానం ఇవ్వదు.



అమెరికాలోని శాన్‌ఫ్రాన్సిస్కో

నగరంలో గల ఒక కంప్యూటర్ కవిత్వం కూడా చెప్తుందట. చెయ్యి తిరిగిన రచయితల్లా కథలు కూడా చెప్పగలదట. ఈ కంప్యూటర్ల వల్ల వాటి యజమానుల ప్రాణం చాలా హాయిగా వుంటుందనడంలో ఏ మాత్రం సందేహం లేదు. మనుషులైతే కంపెనీ సొమ్ము గుటకాయస్వాహా చేస్తారన్న భయం వుంటుంది. దీన్తో ఆ భయం లేదుకదా! ముఖ్యంగా జీతాలు పెంచమని అందర్లా స్ట్రైకులూ, బంద్‌లూ చెయ్యదు. మనం ఎలా చెప్తే అలా వింటుంది.

# 99 ఏళ్ళ యువకుడు

మూడు తరాల విద్యార్థులకి రసాయనిక శాస్త్ర పాఠాలు నూరిపోసిన హిల్ట్ బ్రాండ్ అనే కాలిఫోర్నియా ప్రొఫెసరు ఇంకో సంవత్సరంలో శతవృద్ధుడౌతాడు. నిజానికది కాటికి కాళ్ళు చాచుకోవల్సిన వయసు.

తన వయసులో సగం వున్న వారికంటే దృఢంగానూ, ఉత్సాహంగానూ వుండి, స్కేటింగ్, ఈత వగైరాలు అలసిపోకుండా చేయటం చూసి యూనివర్సిటీ వారు అతని సర్వీసును పొడిగించారు. అందరూ 'బోర్' అనుకునే కెమిస్ట్రి సబ్జక్టును అతను బోధిస్తున్నపుడు ఆడిటోరియంలో అయిదు వందలమంది విద్యార్థులున్నాగాని సూది పడితే శబ్దం వచ్చేంత నిశ్శబ్దంగా వుండేది హాలు. అంత చక్కగా, సులభంగా అర్థమయేట్లు పాఠాలు బోధించేవాడాయన. పైగా 'ఉత్సాహం వురకలు వేస్తున్న యువకులు అంత శ్రద్ధగా వినడం అపురూపం కాదుటండీ' అంటాడు హిల్ట్‌బ్రాండ్ నవ్వుతూ.

మొదటి ప్రపంచ యుద్ధం జరిగినప్పుడు ఇతను ఫ్రాన్స్ యాంటీ గ్యాస్ వార్‌ఫేర్ బృందానికి నాయకుడిగా పని చేశాడు. సముద్రపు లోతుల్లోకి వెళ్ళి



రహస్యాల్ని భేదించేవారికి రక్షణగా వుండేందుకు ఇతడు కనిపెట్టిన ఆక్సిజన్, హీలియం మిశ్రమ పరిశోధనని కళ్ళకద్దుకుని తీసుకున్నారు నౌకా విభాగం అధికారులు.

99 ఏళ్ళ హిల్ట్‌బ్రాండ్‌ని చూస్తే ఈయన ఈజీగా ఇంకో వందేళ్లు ఆడుతూ, పాడుతూ బతికేస్తాడు అని అనిపిస్తుందెవరికైనా.

**Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.**

CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/ HD /4



"మామూలు
నిమ్మకాయను
కానండోయ్...
రుచులు నిండిన
'ప్రియ'
నిమ్మకాయను!"






"ప్రియ దృష్టిలో పడాలంటే ఏ నిమ్మకాయ అయినా పసిమివన్నెలో తాజాగా రసాలూరుతూ ఉండాలి. అప్పుడే మేలయిన మసాలాలు, స్వచ్ఛమయిన నూనెల తోడు దొరుకుతుంది. అదేవిధంగా చక్కని ఆరోగ్య సూత్రాలతో, అధునాతన ఫాక్టరీలో రుచులన్నీ నింపుకొని మీ విందుకు వస్తాను. అందమయిన సీసాల్లో కళకళ లాడుతూ మిమ్మల్ని ఆకర్షిస్తాను. అదుగో... అప్పుడే మీ నోరూరుతోంది. మరింక మాట లనవసరం?"

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ "ప్రియ" పచ్చళ్లు 300, 650 గ్రాముల సీసాల్లో లభిస్తాయి.

మామిడికాయ నిమ్మకాయ టొమాటో
అల్లం గోంగూర

**ప్రియ ఫుడ్స్**
ప్రైవేట్ లిమిటెడ్

Marketed by:
**MARGADARSI MARKETING PRIVATE LIMITED**
Eenadu Compound,
Hyderabad. 500 004

Kiron/PF/8015

**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**